Ammanudi
Telugu Monthly
Volume-1
Issue-7
Rs.20/-
Septembet 2015
Tenali, A.P

1993-2013 నడుస్తున్న చరిత్ర

తెలుగుజాతి పత్రిక

# అమ్మనుడి

సెప్టెంబరు 2015





## ప్రభుత్వం తన భాషా విధానాన్ని ప్రకటించాలి

## ఆంధ్రప్రదేశ్‌లో తెలుగు రక్షణ, అభివృద్ధి మహాసభ తీర్మానం







కీర్తిశేషులైన మామ - అల్లుడు
మహాకవి గుర్రం జాషువా,
నాస్తికోద్యమ నేత లవణం
(ఒకనాటి చిత్రం)



# అందరికీ ఆహ్వానం



ప్రముఖ పాత్రికేయుడు, రచయిత, కవి

## శ్రీ ఎ. కృష్ణారావుకు

## తాపీ ధర్మారావు పురస్కారం

**సెప్టెంబరు 19, 2015న విశాఖపట్నంలో**

తాపీ ధర్మారావు పురస్కారం ఈ ఏడాది ప్రముఖ పాత్రికేయుడు శ్రీ ఎ.కృష్ణారావుకు ఇవ్వాలని నిర్ణయమైంది. పురస్కార ప్రదానోత్సవం విశాఖపట్టణం ద్వారకానగర్‌లోని బి.వి.కె. కాలేజి ఎదురుగా గల పౌర గ్రంథాలయంలో సెప్టెంబరు 19, 2015 శనివారం సాయంత్రం గం.5లకు జరుగుతుంది.

శ్రీ ఎ.కృష్ణారావు ప్రసిద్ధుడైన పాత్రికేయుడు. ఆంధ్రజ్యోతి దినపత్రిక, ఎబిఎన్-ఆంధ్రజ్యోతి టి.వి.ఛానల్ లలో సంయుక్త సంపాదకులుగా పనిచేశారు. ఆంధ్రజ్యోతిలో 'ఇండియాగేట్' శీర్షికన ఆయన ప్రతివారం వ్రాసిన జాతీయ వార్తా వ్యాఖ్య ప్రశంసలను చూరగొంది. సుమారు ఇరవైమూడేండ్లు ఢిల్లీ కేంద్రంగా వివిధ తెలుగు, ఆంగ్ల పత్రికల్లో పనిచేసిన శ్రీ ఎ.కృష్ణారావు ఎన్నో జాతీయ, అంతర్జాతీయ సదస్సులలో పాల్గొన్నారు. పురస్కారాలను పొందారు. ఇటీవలే ఆయన 'న్యూ ఇండియన్ ఎక్స్‌ప్రెస్' సంపాదకులుగా హైదరాబాదు కేంద్రంగా బాధ్యతను చేపట్టారు.

ఈ నెల 19న తాపీ ధర్మారావు గారి జయంతి. ఈ సందర్భంగా 'తాపీ ధర్మారావు పురస్కారాన్ని' యూనియన్ పబ్లిక్ సర్వీస్ కమిషన్ పూర్వ సభ్యులు, ద్రవిడ విశ్వవిద్యాలయ పూర్వ ఉపకులపతి ఆచార్య కె.ఎస్.చలం వీరికి అందజేస్తారు. తరువాత **'నేటి మీడియా విస్మృత వర్గాలు'** (Media and Subaltern Groups) అనే అంశంపై పురస్కార గ్రహీత ప్రసంగిస్తారు. సభలో పలువురు పెద్దలు పాల్గొని ప్రసంగిస్తారు.

తాపీవారి అభిమానులు, కవులు, రచయితలు, పాత్రికేయులు, సామాజిక ఉద్యమకారులు, తెలుగు భాషాభిమానులు పాల్గొని సభను విజయవంతం చేయగోరుతున్నాము.

**తాపీ ధర్మారావు వేదిక, ఉత్తరాంధ్ర జర్నలిస్టు ఫ్రంట్**

వివరాలకు: డా॥ నాగసూరి వేణుగోపాల్ - 9440732392, డా॥ సామల రమేష్‌బాబు - 9848016136,
శ్రీ ఎం.ఆర్.ఎన్. వర్మ - 9848069524, శ్రీ ఎన్. నాగేశ్వరరావు - 9989966767

---

తాపీ ధర్మారావు పురస్కారాన్ని పొందినవారు



**డా॥నాగసూరి వేణుగోపాల్**
**2009**



**డా॥కె.శ్రీనివాస్**
**2011**



**శ్రీ టంకశాల అశోక్**
**2013**



**శ్రీ జి.శ్రీరామమూర్తి**
**2014**

## 'అమ్మనుడి' పత్రిక మీకు నచ్చితే, దయచేసి వెంటనే చందాదారులుగా చేరండి.

చందా సొమ్మును

- మనియార్డర్ ద్వారా పంపవచ్చు.
- ఆన్‌లైన్‌లో పంపవచ్చు.
- బ్యాంకు డి.డి. / చెక్ పంపవచ్చు.

మీకు ఎలా వీలయితే అలా పంపించవచ్చు.
వివరాలు 4వపుటలో చూడండి.
ప్రతినెలా పోస్టులో పత్రికను పంపగలము.

## రచయితలకు సూచనలు

1. విభిన్న అంశాలపై వ్యాసాలను పంపవచ్చు. ముద్రణలో 1 నుండి 3 పుటలకు మించకుండా ఉండాలి. అన్నిరంగాలలో తెలుగువారి శ్రేయస్సుకు సంబంధించిన రచనలను పంపండి. విమర్శలు విషయం పైనే ఉండాలి గాని వ్యక్తులపై గురిపెట్టి చేయరాదు. అప్రజాస్వామిక రచనలను తీసుకోలేము. సరళమైన తెలుగులో వ్రాయాలి. 2. రచనలను యూనికోడ్‌లో గాని, అను ఫాంట్స్ లో గాని టైప్ చేసి లేదా ఎ4 సైజు కాగితంపై వ్రాసి, స్కాన్ చేసి ammanudi@gmail.com కు పంపాలి. లేదా కొరియర్ / రిజిష్టర్డ్ / సాధారణ పోస్టులో పంపవచ్చు. 3. రచనతోపాటు రచన స్వంతమేనని, ఇతర పత్రికలకు గాని, ఇంటర్నెట్ పత్రికలకు గాని పంపలేదని, పరిశీలనలో లేదని, ఇంతవరకు ఎక్కడా ప్రచురణ కాలేదని హామీపత్రం విధిగా, స్పష్టంగా వ్రాసి పంపాలి. పోస్టల్ చిరునామా, ఫోన్ నెం., ఇ-మెయిల్ కూడా ఇవ్వాలి. ఈ వివరాలు లేని రచనల్ని తీసుకోలేము. 4. మాకు పంపే రచన నకలును మీ వద్ద ఉంచుకోండి. ప్రచురణకు ఎంపిక చేయని రచనలను తిప్పి పంపడం వీలుకాదు.

## కథారచయితలకు, కవులకు విన్నపం

1. మాట్లాడుకొనే తెలుగులో వ్రాసిన కథల్ని **'నడుస్తున్న చరిత్ర'** ప్రచురించిన సంగతి చదువరులకు, రచయితలకు తెలిసిందే. ఈ సంప్రదాయాన్ని **'అమ్మనుడి'** పత్రిక కొనసాగిస్తుంది. పాత్రల సంభాషణలు తప్పనిసరిగా మీ ప్రాంతంలో మాట్లాడుకొనే తెలుగు తీరులో ఉండాలి. కథాచిత్రణ కూడా మీ తెలుగు తీరులోనే ఉంటే మంచిది. కఠినమైన సమాసాలను ఉపయోగించవద్దు. తేలికైన తెలుగు మాటలు కుదరకపోతే జనం వాడుకలోని ఇతర ప్రాంతాల తెలుగు మాటల్ని వ్రాయవచ్చు. తప్పనిసరి అయితే తప్ప ఏ ఇతర భాషల మాటలను ఉపయోగించవద్దు. ఈ సూచనలే కవితలకూ వర్తిస్తాయి.

2. **'అమ్మనుడి'**లో ప్రచురణకు తీసుకొనే కథలు, కవితలు తెలుగువారి సామాజిక, భాషాసంస్కృతుల వికాసానికి తోడ్పడేవిగా ఉండాలి.

3. ప్రతినెలా ఒకటి లేక రెండు కథలను మాత్రమే ప్రచురించగలం. ముద్రణలో 2 లేక 3 పుటలకు మించకుండా ఉండేవాటినే తొలి ఎంపికకు తీసుకుంటాము. కవితలు 20 నుంచి 30 వరుస (లైన్ల)లకు మించకూడదు. ప్రతినెలా 4 లేక 5 కవితలకు మించి పత్రికలో చోటుండదు.

భాషా విధానాన్ని ప్రకటించాలని ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతూ గుంటూరులో తెలుగుభాష రక్షణ, అభివృద్ధిపై జరిగిన మహాసభ – సదస్సు తీర్మానించింది. దానితోపాటు 9 తీర్మానాలను ఆమోదించింది. భాషా విధానానికి సంబంధించి స్పష్టమైన సూచనలను చేసేందుకు ఆరుగురు నిపుణులు ఆరు అంశాలపై పత్రాలను సమర్పించారు.

పేజీ....9నుండి




## లోపలి పుటలలో....



కైసేత: **అ. రాజ్యలక్ష్మి, శంకర్,** రేఖాచిత్రాలు: **బాలి**
పకపకలు: **సరసి,** ఫొటోలు: **రాజేంద్రప్రసాద్**
ముఖచిత్రం: **కలిమిశ్రీ**

**పత్రికలో రచయితలు వ్యక్తం చేసే అభిప్రాయాలు వారి స్వంతం. వారితో పత్రిక యాజమాన్యం, సంపాదకుడు ఏకీభవించవలసిన అవసరం లేదు.**

**రచనలు, ఉత్తరప్రత్యుత్తరాలకు : డాక్టర్ సామల రమేష్‌బాబు,** సంపాదకుడు, **అమ్మనుడి,**
జి-2, శ్రీ వాయుపుత్ర రెసిడెన్సీ, హిందీ కళాశాల వీధి, మాచవరం, విజయవాడ-520004. e-mail : ammanudi@gmail.com
దూరవాణి: కార్యాలయం : *0866-2439466* సంపాదకుడు : *9848016136*

# తెలుగుజాతి పత్రిక
# అమ్మనుడి
మాసపత్రిక

● నుడి ● నాడు ● నెనరు

**సంపాదకుడు డా॥ సామల రమేష్‌బాబు**


శాలివాహన శకం 1937 మన్మథ నామ సంవత్సర నిజ శ్రావణమాసము *(సెవ్వాపి) బహుళ తదియ మంగళవారము నుండి భాద్రపద *(ముంగారాపి) బహుళ చవితి బుధవారము వరకు

* సెవ్వాపి, ముంగారాపి = తెలుగు నెలలు


## చందా వివరాలు

| | | వ్యక్తులకు | సంస్థలకు | విదేశీయులకు |
|---|---|---|---|---|
| శాశ్వత చందా | : | రూ.5000 | రూ.7500 | -- |
| 6 సం॥ | : | రూ.1000 | రూ.1500 | 150 డాలర్లు |
| 3 సం॥ | : | రూ. 600 | రూ.1000 | 75 డాలర్లు |
| 1 సం॥ | : | రూ. 240 | రూ. 400 | 25 డాలర్లు |

ఎం.ఓ. లేదా తెనాలిలో చెల్లునట్లు బ్యాంకు డి.డి.ని **'అమ్మనుడి'** పేర పంపాలి. చెక్కు పంపేట్లయితే దయచేసి అదనంగా రు.30 లు చేర్చి పంపండి.

**ఆన్‌లైన్ ద్వారా చందాను పంపేవారు**

**'అమ్మనుడి'**-యాక్సిస్ బ్యాంకు, తెనాలి శాఖకు పంపాలి.

**AMMA NUDI - AXIS BANK, TENALI**

అక్కౌంట్ నెం. **915020010550189**

**IFSC Code : UTIB0000556**

ఆన్‌లైన్‌లో చందాను పంపినవారు, ఆవెంటనే దయతో - చిరునామా, ఫోన్ నెం. తదితర వివరాలను, జాబుద్వారాగాని, ఫోన్ మెసేజీ ద్వారాగాని తెలుపగలరు.

చందాలు పంపడం, దానికి సంబంధించిన ఉత్తర ప్రత్యుత్తరాలకు చిరునామా


**డా॥ సామల లక్ష్మణబాబు,** ప్రచురణకర్త, 'అమ్మనుడి'
8-386, జీవక భవనం, అంగలకుదురు పోస్టు, తెనాలి
గుంటూరు జిల్లా - 522 211. ఫోన్ : 9440448244
ఇ-మెయిల్ : ammanudi@gmail.com


**చందాదారులు కోరినట్లయితే ఆన్‌లైన్‌లో కూడా పత్రికను పంపగలము. ఇందుకోసం మీ ఇ-మెయిల్ ఐడిని తప్పక తెలుపగలరు.**

### చందాదారులకు తప్పనిసరి సూచనలు

1. చందా కాలం ముగింపు తేదీ - పత్రిక కవరుమీద మీ చిరునామా పై భాగంలోనే ఉంటుంది. గమనించండి.
2. మీ చందా పూర్తయ్యేందుకు ఒక నెల ముందే దయచేసి మీ చందాను పంపించండి.
3. మీ ఇంటి నెంబరు, పోస్టాఫీసు పిన్‌కోడ్ నెంబరు తదితర పూర్తివివరాలు మీ చిరునామాలో తెలియపరచాలి. మీ ఫోన్ నెంబరును, వుంటే మీ మెయిల్ ఐడి ని తెలపాలి. మీ చిరునామా మారినట్లయితే వెంటనే తెలియజేయండి.

# 'నడుస్తున్నచరిత్ర' చందా ఉన్నవారికి సూచన

**'అమ్మనుడి'** పత్రిక ఇంతకు ముందున్న నడుస్తున్నచరిత్ర ఆశయాదర్శాలతో వస్తున్నదే. కానీ పత్రికను **'తెలుగుజాతి'** ట్రస్టు ప్రచురిస్తున్నది. అయినా, కొందరి విజ్ఞప్తి మేరకు నడుస్తున్నచరిత్రకు చందాలు మిగిలివున్న వారికి కూడా వారి చందా సొమ్ముకు సరిపడా **'అమ్మనుడి'** పత్రికను పంపించాలని తెలుగుజాతి ట్రస్టు నిర్ణయించింది. కనుక ప్రతివారికి వారి చందా సొమ్ము ఇప్పుడు **'అమ్మనుడి'** చందా వివరాల ప్రకారం ఎప్పటివరకూ సరిపోతుందో - పత్రికను పెట్టి పంపే కవరుపై చిరునామా పైన ముద్రించి వుంటుంది. దానిని చూచుకొని, దయచేసి సకాలంలో **'అమ్మనుడి'** చందాను పంపించి పత్రికకు మీ మద్దతును కొనసాగించ గోరుతున్నాము.

### వెంటనే చందాలు పంపండి

అమ్మనుడి తొలి నాలుగు సంచికలను (మార్చి, ఏప్రిల్, మే, జూన్) నడుస్తున్న చరిత్ర చందా మిగిలి ఉన్నవారికి, అయిపోయిన వారికీ కూడా పంపించాము. ఇకపై చందా మిగిలిఉన్నవారికి, కొత్త చందాదారులకు మాత్రమే పంపగలము. పైన ఇచ్చిన సూచనను కొందరు గమనించి ఉండకపోవచ్చు. చూసినప్పటికీ పనుల వత్తిడిలో చందాసొమ్మును పంపించకపోయి ఉండవచ్చు. అటువంటివారు దయచేసి వెంటనే పత్రిక చందా పంపమని మనవి.

### శాశ్వత చందాదారులకు మనవి

'నడుస్తున్నచరిత్ర'కు రు. 1000 లు చెల్లించి, శాశ్వత చందాదారులుగా చేరినవారు 'అమ్మనుడి' పత్రికకు శాశ్వతచందా రు.5000 లకు గాను రు.4000 లు మాత్రం పంపి కొత్తగా రశీదు పొంద ప్రార్థన. అలా చేయలేనివారికి ఏడాదిపాటు **'అమ్మనుడి'** పత్రికను పంపించగలం. అప్పటికీ చందాను కొనసాగించలేని వారికి పత్రికను పంపజాలమని మనవి చేస్తున్నాము. దయచేసి సహకరించగోరుతున్నాము.

### విన్నపం

'నడుస్తున్నచరిత్ర' పత్రికను అనేకమందికి ఉచితంగా పంపిస్తుండేవారము. ఇకపై ఉచితప్రతులు పంపడం వీలుపడదు. పత్రిక కావలెనని కోరుకొనే వారందరూ చందాదారులుగా చేరవలసిందిగా కోరుతున్నాము. మీ మిత్రులను కూడా ప్రోత్సహించి, చందాదారులుగా చేర్చి పత్రికను శక్తివంతం చేయవలసిందిగా విజ్ఞప్తి చేస్తున్నాము. ఇంతవరకు పత్రిక పరిచయం లేనివారు మాదిరిప్రతి (శాంపుల్‌కాపి) ని కోరినచో వారికి ఉచితంగా పంపగలము.

\- ప్రచురణకర్త

# తెలుగుజాతి (ట్రస్టు)

## విన్నపం

**ట్రస్టుకు ఈ క్రింది విధంగా విరాళాలనిచ్చి తోడ్పడ గోరుతున్నాము.**

| | |
|---|---|
| **ప్రోత్సాహకులు రు. 10,000/-లు** | **పోషకులు రు. 25,000/-లు** |
| **విశిష్ట పోషకులు రు. 50,000/-లు** | **రాజ పోషకులు రు. 1,00,000/-లు** |

వీరి ఫొటోతో క్లుప్తంగా పరిచయాన్ని **'అమ్మనుడి'** పత్రికలో ప్రచురిస్తాము.
వీరికి పత్రికను, ట్రస్టు ప్రచురించే పుస్తకాలను ఉచితంగా పంపిస్తాము.

సొమ్మును చెక్ / డ్రాఫ్టుగా / ఆన్‌లైన్‌లో 'TELUGUJAATHI' పేర పంపాలి.
యాక్సిస్ బ్యాంక్, సికిందరాబాదు.
అక్కౌంట్ నెం. 914020020387880 I.F.C.Code : UTIB0000068

**డా॥ సామల రమేష్‌బాబు,** మేనేజింగ్ ట్రస్టీ, 9848016136

| **పారుపల్లి కోదండరామయ్య** | **డా॥వెన్నిసెట్టి సింగారావు** | **స.వెం.రమేశ్** | **సామల లక్ష్మణబాబు** |
|---|---|---|---|
| ట్రస్టీ, 9505298565 | ట్రస్టీ, 9393015584 | ట్రస్టీ, 8500548142 | ట్రస్టీ, 9440448244 |

'నడుస్తున్న చరిత్ర' ప్రోత్సాహంతో ఆంధ్రప్రదేశ్‌లోనే కాక, పొరుగు రాష్ట్రాల్లోనూ నివసిస్తున్న తెలుగువారి శ్రేయస్సుకు, తెలుగు భాషోద్యమ నిర్మాణానికి కృషి జరుగుతున్నది. దానినే ఇప్పుడు **అమ్మనుడి** కొనసాగిస్తున్నది. దక్షిణ భారతదేశమంతటా చిక్కగా అల్లుకొని, మొత్తం దేశంలోనేకాక, అనేక ఇతర దేశాల్లో కూడా భాషా సాంస్కృతిక మూలాలను విస్తరించుకొనివున్న తెలుగుజాతిలో చైతన్యాన్ని పెంపొందించి, వారిలో సంఘీభావాన్ని, భావసమైక్యతను బలపరచవలసిన అక్కరను గుర్తించిన కొందరు కార్యకర్తలు అందుకోసం పనిచేస్తున్నారు. ఇందుకు తగ్గవిధంగా ఇంకా సమగ్రంగా, బలంగా ఒక పత్రికను, దానితోపాటు కొన్ని పుస్తకాలను ప్రచురించవలసిన అవసరం ఏర్పడింది. కొన్ని కార్యక్రమాల్ని కూడా చేపట్టవలసివుంది. ఇందుకోసం ఇప్పుడు 'తెలుగుజాతి' పేరిట ఒక ట్రస్టును రిజిస్ట్రేషన్ చేయించాము. (92/2014).

తెలుగువారు అన్ని రంగాల్లో ముందడుగు వేసేందుకు తోడ్పడటమే ఈ ట్రస్టు లక్ష్యం. తెలుగు 'అమ్మనుడి''గా కలిగినవారు ఎక్కడ నివసిస్తున్నా, వారి శ్రేయస్సు కోసం ఈ సంస్థ పనిచేస్తుంది. ఆంధ్రప్రదేశ్, తెలంగాణాలలోనే కాక ఇతర రాష్ట్రాల్లోనూ, ఇతర దేశాల్లోనూ వున్న తెలుగు ప్రజలకోసం ట్రస్టు పనిచేస్తుంది.

**'నడుస్తున్న చరిత్ర'** 2013 అక్టోబర్‌తో నిలిచింది. దాని కొనసాగింపుగా మరింత సమగ్రంగా **'అమ్మనుడి'**ని **2015** మార్చి నుండి పత్రికను ప్రచురిస్తున్నాము. పుస్తకాల ప్రచురణ కార్యక్రమంలో తొలుతగా స.వెం.రమేశ్ వ్యాసాల సంకలనం **'ఎల్లలు లేని తెలుగు'**ను విడుదల చేశాము. తక్కిన కార్యక్రమాలను కూడా చేపడతాము. ఈ ట్రస్టును బలమైన పునాదులపై, తగినన్ని వనరులతో ఏర్పరచటానికి మీ అందరి చేయూత కావాలి. ట్రస్టు నిర్మాణంలో తోడ్పడాలని విన్నవిస్తున్నాము.

**తెలుగుజాతి ట్రస్టు 'ప్రోత్సాహకులు'గా చేరిన వీరికి మా మప్పిదాలు.**



**డాక్టర్ కొప్పుల హేమాద్రి,**
**విజయవాడ**

**నడుస్తున్న చరిత్ర/అమ్మనుడి** శాశ్వత ఆత్మీయ పాఠకులు. గిరిజన వైద్య విజ్ఞానాన్ని మధించి సాధికారిక గ్రంథాల్ని రచించారు. వాటిలో చాలా వరకు నడుస్తున్న చరిత్రలో ముందుగా ప్రచురించిన తర్వాతే పుస్తకరూపంలో వెలువడ్డాయి. ఆంధ్రజ్యోతి, జాగృతి వంటి అనేక పత్రికల్లో కూడా వ్రాశారు. వృక్షశాస్త్రంలో, గిరిజన, దేశీయ మూలికా విజ్ఞానంలో సాధికారిత కలిగినవారు. కేంద్రప్రభుత్వంవారి ఆయుర్వేద పరిశోధనా సంస్థలో ఆయన చేసిన కృషి మరువలేనిది. రచయిత, కవి. ఆదర్శ జీవనాన్ని ప్రేమించే ఉదాత్త మానవుడు. 78 ఏళ్ల వయసులో ఇంకా చురుకుగా జ్ఞానగంగలో ఈదులాడుతూనే ఉన్నారు.



**డా॥ ఇమ్మానేని సత్యసుందరం**
**మచిలీపట్నం**

**నడుస్తున్న చరిత్ర/అమ్మనుడి** శాశ్వత ఆత్మీయ పాఠకులు. మచిలీపట్నం హిందూ కాలేజి పి.జి. సెంటర్‌లో అర్థశాస్త్రం బోధించి డైరెక్టర్‌గా 2004లో రిటైర్ అయ్యారు. తర్వాత ఆచార్య నాగార్జున విశ్వవిద్యాలయంలో గ్రామీణాభివృద్ధి శాఖలో బోధించారు. (2004-08) అక్కడే రెండు సంవత్సరాలు జర్నలిజం శాఖలో పనిచేశారు. డా॥ సుందరం ఆంగ్లపత్రికలకు 3000 పైగా వ్యాసాలు వ్రాశారు. 500కి పైగా ఆంగ్ల పుస్తకాలను సమీక్షించారు. గ్రామీణాభివృద్ధి పై ఆయన పుస్తకాలు మంచి ప్రాచుర్యం పొందాయి. తెలుగులోనూ ఎన్నో వ్యాసాలు వ్రాశారు.

పిలుపు

## ఆగస్టు 29నుండి సెప్టెంబరు 28వరకు

# తెలుగు ప్రజాచైతన్య కార్యక్రమాలు

తమ జీవితాలను తెలుగు ప్రజల భాషా ప్రజాస్వామ్యానికి, సామాజిక చైతన్యానికి అంకితం చేసుకొన్న ఈ అయిదుగురి పుట్టిన తేదీల మధ్య ఒక చిత్రమైన బంధం ఉంది. ఆగస్టు 29నుండి సెప్టెంబరు 28వరకు ఒక నెఎల రోజుల సమయంలోనే వీరంతా తెలుగు నేలమీద పుట్టారు. తెలుగు సామాజిక ఉద్యమకారులు-వారు భాషోద్యమంలో ఉన్నా సమాజంలో సంస్కరణల ఉద్యమాలలో ఉన్నా సామాజిక వర్గాల ఉనికి పోరాటాల్లో ఉన్నా, సాహితీ సాంస్కృతిక, రాజకీయ రంగాల్లో ఉన్నా అందరూ ఈ నెల రోజులపాటు ప్రజాచైతన్య కార్యక్రమాలను చేపట్టాలని కోరుతున్నాం. అదే సమయంలో- ప్రభుత్వానికి మన నిక్కచ్చులను (డిమాండ్లను) కూడా తెలియపరచాలి.



**గిడుగు రామమూర్తి**



**కాళోజీ నారాయణరావు**



**తాపీ ధర్మారావు**



**గురజాడ అప్పారావు**



**జాషువా**

| | | |
|---|---|---|
| గిడుగు జయంతి (ఆగస్టు 29)ని | - | తెలుగు భాషాదినోత్సవంగా |
| కాళోజి జయంతి (సెప్టెంబరు 9)ని | - | తెలుగు మాండలిక భాషా దినోత్సవంగా |
| తాపీ జయంతి (సెప్టెంబరు 19)ని | - | తెలుగు జనమాధ్యమాల దినోత్సవంగా |
| గురజాడ జయంతి (సెప్టెంబరు 21)ని | - | తెలుగు ఆధునిక సాహితీ దినోత్సవంగా |
| జాషువా జయంతి (సెప్టెంబరు 28)ని | - | తెలుగు సామాజిక ఐక్యతా దినోత్సవంగా జరుపుకుందాం. |

## నిక్కచ్చులు

1. ఆంధ్ర, తెలంగాణ రెండు రాష్ట్ర ప్రభుత్వాల్లో మంత్రిత్వ శాఖలు ఏర్పడినందున అవి వెంటనే తమ భాషా విధానాన్ని ప్రకటించాలి.
2. తెలుగు భాషను నేటి అవసరాలకు తగ్గవిధంగా అభివృద్ధి చేయడానికి, అన్ని రంగాల్లో తెలుగును వినియోగించేందుకు తగిన అధికారాలతో నిపుణులతో కూడిన ఒక తెలుగు అభివృద్ధి ప్రాధికార సంస్థ' (తెలుగు డెవలెప్‌మెంట్ అథారిటీ)ని రెండు రాష్ట్ర ప్రభుత్వాలూ నియమించాలి.
3. రెండు రాష్ట్రాలూ తమ ప్రత్యేకతలను కాపాడుకొంటూ నిజమైన తెలుగు రాష్ట్రాలుగా ఎదగడానికి ప్రభుత్వాలు దీక్షతో పనిచెయ్యాలి. భాషా సాంస్కృతిక, సాహిత్య, సామాజిక రంగాల్లో ప్రజల మధ్య సంబంధాలు పెంపొందించేందుకు ప్రభుత్వ నేతలు, ప్రజలు కృషి చేయాలి.

ఈ మూడు కోరికలనూ వీలైన అన్ని విధాలా ప్రభుత్వానికి అందేట్లు చూడాలి. రాజకీయ నేతలు, అధికారులతో అన్నివిధాలైన పాలకవర్గాలకు ఇవి వినపడాలి. వారిని కదిలించాలి. అందుకు తగ్గ కార్యక్రమాల్ని చేపట్టండి.

ఈ నెలరోజుల్లో ఏరోజైనా- వీలైతే ఆ అయిదుగురు తెలుగు ఉద్యమకారుల, సంస్కర్తల పుట్టిన తేదీలలో సభలు, ఊరేగింపులు, ప్రజల్లో చైతన్య కార్యక్రమాలు- ఇలా మీకు తోచినవిధంగా కార్యక్రమాలు చేపట్టవచ్చు.

దినపత్రికల్లో, టి.వి. చానళ్లలో ప్రచారం కావడం చాలా ముఖ్యం. 'అమ్మనుడి' పత్రికలో ప్రచురణకు ఫోటోలు, వార్తలు పంపండి.

## తెలుగు భాషోద్యమ సమాఖ్య


| డా॥ సామల రమేష్‌బాబు | తిరువరంగం ప్రభాకర్ | డా॥ వి. సింగారావు |
|---|---|---|
| అధ్యక్షుడు | ప్రధాన కార్యదర్శి | కోశాధికారి |
| 98480 16136 | 9848336848 | 9393015584 |

సంపుటి : 1 సంచిక : 7
అమ్మనుడి
సెప్టెంబర్ 2015

సంపాదకీయం

# భాషావిధానాన్ని ఎందుకు ప్రకటించడం లేదు?

**ఈ**సారి గిడుగు జయంతి-తెలుగు భాషా దినోత్సవం సరికొత్త చైతన్యానికి, కొత్త ఆశల్ని పెంచుకోవడానికి, కొత్త వెలుగుల్ని ప్రసరింపజేయడానికి దారితీసింది. తెలుగు భాషోద్యమకారులు ఇంతకాలంగా మొరపెడుతున్న అంశాలు తెరమీదకు మరింత స్పష్టంగా వచ్చాయి. తెలుగు రక్షణకు అభివృద్ధికి సంబంధించిన కీలక అంశాలపై పత్రికల్లో ప్రసారమాధ్యమాల్లో ఎక్కువ కాంతి ప్రసరించింది. ఇందుకు తెలుగు భాషోద్యమ సమాఖ్య కొన్నేళ్లుగా చేస్తున్న ఉద్యమ ప్రభావం ఎంతో ఉంది. తెలుగును రక్షించుకోవడానికి కేవలం అమ్మభాష అనే భావోద్వేగం (సెంటిమెంటు) మాత్రమే చాలదని, తెలుగును అన్నిటికీ పనికొచ్చే ఆధునిక భాషగా పెంచుకొని తీరాలనే అంశం స్పష్టంగా పైకి వచ్చింది. కొందరు స్పందించినా, మరికొందరు స్పందించకపోయినా, రాజకీయనేతల్లో కూడా ముఖ్యులైనవారి చెవుల్లోకి ఎంతో కొంత వెళ్లింది. ఉమ్మడి రాష్ట్రం రెండుగా చీలిన తర్వాతైనా- రెండు తెలుగు రాష్ట్రాలూ నిజమైన తెలుగు రాష్ట్రాలుగా వెలుగొందాలనే అభిప్రాయం ప్రజలలో నెలకొంది. ప్రజల భాషలో పరిపాలించడం ప్రజాప్రభుత్వాల విధి అనీ, అది ప్రజల హక్కు అనీ, అదేవిధంగా విద్యారంగం కూడా క్రిందినుండి పైదాకా తెలుగు వినియోగంలోకి రావాలనీ, ప్రపంచంలోఓ పెద్ద భాషల్లో ఒకటిగా, తెలుగును అన్ని వ్యవహారాలకు పనికొచ్చే సమర్ధవంతమైన భాషగా తీర్చిదిద్దుకోవాలనే స్పష్టమైన దారిపై వెలుగు ప్రసరించింది.

గిడుగు నడిపిన తెలుగు భాషోద్యమానికి మూలమైన అంశం - ప్రజలే భాషకు నిజమైన అధికారులనీ, పండిత వర్గాలకు ఆ పెత్తనం తగదనీ, భాషా ప్రజాస్వామ్యం అంటే ప్రజల భాషను గౌరవించడం అని. ఆ సిద్ధాంతానికి నారు, నీరు పోయడంలో తోడు నిలిచిన వారిలో ప్రముఖుడు గురజాడ కాగా, ఆయన తర్వాత ఆ ఆశయాన్ని పత్రికల్లోకి, సినిమాల్లోకి ప్రతిభావంతంగా తీసుకువెళ్లినవాడు తాపీ ధర్మారావుగారు. అదంతా అప్పటి సంగతి. వాళ్లు పోరాడింది ఆనాటి పాలకులైన విదేశీయులతోకాదు. భాష ప్రజాస్వామ్య పునాదులనే నిర్లక్ష్యం చేస్తూ ఆధిపత్యం వహించిన 'పండిత భిషక్కుల భాషా భేషజం' మీద. కాని నేడు మనముందున్నది- మనవాళ్లే అయిన మన పాలకుల మీద, వాళ్ల విధానాల మీద ఉద్యమించవలసిన అవసరం. పూర్తిగా స్వార్ధంతో నిండిపోయిన రాజకీయ నేతల కళ్లు తెరిపించడం, ప్రజలను చైతన్యపరుస్తూ- ప్రభుత్వాన్ని దారిలో పెట్టుకోవడం. ఇందుకు కావలసింది మన ప్రజలపై ప్రేమ, అన్నివిధాల ఆధిపత్య భావజాలాన్ని ఎదిరించడం, శాస్త్రీయ దృష్టితో విశ్లేషించి, జాతిని ఆత్మగౌరవంతో ముందుకు నడిపించగల ఉద్యమ నిర్మాణం. ఇందుకు యువత ముందుకు రావాలి.

కంప్యూటర్లు, దానిలో అంతర్జాలం (నెట్) వచ్చిన తర్వాత తెలుగుగాని, ఇతర భాషలుగాని దెబ్బతింటాయని, అది ఇంగ్లీషుభాషను మరింత పెంచడానికే తోడ్పడుతుందని నెలకొన్న తలంపులను, బెదురునూ పోగొట్టేవిధంగా మన యువత కొందరు ఆ రంగంలో కృషి ప్రారంభించారు. అనతికాలంలో అది అనూహ్యస్థాయికి ఎదగనుంది. ఈ పురోగతిని ఎవరూ ఆపలేరు. ప్రజాస్వామ్య శక్తి ఏమిటో కూడా కంప్యూటర్ యుగం నిరూపిస్తూ ఉంది. ఈ దశలో మన తెలుగు రాష్ట్రాలు కూడా పరిపాలననీ, క్రమంగా విద్యనూ తెలుగులో పటిష్ట పరుచుకోక తప్పదు. ప్రభుత్వాలు కళ్లు తెరచి భాషా ప్రజాస్వామ్య సూత్రాన్ని గౌరవించి భాషాభివృద్ధిపై, వినియోగంపై శ్రద్ధ వహించక

## సంపాదక పీఠం

తప్పదు.

ఈ ఆగస్టు 29న విజయవాడలో ప్రభుత్వం నిర్వహించిన 'తెలుగు భాషాదినోత్సవం'లో ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి చేసిన వాగ్దానాలను ఆచరణలో పెడతారని మనం ఆశిద్దాం. పరిపాలనను తెలుగులోకి వీలైనంత ఎక్కువగా తెస్తామని, ఏ మాధ్యమంలో చదువుకొన్నా తెలుగును ఒక భాషగా తప్పనిసరి చేస్తామని, ఇంటర్మీడియట్‌లో కూడా తెలుగును ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తామని వాగ్దానం చేశారు. నిజానికి 10వ తరగతి వరకూ ఒక సబ్జెక్టుగా తెలుగును తప్పనిసరి చేస్తూ చంద్రబాబు నాయుడుగారి హయాం (2003)లోనే జి.ఒ.నెం.86ను తె.భా.సమాఖ్య సాధించింది. ఇప్పుడు కావల్సింది – దాన్ని కఠినంగా అమలు చేయడంతోపాటు ఇంటర్మీడియట్‌లో కూడా తప్పనిసరి చెయ్యడంకోసం మరొక ఉత్తర్వు తేవడం. ఇంతకు మించి ఆయన స్పష్టంగా చెప్పిందేమీ లేదు.

భాషోద్యమకారులతోపాటు విషయం తెలిసిన పెద్దలందరికీ మొన్న చంద్రబాబునాయుడుగారి ఆలోచన సారాంశం అర్థమయిందేమిటంటే– "తల్లి భాషను కాపాడుకోవాలి. అందుకోసం దాన్నొక స్థాయివరకు ఒక సబ్జెక్టుగా తప్పనిసరి చేస్తాం తప్ప ఆ తర్వాత స్థాయిలో తెలుగెందుకూ పనికిరాదు. పరిపాలనలో వీలైనంతవరకూ– అంటే ప్రజలు కోరుతున్న సందర్భాల్లో తెలుగును వినియోగిస్తాం. సాంస్కృతికంగా, భావోద్వేగపరంగా తెలుగు ఆత్మగౌరవ రక్షణ అనే సెంటిమెంటును కాపాడుకోవడం మాకూ, మా పార్టీకి అవసరం. అకాడమీల పునరుద్ధరణ, కూచిపూడి నృత్యం తదితర కళారంగాలను ప్రోత్సహించడం, కవులను, రచయితలను సత్కరించడం,... ఇలాంటివి చేస్తాం" – ఇదీ వారు చెప్పకనే చెప్పిన సంగతి. తెలుగు పిల్లలందరికీ తెలుగు వ్రాయడం వచ్చి వుండాలని అందుకు తల్లిదండ్రులు శ్రద్ధ తీసుకోవాలని ముఖ్యమంత్రిగారు సందేశం ఇచ్చారు. తెలుగు ఆత్మాభిమానాన్ని కాపాడుకోవడానికి ఇది చాలా అవసరమని తెలుగు సంస్కృతి రక్షణకు ఈ మాత్రం కావాలని వారి ఉద్దేశ్యం కావచ్చు. ఒక జాతీయ భాషగా, ప్రపంచ భాషగా, ఆధునిక భాషగా తెలుగును ఎదిగించుకోవాలన్న ఉద్దేశ్యం వారికి లేనేలేదు. ఎందుకూ కొరగానిదని తెలిసినవారందరూ ప్రకటించినా, అధికార భాషా సంఘానికి మళ్లీ రాజకీయ నియామకాన్ని ప్రకటించడాన్ని మనం గమనించాలి. కావలసింది 'తెలుగు భాషాభివృద్ధి ప్రాధికార సంఘం' (తెలుగు డెవలెప్‌మెంట్ అథారిటీ). అంతేగాని ఈ 'అనధికార' సలహాసంఘం కాదు.

మన ప్రభుత్వాలు భాషావిధానాన్ని స్పష్టంగా ప్రకటించాలనేది ఇప్పుడు కేవలం ఉద్యమకారుల కోరిక మాత్రమే కాదు; మేధావుల, ఆచార్యుల కోరిక కూడా. పత్రికలు, మీడియా కూడా ఈ కోరికను సమర్థిస్తున్నాయి. ఏమాత్రం హేతుబద్ధంగా, సరిగా ఆలోచించే వారయినా కోరేది ఇదే.

సమాజంలో కొన్ని వర్గాలు సాధికారిత కోసం, అస్తిత్వంకోసం పోరాడుతూ ఉంటాయి. అదంతా వారికి ప్రజాస్వామ్య హక్కు. అయితే తమ తల్లిభాషలో సర్వతోముఖ వికాసాన్ని కోరుకోవడం కూడా అటువంటి అస్తిత్వ, సాధికారిత పోరాటమే. ప్రజలకు ఆ అవగాహన కలిగిస్తూ, రాజకీయ రంగంతో సహా అన్ని కీలక రంగాలపై ఉద్యమం ప్రభావం చూపగలిగేవరకూ– నేటి తెలుగుభాషోద్యమం, తెలుగు ప్రజోద్యమంగా సాగాలి.

మరొకమాట. తెలుగువారి అధికారంలో ఉన్నవి ఇప్పుడు రెండు రాష్ట్రాలు. ఎవరి సాంస్కృతిక ప్రత్యేకతలను వారు కాపాడుకొంటూ తమదైన తెలుగు భాషను కాపాడుకొంటేనే అవి మనగలుగుతాయి. ఆ మేరకు ఇరు రాష్ట్రాల మధ్య సమన్వయం, సహకారం, ఐక్యతాభావం నెలకొనాల్సి వున్నది. పొరుగున ఉన్న తమిళనాడులో తెలుగువారి ఉనికి పోరాటం క్రమంగా పుంజుకొంటున్నది. అణచివేత తిరుగుబాటుకు దారితీస్తుంది కదా! తెలుగు రాష్ట్రాల్లో తెలుగును మరింత ఎదగకుండా జాగ్రత్త పడుతూ కార్పొరేట్ శక్తులకు లొంగిపోయి, బానిస విధానాలను కొనసాగిస్తే ఇక్కడ కూడా భాషాస్వాభిమానం ప్రాతిపదికగా ఏదో ఒక రూపంలో మళ్లీ ప్రజోద్యమాలు తప్పవు. ఒక్కసారి గత చరిత్రను చదువుకోవాలని, స్పష్టమైన విధానాలతో ముందుకు రావాలని, సమగ్రమైన భాషావిధానాన్ని ప్రకటించాలని – ఉభయ రాష్ట్రాలకూ విజ్ఞప్తి చేస్తున్నాం.

**29-8-2015**

సామల రమేష్‌బాబు

# తెలుగు భాషాదినోత్సవం - గిడుగు జయంతి 28-8-2015

# తెలుగు భాష రక్షణ-అభివృద్ధిపై గుంటూరులో మహాసభ, సదస్సు

తెలుగు భాషోద్యమ సమాఖ్య ఆధ్వర్యంలో గిడుగు రామమూర్తి గారి 152వ జయంతి సందర్భంగా 'తెలుగు భాష రక్షణ-అభివృద్ధిపై మహాసభ, సదస్సు జరిగింది. బృందావన్ గార్డెన్స్‌లోని శ్రీ వేంకటేశ్వరస్వామి దేవస్థానం - బాలాజీ కళ్యాణమండపంలో ఈ కార్యక్రమం ఉదయం గం.10 నుండి సాయంత్రం గం.6 వరకు జరిగింది. నిజానికి 29వ తేదీన జరగవలసిన ఈ కార్యక్రమం వైఎస్సార్ కాంగ్రెస్ పార్టీ ఆ రోజు బంద్ ప్రకటించినందున, అతిథుల వీలును గమనించి, ఒకరోజు వెనక్కి జరిపి, 28వ తేదీనే చేయవలసి వచ్చింది. ఆ రోజు పని రోజు కావడం, వరలక్ష్మీ వ్రతం కూడా ఉండడంతో సభకు వచ్చేవారికి కొందరికి ఇబ్బంది కలిగింది. అయినా తగు సంఖ్యలో భాషాభిమానులు, ఉపాధ్యాయులు, లెక్చరర్లు పాల్గొని సభను విజయవంతం చేశారు.






**1) తెలుగు పతాకాన్ని ఎగురవేయడంతో కార్యక్రమం మొదలైంది. సమాఖ్య అధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు, ఆత్మీయ అతిథి శ్రీ కె. రామచంద్రమూర్తి ఇతర పెద్దలు కలిసి పతాకాని&్ని ఎగురవేస్తున్న దృశ్యం 2) గాయని భూదేవి ప్రార్థనాగీతంతో సభాకార్యక్రమం మొదలైంది. వేదికపై (ఎడమనుండి కుడికి) సాక్షి ప్రధాన సంపాదకులు కె. రామచంద్రమూర్తి, శాసనమండలి సభ్యులు విఠపు బాలసుబ్రహ్మణ్యం, సభాధ్యక్షుడు డా॥ రమేష్‌బాబు, ఆచార్య గంగప్ప, డా॥ వావిలాల సుబ్బారావు, సమాఖ్య కోశాధికారి డా॥ వి. సింగారావు, ప్రధాన కార్యదర్శి తిరువరంగం ప్రభాకర్**

ముఖ్య అతిథిగా పాల్గొనవలసిందిగా ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి గౌ॥ శ్రీ నారా చంద్రబాబు నాయుడు గారిని- సమాఖ్య అధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు, కోశాధికారి డా॥ వి. సింగారావు స్వయంగా కలిసి ఆహ్వానించారు. కాని 'తాము బాగా వత్తిడి పనుల్లో ఉన్నామని, కనుక రాలేమని, మీ కార్యక్రమంతో ముందుకు సాగండి'- అని వారు చెప్పారు. తప్పకుండా వస్తారని ఆశించిన భాషాసాంస్కృతిక శాఖ మంత్రి శ్రీ పల్లె రఘునాథరెడ్డిగారు సభలో పాల్గొనకపోవడం నిర్వాహకులకు బాధ కలిగింది. కనీసం సందేశంకూడా వారినుండి రాలేదు. 31నుండి అసెంబ్లీ సమావేశాలుండడం వల్ల, కొన్ని అధికారిక కార్యక్రమాలవల్ల స్పీకర్ డా॥ కోడెల శివప్రసాదరావుగారు సభకు రాలేకపోయారు.

సమాఖ్య స్థాపకుల్లో ఒకరైన నేటి శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ గారు, వ్యవసాయ శాఖమంత్రి శ్రీ ప్రత్తిపాటి పుల్లారావుగారు విచ్చేసి వివరంగా ప్రసంగించి అందరికీ సంతృప్తిని కలిగించారు. శాసనమండలి సభ్యుల్లో నెల్లూరునుంచి శ్రీ విఠపు బాలసుబ్రహ్మణ్యంగారు, గుంటూరు నుంచి శ్రీ ఎ.ఎస్. రామకృష్ణగారూ సభలో పాల్గొని ప్రసంగించారు. ఆత్మీయ అతిథిగా 'సాక్షి' దినపత్రిక సంపాదక ముఖ్యులు శ్రీ కె. రామచంద్రమూర్తి గారు పాల్గొన్నారు.

సభ తేదీ మార్పువల్ల ఆంధ్రభూమి సంపాదకులు శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రి, ఆంధ్రజ్యోతి సంపాదకులు శ్రీ కె. శ్రీనివాస్ తమ ప్రయాణాలను మానుకోవలసి వచ్చింది.

ఆహ్వాన సంఘం తరపున డా॥ నాగభైరవ ఆదినారాయణ స్వాగతం పలుకగా, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు కార్యక్రమానికి అధ్యక్షత వహించారు. సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ తిరువరంగం ప్రభాకర్ సభను సమీక్షించి, వందన సమర్పణ చేశారు.






**1) ఆంధ్రప్రదేశ్  ఉమ్మడి రాష్ట్రంలో తెలుగు అమలు గురించిన చట్టాలు, ఉత్తర్వులు పుస్తకాన్ని ఆవిష్కరిస్తున్న శ్రీ మండలి బుద్ధప్రసాద్, శ్రీ ప్రతిపాటి పుల్లారావు ఇతర పెద్దలు. 2) ముఖ్య అతిథిగా ప్రసంగిస్తున్న శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్**

తెలుగు భాషోద్యమ సమాఖ్య ఈ సందర్భంలో ప్రచురించిన 'పరిపాలనలో విద్యారంగంలో తెలుగు అమలుకై ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ చట్టాలు, ఉత్తర్వులు, ఆదేశాలు' అనే పుస్తకాన్ని ఆవిష్కరించిన తరువాత శ్రీ మండలి బుద్ధప్రసాద్ మాట్లాడుతూ ఇలా అన్నారు. తెలుగు  భాష ప్రగతిలో ఏర్పడిన ఆటంకాలకు మూలకారణాలేమిటో శోధించి వాటిని పరిష్కరించుకోవాలి. ప్రభుత్వాలు తెలుగు భాష పునరుజ్జీవానికి నడుం కట్టాలి. రాజకీయాలకతీతంగా మనం ఆలోచించాలి. హిందీ బాషకు కేంద్ర స్థాయిలో ఒక ప్రచార సంస్థ ఏర్పడినట్టుగానే తెలుగుభాషకుకూడా ఏర్పర్చాల్సిన అవసరం ఉందన్నారు. దేశీయ భాషల అభివృద్ధిపట్ల కేంద్రం కూడా బాధ్యత తీసుకోవాలన్నారు. తెలుగు విశ్వవిద్యాలయం వంటి అంశాలపై రెండు రాష్ట్రాలు మాట్లాడుకొని సమస్యను పరిష్కరించుకోవాలి. భాష,సంస్కృతి జాతికి రెండు కళ్లు. తెలుగు భాషతోపాటు సంస్కృతిని కాపాడుకోవాలి. తమిళనాడులో మాదిరిగా మన రాష్ట్రంలోకూడా రాజకీయాలను శాసించే స్థితికి భాషోద్యమాలు ఎదగాలని అన్నారు.అంతర్జాతీయ మాతృభాషోత్సవం సందర్భంగా మాతృభాషలోనే బోధన ఉండాలని యునెస్కో సూచించిందని అన్ని రంగాల్లో తెలుగును అభివృద్ధి చేసుకోవలసి ఉందని ఇందుకు ప్రభుత్వంతోపాటు ప్రజల బాధ్యత కూడా ఉందన్నారు.




**సభలో ప్రసంగిస్తున్న వ్యవసాయ శాఖ మంత్రి శ్రీ ప్రత్తిపాటి పుల్లారావు.**

విశిష్ట అతిథిగా పాల్గొన్న వ్యవసాయ శాఖమంత్రి శ్రీ ప్రత్తిపాటి పుల్లారావుగారు ప్రసంగిస్తూ ప్రజల భాష అయితేనే వారికి చేరువగా ఉంటుందని వారి భాషలో వారికి పరిపాలన అందినప్పుడే ప్రగతికి బాటలు పడతాయని అన్నారు. అందుకే ఇటీవల రైతులు రుణమాఫీకి సంబంధించి 55 లక్షల మందికి చరవాణిలో పొట్టి సందేశాలను పంపామని శ్రీ పుల్లారావు ప్రకటించడంతో సభలో చప్పట్లు మారుమ్రోగాయి. తన శాఖను పూర్తిగా తెలుగులోనే నడపడానికి కృషి చేస్తానన్నారాయన. కన్నతల్లికి ఇచ్చిన గౌరవాన్ని మాతృభాషకు ఇవ్వాలి. తెలుగును రక్షించుకోవాల్సిన బాధ్యత మనందరిపైనా ఉంది అన్నారు.




**ఆత్మీయ అతిథి శ్రీ కె. రామచంద్రమూర్తి ప్రసంగిస్తున్న దృశ్యం**

సాక్షి దినపత్రిక ఎడిటోరియల్ డైరెక్టర్ శ్రీ కె. రామచంద్రమూర్తి మాట్లాడుతూ యువతను తెలుగు భాషవైపు ఆకర్షించేలా ప్రత్యేక చర్యలు చేపట్టాలన్నారు. మీడియా తెలుగుభాషకు చేస్తున్న సేవలు అభినందనీయమని అయితే మరింత కృషి సాగవలసి ఉందని అన్నారు. 2003లో వచ్చిన జి.ఓ. నెం.86ను సరిగా అమలు పరచి ఉన్నట్లయితే నేటి ఈ పరిస్థితి ఏర్పడి ఉండేదికాదన్నారు. ప్రభుత్వాలు తమ బాధ్యతను విస్మరించడం సరికాదన్నారు. తెలుగు భాషోద్యమ సమాఖ్య తదితర సంస్థలు తెలుగుభాష ఔన్నత్యంకోసం చేస్తున్న కృషిని ప్రశంసించారు.

'భాషావిధానం'పై ప్రభుత్వానికి సూచనలు ఇచ్చేందుకు భోజనానంతరం జరిగిన సదస్సులో ఆరుగురు నిపుణులు పత్రాలు సమర్పించారు.

శ్రీ వితపు బాలసుబ్రహ్మణ్యం - విద్యారంగంలో భాషావిధానంపైన, శ్రీ నూర్‌బాషా రహంతుల్లా - పరిపాలనా రంగంలో భాషావిధానంపైన, ఆచార్య పులికొండ సుబ్బాచారి - ఆధునిక భాషగా తెలుగు వ్యూహాలు పైన, డా॥ పి. శివరామకృష్ణ (శక్తి) - వారసత్వ విజ్ఞానం-తెలుగు వారసత్వ సంపద పైన, శ్రీ రహమానుద్దీన్ షేక్ - కంప్యూటర్లలో తెలుగు వినియోగం పైన, డా॥ కందిమళ్ల సాంబశివరావు - కళారంగంలో భాషావిధానం పైన పత్రాలు సమర్పించి ప్రసంగించారు. వీరిలో నలుగురు వివరమైన పత్రాలు సమర్పించి ప్రసంగించగా శ్రీ నూర్‌భాషా రహంతుల్లా, రహమనుద్దీన్ షేక్‌గార్లు పవర్ పాయింట్ ప్రెజెంటేషన్ (దృశ్యమాధ్యమం ద్వారా వివరణ) ఇచ్చారు. (పై పత్రాలను ఈ సంచికలో రెండింటిని, తక్కినవి రాబోయే నెలలోను పూర్తిపాఠం ప్రచురిస్తున్నాం. -సంపాదకుడు)

తర్వాత ముగింపు సభలో సమాఖ్య సంస్థాపక సభ్యులు డా॥ వావిలాల సుబ్బారావు, శ్రీ వితపు బాలసుబ్రహ్మణ్యం, సమాఖ్య ప్రధాన కార్యదర్శి శ్రీ తిరువరంగం ప్రభాకర్ ప్రసంగించారు.

డా॥ వి. సింగారావు ప్రతిపాదించిన 9 తీర్మానాలను ఏకగ్రీవంగా ఆమోదించారు. (ఆ తీర్మానాల పూర్తిపాఠాన్ని ఈ సంచికలో మూడవ అట్ట (పేజీ51)పై ప్రచురించాము.- సంపాదకుడు)

గిడుగు జయంతి సందర్భంగా 27, 28, 29 తేదీలలో ఆంధ్రజ్యోతి దినపత్రిక మూడు ప్రధాన వ్యాసాలను ప్రచురించడాన్ని అందరూ అభినందించారు. గిడుగు జయంతి సందర్భంగా 29న ఆంధ్రభూమిలో 'వీక్ పాయింట్' శీర్షికకోసం సంపాదకుడు శ్రీ ఎం.వి.ఆర్. శాస్త్రి వ్రాసిన వ్యాసం ఒక సంచలనం. గుంటూరు సభ వివరాలను అన్ని దినపత్రికలూ బాగా ఇచ్చాయి. అందుకు వారందరికీ ఆహ్వానసంఘం ధన్యవాదాలు తెలిపింది.

ఈ సందర్భంగా 'ఆంధ్రప్రదేశ్ (ఉమ్మడి)లో తెలుగుభాష విషయికంగా వచ్చిన ప్రభుత్వ ఉత్తర్వులన్నీ చేర్చి తెలుగు భాషోద్యమ సమాఖ్య ప్రచురించిన పుస్తకాన్ని గౌ॥ శ్రీ మండలి బుద్ధప్రసాద్, గౌ॥ శ్రీ ప్రత్తిపాటి పుల్లారావుగార్లు ఆవిష్కరించారు.

హైదరాబాదునుంచి సమాఖ్య కార్యకర్త, ప్రముఖ గాయని శ్రీమతి ఊటుకూరి భూదేవి వచ్చి ప్రార్థన గీతాన్ని, తెలుగు ప్రచార గీతాల్ని ఆలపించి సభను పులకింప జేశారు.

మొత్తమ్మీద- ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని ఉద్దేశించి మాత్రమే జరిగిన ఈ సభ విజయవంతం అయింది. త్వరలో తెలంగాణకు సంబంధించి కూడ హైదరాబాదులో ఒక సభ నిర్వహించాలని ఆలోచిస్తున్నామని సమాఖ్య కార్యదర్శి శ్రీ తిరువరంగం ప్రభాకర్ సభలో తెలియజేశారు.




శాసన మండలి సభ్యులు శ్రీ ఎ.ఎస్. రామకృష్ణ ప్రసంగిస్తున్న దృశ్యం




విద్యారంగంలో భాషావిధానం గురించి పత్ర సమర్పణ చేసి ప్రసంగిస్తున్న శాసనమండలి సభ్యులు, ఉపాధ్యాయ నేత శ్రీ వితపు బాలసుబ్రహ్మణ్యం. వేదికపై పత్ర సమర్పకులు నూర్‌బాషా రహంతుల్లా, పి. సుబ్బాచారి, డాక్టర్ పి. శివరామకృష్ణలను చూడవచ్చు.




ముగింపు సభలో తీర్మానాలు ప్రతిపాదిస్తున్న శ్రీ వి. సింగారావు. వేదికపై శ్రీ నూర్‌బాషా రహంతుల్లా, శ్రీ వితపు బాలసుబ్రహ్మణ్యం, సభాధ్యక్షుడు డా॥ సామల రమేష్‌బాబు, డా॥ పులికొండ సుబ్బాచారిలను చూడవచ్చు.

చిత్తశుద్ధి, శ్రద్ధ కొరవడిన ప్రభుత్వ ఉత్సవం

# తెలుగుభాషా దినోత్సవం

## (గిడుగు 152వ జయంతి)

**ఆ**గస్టు 29 సాయంత్రం విజయవాడలోని 'తుమ్మలపల్లివారి క్షేత్రయ్య కళాక్షేత్రంలో ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వ భాషాసాంస్కృతిక మంత్రిత్వశాఖ నిర్వహణలో జరిగిన తెలుగు భాషాదినోత్సవం ఆర్భాటంగా, హడావిడిగా జరిగింది. కాని, కార్యక్రమమంతా చిత్తశుద్ధి, శ్రద్ధ కొరవడి 'ఒక పని అయిపోయింది' అన్నట్లు జరిగిపోయింది. 'ఈవెంట్ మేనేజర్స్'కి ఈ కార్యక్రమాన్ని అప్పజెప్పారు.

గౌరవనీయ ముఖ్యమంత్రిగారు బాగా ఆలస్యంగా వచ్చారన్నది అంతగా పట్టించుకోవలసిన అంశం కాదు. ఇప్పుడు ఆయనకున్న వత్తిడిపనుల్లో ఆయన పట్టుదలగా ఈ కార్యక్రమంలో పాల్గొనడమే గొప్ప సంగతి. అయితే తెలుగు భాషా దినోత్సవానికి అవమానకరమైన అంశాలు చోటుచేసుకోవడమే బాధపడవలసిన సంగతి.

ఆరోజు భారత హాకీ గొప్ప క్రీడాకారుడు కీ.శే. ధ్యాన్‌చంద్ పుట్టినరోజు కూడా. అందువల్ల క్రీడాకారులను గౌరవించే కార్యక్రమాన్ని కూడా అప్పటికప్పుడు దీనికి జతచేసి, వేదికకు అటూఇటూ ఇంగ్లీష్ బ్యానర్లను ప్రముఖంగా ప్రదర్శించారు. వేదికముందు కూర్చొన్నవారికి వేదికపైన ఉన్న తెలుగు అక్షరాల నుండి చూపు మరల్చేంతగా ఇవి ఉన్నాయి. ఆ కార్యక్రమానికి వచ్చిన యువ క్రీడాకారుల కోలాహలంతో సభ సందడిగా తయారైంది. చంద్రబాబు గారొచ్చేదాకా సాగిన పాటల సందడి, తెలుగు తల్లిని కీర్తించే నృత్యరూపకం తర్వాత క్రీడల సందర్భాన్ని గురించి ఎవరో పెద్దాయన సుదీర్ఘోపన్యాసం చేశారు. ముఖ్యమంత్రిగారు వచ్చిన తర్వాత ముందుగా క్రీడాకారులందరికీ బహుమతులు, పతకాలు ఇచ్చారు. దాంతో వారంతా వెళ్లిపోయారు. ఆ తర్వాత అసలు కార్యక్రమం తెలుగు భాషాదినోత్సవం ...

భాషాసాంస్కృతికశాఖమంత్రి శ్రీ పల్లె రఘునాథరెడ్డి, ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్ కుప్తంగా మాట్లాడిన తర్వాత ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబు నాయుడుగారు ప్రసంగించారు. ఇక సన్మానాన్ని అందుకోవలసిందిగా ప్రభుత్వ ప్రతినిధులు ఆహ్వానించిన 12 మందినీ వరుసగా పిలిచి, వేదికపైన చకచకా వారికి శాలువా కప్పి, పెద్ద దండవేసి జ్ఞాపికనూ, అభినందన పత్రాన్నీ అందించి పాతికవేల రూపాయల చెక్కునూ చేతిలోపెట్టి త్వరత్వరగా ముందుకు నడిపించారు. ఫోటోలు, వీడియోలు తమ పని తాము చేసుకుపోయాయి.

ముఖ్యమంత్రిగారు రాకముందే సన్మానం అందుకోబోయేవారిని ఎవరి కుర్చీలోంచి వారు లేచి సభికులకు కన్పడమని కోరింది యాంకరమ్మ. చప్పట్ల మధ్య క్లుప్తంగా వారి పరిచయాన్ని 'యాంకరమ్మ' చదివింది. అందరినీ తెలుగు భాషాకోవిదులంటూ ప్రజలకు తెలియపరిచారు. ఈ 11-12 మందిలో భాషోద్యమంలో వున్నవారితోపాటు సాహితీవేత్తలు, భాషావేత్తలు, రచయితలు, కవులూ ఉన్నారు. ప్రభుత్వం అనేసరికి, అందునా- సన్మానాల గుర్తింపుల జాబితా తయారీలో రాజకీయ పలుకుబడులు ఎటుతిరిగీ ఉంటాయి. అది వేరే సంగతి.

సన్మానితుల్ని ముఖ్యమంత్రి గారికి పరిచయం చెయ్యడమూ లేదు.



ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రి శ్రీ నారా చంద్రబాబునాయుడు తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు డాక్టర్ సామల రమేష్‌బాబును సత్కరిస్తున్న దృశ్యం. ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్, భాషా సాంస్కృతిఖ శాఖ మంత్రి శ్రీ పల్లె రఘునాథరెడ్డి, నీటిపారుదల శాఖమంత్రి శ్రీ దేవినేని ఉమామహేశ్వరరావు, శాసనమండలి సభ్యుడు శ్రీ ఎ.ఎస్. రామకృష్ణ, మేయర్ శ్రీ కోనేరు శ్రీధర్ తదితరులను చిత్రంలో చూడవచ్చు

పలకరింపులూ లేవు. వరుసలో నిలబడి ఇచ్చినవి పుచ్చుకుని ముఖ్యమంత్రి గారి చేత దండవేయించుకొన్నామనే ఆనందంతో ముందుకు సాగడమే... ఎవరికీ-కనీసం - ఒక్కరికైనా కృతజ్ఞత చెప్తూ నాలుగు మాటలు మాట్లాడే అవకాశాన్ని ఇవ్వలేదు.

ఉత్సవాన్ని ఇలా ఎందుకు జరిపించినట్లు? ప్రభుత్వం 'తెలుగు భాషాకోవిదులను' సత్కరిస్తున్నదని ఆవిధంగా తెలుగంటే తమకు గల గౌరవాన్ని వెల్లడించుకొంటున్నదనీ లోకం అనుకోవాలి! అయితే ఆచరణలో ఈ ప్రభుత్వాలు ఎలా వ్యవహరిస్తున్నాయో తెలియడానికి ఈ ఉత్సవమే తార్కాణం. ముమ్ముందయినా ఇలా జరగకుండా ప్రభుత్వ నేతలు, అధికారులు శ్రద్ధ వహిస్తారని ఆశిద్దాం.

ప్రభుత్వాన్ని విమర్శిస్తూ, ఉద్యమాలు నడిపే నాకూ సన్మానం దక్కింది. ఇందుకు ముఖ్యమంత్రిగారికీ, తెలుగు శాఖ మంత్రిగారికీ, తెలుగు సాహిత్య సాంస్కృతిక ప్రతినిధిగా మా అందరికీ ఆప్తులూ, తెలుగు భాషోద్యమ సమాఖ్య స్థాపకుల్లో ఒకరూ అయిన రాష్ట్ర శాసనసభ ఉపసభాపతి శ్రీ మండలి బుద్ధప్రసాద్‌గారికీ, భాషా సాంస్కృతిక శాఖ సంచాలకులకూ - అందరికీ నా ధన్యవాదాలు. అయితే ఇక్కడ ఒక్కమాట మనవి చెయ్యాలి.

నేను ప్రజాస్వామ్య ప్రభుత్వ వ్యవస్థకు వ్యతిరేకిని కాదు. ప్రజాస్వామ్య బద్ధంగా భాషోద్యమంలో ఎక్కడా రాజీలేని పోరు సల్పుతున్న వారిలో ఒకణ్ణి. సన్మానానికి ఎందుకు ఒప్పుకున్నారంటూ కొందరు అభిమానులు ఫోన్ చేశారు. ఒకరిద్దరు నిందాపూర్వకంగా మాట్లాడారు కూడా. అయినా, మిత్రులారా, తెలుగు భాషోద్యమ సమాఖ్య వేదికమీద గుంటూరులో డిసెంబరు 28న నేను ప్రకటించినట్లు- రాబోయే మాతృభాషా దినోత్సవం (ఫిబ్రవరి 21) వరకు ప్రభుత్వానికి విన్నపాలు చేయడం సాగిద్దాం. ఈలోపు ప్రభుత్వం తెలుగుపట్ల శ్రద్ధ వహిస్తుందనే ఆశ ఉంది. అందుకు నిదర్శనంగా- 29న వేదికపైనుండి ముఖ్యమంత్రిగారి వాగ్దానాలు, ప్రకటనలు ఆశను కలిగిస్తున్నాయి. మాటలు చేతల్లోకి వస్తాయా, రావా అనేది త్వరగానే తెలుస్తుంది కదా! మూడు నాలుగు అడుగులు ముందుకు పడినా సంతోషమే.

గౌ॥ నారా చంద్రబాబునాయుడుగారి నేతృత్వంలో ఉన్న కొత్త ప్రభుత్వం కొత్త రాష్ట్రాన్ని ఒక నిజమైన తెలుగు రాష్ట్రంగా రూపొందించే సంకల్పంతో ఉందని నమ్ముదాం. కొన్నాళ్లయినా ఆశగా ఎదురుచూద్దాం.

– **డా॥ సామల రమేష్‌బాబు**, తెలుగు భాషోద్యమ సమాఖ్య అధ్యక్షుడు

గిడుగు
152వ జయంతి

- డా॥ కె. శ్రీనివాస్

# అంగడి రొదలో తెలుగు ఒక సొద

ఇప్పుడు రెండు రాష్ట్రాలను నడిపిస్తున్న మనోభావాల పునాదులు వేరు. ఇప్పుడు తెలుగు గురించి, దాన్ని వెలిగించడం గురించి మాట్లాడితే ఎవరికన్నా రుచిస్తుందా? తెలుగు మీడియంను పూర్తిగా తుడిచిపెట్టే ప్రయత్నాలు తెలుగుప్రభుత్వాలే చేయగలుగుతున్నాయి. అన్నం పెట్టని భాష తల్లిభాష అయినా వదిలిపెట్టవలసిందేనని బాహాటంగా అనగలుగుతున్నాయి. ఎగుమతి ఆధారిత విద్యావిధానంలో తెలుగెక్కడ?

తమ మీద తాము చెణుకులు విసురుకుని ఆనందించ డంలో తెలుగువాళ్లు దిట్టలు. ఆ మాట కూడా వాళ్లే అనుకుంటారు. ఆరంభశూరత్వం చూపి ఆ తరువాత చల్లారిపోతారని, తోటి తెలుగువాడు బాగుపడితే భరించలేరని, ఇద్దరు టెల్గూస్ కలిస్తే ఇంగ్లీషులోనే మాట్లాడుకుంటారని తెలుగువారు ఆత్మవిమర్శ చేసుకుంటుంటారు. తనకు మాలిన హాస్యప్రియత్వం హర్షించదగినదే కానీ, అటువంటి అభిప్రాయాలు ఏర్పడడం కానీ, ఏర్పరచుకోవడం కానీ ఎంతటి విషాదమో తెలుగువారికి అర్థమవుతున్నట్టు లేదు. తమ చరిత్ర మీద, సంస్కృతి మీద, తమను తెలుగువారిగా చేస్తున్న భాష మీద వారికి ఉన్నది పెదవులు దాటని మమకారమే తప్ప, గుండెల్లో గూడుకట్టిన ఉద్వేగం కాదు. పైపై మెరుగులకు, సారం లేని హోదాలకు ఆకర్షితులు కావడమే తప్ప, వాస్తవికమైన ఉన్నతికి ప్రయత్నించడం కానీ, మొదలుపెట్టిన ప్రయత్నాలను తుదకంటా కొనసాగించడం కానీ కనిపించదు. తెలుగువారి మధ్య గాఢమైన ఐక్యతను, సహభావాన్ని నిర్మించుకోగలిగితే చారిత్రకమయిన అగాధాలను పూడ్చుకోగలిగితే, విశాలరాష్ట్రంగా ఏర్పడవలసిన అవసరం కానీ, ఆ తరువాత విడిపోవలసిన అగత్యం కానీ ఏర్పడి ఉండేవి కావు.

ఇట్లా ఆలోచించడం గతజలసేతు బంధమేమీ కాదు. తెలుగువారి ఆధునిక సామాజిక ప్రస్థానం చెప్పుకోదగ్గ ఘనచరిత్రగానే మొదలయింది. బ్రిటిషవారు పాలించిన తెలుగు ప్రాంతాలలో జాతీయోద్యమంలో అంతర్వాహినిగా, సమాంతర ధారగా. ఒక్కోసారి ప్రధానశక్తిగా కూడా ఆంధ్రోద్యమం సాగింది. నూరుసంవత్సరాల కిందటే తెలుగువారందరూ ఒక్కటికావాలన్న రాజకీయ ఆకాంక్ష వ్యక్తమయింది. ప్రత్యేక రాష్ట్రం కావాలన్న ఆకాంక్ష రాజకీయంగా వ్యక్తమయినా, తెలుగువారు సకలరంగాలలో తమను తాము విజృంభింపజేసుకోవడానికి చోదకఅంశంగా ఆంధ్రోద్యమం పనిచేసింది. సంఘసంస్కారం, భాషాసంస్కరణ, హేతువాదోద్యమం, అభ్యుదయోద్యమం- అన్నీ తీరాంధ్రంలో ఒకదానివెనుక మరొకటి వెల్లువెత్తాయి. కానీ, ఏదో లోపం జరిగింది. తమిళనాట జరిగిన ప్రక్రియకూ మన ప్రస్థానానికీ ఏదో తేడా ఉన్నది. కమ్యూనిస్టులు పూనుకుని భాషాజాతీయవాదాన్ని నడిపించినా, ఎందుకనో తెలుగువాదం నెత్తుటిలోకి ఇంకలేదు. రాజకీయం తెలుగు సమాజంలోని ఏకరూపతను కాక, విచ్ఛిన్నతనే పైకి తెచ్చింది. తెలంగాణలో తెలుగువారి వికాసం అసామాన్యమైనది. బహుభాషారాష్ట్రంలో, ఒక అర్థరాచరిక భూస్వామ్యపాలనలో, తల్లిభాషకు ఆదరణలేదన్న వేదనతో తెలంగాణ తెలుగువారు సంఘటితమయ్యారు. అక్షరం అక్షరం కూడదీసుకుని తమను తామొక నినాదంగా మలచుకున్నారు. భాషనుంచి, సంస్కృతినుంచి నేలవిముక్తి దాకా ప్రయాణించారు. చారిత్రకమయిన ప్రతికూల పరిస్థితులు, విద్యకు వికాసానికీ కనీసంగా ఉన్న అవకాశాలు, వీటన్నిటికీ ఎదురీది, సైనికచర్య ద్వారా ప్రజాస్వామ్యంలోకి ప్రవహించిన తరువాత మరో కథ. సాటి తెలుగువారితో సహజీవనం అరమరికలతోనే సాగింది తప్ప, హార్దికమైన ఏకీభావానికి ఆస్కారమే దొరకలేదు. అరవయ్యేళ్ల ప్రయాణం చివరకు తీపిగురుతులేవీ మిగల్చకుండానే వ్యర్థమయిందా అనిపిస్తుంది. భాష ఒక్కటే అయినా మా ఘోష వేరు అంటూ తెలంగాణ ప్రత్యేకరాష్ట్రాన్ని సాధించుకున్నది.

భావోద్వేగాల తలపోత కాక, నిజంగా ఎక్కడ మనం విఫలమయ్యామని తెలుగులంతా ఒకసారి ఆత్మపరిశీలన చేసుకోవాలి. విభజన తరువాత అయినా- పెద్దలు, ముఖ్యంగా తెలుగువారి ఐక్యతను, విశాలాంధ్ర రాష్ట్రాన్ని కోరుకున్నవారు- ఆ పనిచేసి ఉండవలసింది. చలోక్తుల చమత్కారాల ఆత్మశోధన కాదు, నిజమైన నిర్భయమైన రేపటి నడకకు పనికివచ్చే ఆత్మవిమర్శ. ప్రత్యేక హోదా గురించి ఎందుకింతగా మథన, తపన కనిపిస్తోందో అర్థం కాదు. అలాగని ఆ కోర్కె వెనుక నిజాయితీ, సమాజం మీద ప్రేమ లేవని కాదు.. ఉన్నాయి. కానీ, ఆంధ్రప్రదేశ్ పౌరసమాజానికి తనకేమి కావాలో దానికి వ్యక్తీకరణ ఇవ్వలేకపోతున్నదని అనిపిస్తుంది. ఈ సందర్భంగా తెలుగుకు ప్రాచీనభాష హోదా కోసం జరిగిన ఆందోళన గుర్తువస్తున్నది. ఆ ఆందోళనలో పాల్గొన్నవారిలో అనేకులకు ప్రాచీనహోదా వల్ల ఏమి ప్రయోజనాలుంటాయో తెలియదు. తమిళానికి వచ్చినట్టుగా తెలుగుకు కూడా ఒక గుర్తింపు కావాలన్న ఆకాంక్ష తప్ప మరొకటి అందులో లేదు. ఒక భాష ఉన్నతి కోరుకోవడమంటే, ఆ భాషను మాట్లాడేవారి బాగును కోరడమే. ఆంధ్రోద్యమంలో అయినా, తెలంగాణలోని వికాసోద్యమంలో అయినా భాష కోసం వ్యక్తమయిన తపన సారాంశంలో రాజకీయమైనది. తెలుగువారికి మెరుగైన ప్రతిపత్తి, సాధికారత కావాలన్న కోరిక అది.

కానీ, తెలుగుకు ప్రాచీనహోదా వచ్చిన తరువాత ఏమయింది? కోర్టు కేసుల్లో అది అణగారిపోయిన మాట నిజమే కానీ, తెలుగువారు దాన్ని మరచిపోయారు. దాని అతీగతీ చూసినవారే లేకపోయారు. సారాంశం మీద దృష్టి లేకపోతే ఆరంభశూరత్వం పర్యవసానం ఇట్లాగే

ఉంటుంది. ఇప్పుడు ప్రత్యేక హోదా సమకూరినా కూడా అందులో ప్రజలు చేయదగినది, ప్రజలకు నేరుగా ఒరిగేదీ ఏమీ ఉండదు కాబట్టి, ఆ తరువాతా మౌనమే మిగులుతుంది. తమకేదో లోపం జరిగిందని బాధ పడుతున్న సమాజం, ఆ లోపాన్ని అధిగమించగలిగే క్రియాశీల ప్రయత్నం చేయాలి. లోపం విభజన వల్ల కంటె, ఐక్యత లేకపోవడం వల్ల అధికంగా జరిగింది. ఒకరాష్ట్రమైనా, రెండు రాష్ట్రాలైనా సరే, తమిళుల వలె సంఘటిత శక్తిగా ఉండగలిగితే, ఢిల్లీ ముందు చేతులు చాచవలసిన అవసరం ఉండదు.

ఆంధ్రోద్యమం కాలం తరువాత, ఎన్టీయార్ తెలుగువారికి ఒక గుర్తింపు తెచ్చినమాట నిజం. అధికారానికి వచ్చిన కొత్తలో తెలుగు భాష ప్రాతిపదికగా ఉద్వేగపూరితమైన ఐక్యతను కల్పించడానికి ఆయన గట్టిగా ప్రయత్నించారు కానీ, దానికి సాంస్కృతికమైన, భావజాల పరమైన పునాదిని కల్పించనందున, క్షేత్రస్థాయిలో అసమానతలను తొలగించి వాస్తవికమైన ఐక్యతకు దారులు వేయనందున– త్వరలోనే అది చెదిరిపోయింది. తమిళనాయకుల మాదిరి (వారు ఆదర్శమని కాదు, కానీ, వారి ప్రాంతీయ ప్రయోజనాలను రక్షించడానికి వారు కొన్ని సిద్ధాంతాల మీద ఆధారపడ్డారు) ఎన్టీయార్ భాషాజాతీయవాదాన్ని కొనసాగించలేకపోయారు. రెండు ప్రత్యేక ఉద్యమాల అనంతరం తెలుగుదేశం పేరుతో పార్టీ పెట్టి ప్రభంజన విజయం సాధించిన ఎన్టీయార్, తరువాత రాజకీయాలమీదనే దృష్టిపెట్టారు. ఆరంభశూరత్వం అన్న మాట తెలుగువాదం విషయంలో ఆయనకూ వర్తిస్తుంది. ఎన్టీయార్ నిష్క్రమించిన వెంటనే ప్రత్యేక తెలంగాణ వాదం బలం పుంజుకోవడం ఒక యాదృచ్ఛిక వైచిత్రి.

ఇప్పుడు రెండు రాష్ట్రాలను నడిపిస్తున్న మనోభావాల పునాదులు వేరు. ఇప్పుడు తెలుగు గురించి, దాన్ని వెలిగించడం గురించి మాట్లాడితే ఎవరికన్నా రుచిస్తుందా? తెలుగు మీడియంను పూర్తిగా తుడిచిపెట్టే ప్రయత్నాలు తెలుగుప్రభుత్వాలే చేయగలుగుతున్నాయి. అన్నం పెట్టని భాష తల్లిభాష అయినా వదిలిపెట్టవలసిందేనని బాహాటంగా అనగలుగుతున్నాయి. ఎగుమతి ఆధారిత విద్యావిధానంలో తెలుగెక్కడ? మాండరిన్ నేర్చుకుంటున్నారు ఎగబడి హైదరాబాద్‌లో! మేక్ఇన్ ఇండియా తరంలో, ఇండియన్ ఉత్పత్తులు, విద్యలు, భాషలు ఏమీ మిగలవు. తెలుగును బౌద్ధిక భాషగా, శాస్త్రవిజ్ఞానభాషగా తీర్చిదిద్దడం, నిఘంటువులను, ప్రమాణభాషను రూపొందించడం– ఈ కర్తవ్యాలను పట్టించుకునే నాథులున్నారా, సామల రమేష్‌బాబు గారూ? గిడుగు గారికి శ్రద్ధాంజలి ఘటించడం తప్ప, చిగురంత ఆశను కూడా చూడలేకపోతున్నాను, క్షమించండి..

---

**ఆంధ్రజ్యోతి దినపత్రికలో 2015 ఆగస్టు 27న సంపాదకులు డా॥ కె. శ్రీనివాస్ 'సందర్భం' శీర్షికలో వ్రాసిన వ్యాసం.... ఆంధ్రజ్యోతి సౌజన్యంతో**

**కవిత**

# మధునిధి

**వేల** ఏళ్ళ పలుకు
రేల పూల కులుకు
గాలికే పులకింత
కలిగించు మన తెలుగు!

**లే** రావి ఆకులా
మల్లెపూరేకులా
మార్దవమ్మైనది
మన ముద్దు తెలుగు!

**శి**శిరమే ఎరుగని
తరువు మన తెలుగు!
వెలియుటన్నది లేని
ఇంద్రధనువే తెలుగు!

**పొ**లము, గళముల తడుపు
గోదారి నది లాగ
ప్రతి అక్కరను తీర్చు
గని జాను తెనుగు!

**రా**యనృపతికి చాల
ప్రియమైన పెన్నిధి!
బ్రౌను దొరకారవ
ప్రాణమ్ముఅయినది!

**పు**వ్వుల ఎదలందు
పదిలమౌ మధువులా
ప్రతి పదమ్ములో
పొదిగుండు తీపి!

**ఎంత** తోడిన గాని
సుంతైన తరగని
ఆ కడలి మాదిరి
అక్షయం పదసిరి!

**గాలి** గానమ్మోను
వేణువందున జేరి!
గొంతు వీణియయగును
తెనుగు భాషను గూడి!

**క**ల్పతరు బీజాలు
కొలువు తీరిన రీతి
కనువిందు చేయులే
తను వర్ణమాల!

**తె**లుగు పొత్తము జూడు
తేనె పట్టును బోలు!
తన పుటల గూళ్ళలో
తొణకు మధునిధులు!

**ప**ద్యమో, గద్యమో
పల్లెజన పదమో-
తన రూపమేదైనా
రంజిల్లు డెందము!

**'నాను'** అన్న, 'నేను' అన్న
'ఏంది' అన్న, 'ఏంటి' అన్న
'ఔ' అన్న, 'ఆయ' అన్న-
'అట్ల' అన్న, 'గట్ల' అన్న
ప్రతి యాస రసధుని!
వీనులకు ఆమని!
మక్కువతో ఆ వాణి
కూర్చుకున్న బాణీ!

**పేగు** సారం పోసి
పది నెలలు మోసి
కన్నతల్లికి సాటి
అమ్మభాషొక్కటే!

**తల్లి** నోటను విన్న
తొలి 'లాలి' నుంచి
అంత్యఘడియల్లోని
తుది తలపు వరకూ
అమ్మభాషతోనే
అల్లుకుని ఉండు!

**క**న్నీటిజాలులో
ఎడద తడిలాగ
పూసేటి పూలలో
పుడమి పసలాగ
వలవలలో, కిలకిలలో
వగపులో, వేడుకలో
అమ్మ భాషుంటుంది!
మన ఆత్మ తానవుతుంది!

**వి–రాగి**
ఫోను: 9676635017

గిడుగు 152వ జయంతి

- డా. సామల రమేష్‌బాబు

# ప్రజాస్వామ్య పరిరక్షణకే నేటి తెలుగు భాషోద్యమం

**మా**తృభాష స్వేచ్ఛను ప్రతిఫలిస్తుంది. అంతరంగాన్ని వెల్లడి చేస్తుంది. ప్రజాస్వామ్య పునాదిపైనే అది వికసిస్తుంది. కట్టడిచేస్తే, నిబంధనలను విధిస్తే అది బిగుసుకుపోతుంది. దాని ఎదుగుదల ఆగిపోతుంది. అందుకే గిడుగు వేంకట రామమూర్తిగారు భాషా ప్రజాస్వామ్యంకోసం ఎంతో పోరాటం చేశాడు.

ఆ రోజుల్లో భాషపై తమకు గుత్తాధిపత్యం ఉందని పండితులు అనుకొనేవారు. అప్పుడు భాష అవసరాలు పరిమితం. నాటి ప్రజలు తమ వృత్తులలో, బతుకు తెరువుల అవసరాల్లో తమ 'అమ్మనుడి'పైనే ఆధారపడ్డారు. తమ భాషా అవసరాలన్నిటినీ మౌఖికంగానే తీర్చుకొన్నారు. రాజుల కాలంలో పండితులకు తమ పాండిత్యాన్ని, కవితాశక్తిని ప్రదర్శించి మెప్పు పొందవలసిన అవసరం ఉంది గనుక 'తెలుగు మాటలనంగవలద'నే కట్టడిని విధించుకొన్నారు. అందువల్ల వారు కొన్ని ప్రయోజనాలను పొందితే పొంది ఉండవచ్చు గాని సాధారణ జనజీవితంలోని భాషా మాధుర్యానికి తమను తాము దూరం చేసుకొన్నారు. లిఖిత సాహిత్యంలో తమ పాండిత్య భాషకు పీఠం వేశారే తప్ప జనభాషలోని తియ్యందనాన్ని అందులో నింపలేకపోయారు. పైగా తాము వ్రాసిందే భాష అనీ తమదే పాండిత్యమనీ విర్రవీగేవారు. ఈ ధోరణివల్ల సాహితీరంగంలోకి సామాన్య జనులు అడుగుపెట్టేందుకే భయపడేవారు. విద్యాసంస్థలు మొదలై అందరికీ విద్యాబుద్ధులు అందుబాటులోకొచ్చిన తర్వాత ఈ పండితుల ప్రభావమే తెలుగుపై ఉండేది. అటువంటి దశలో గిడుగు రామమూర్తి గారు ఈ భాషా శౌచం మీద తిరగబడ్డారు. పండితుల భాషాభేషజాన్ని తూర్పారబట్టారు. వాడుకభాష ఉద్యమాన్ని నడిపి, తెలుగు బిడ్డలంతా తమ తెలుగుపై తాము నమ్మకాన్ని పెంచుకొనేట్లు చేయగలిగారు. సంకెళ్లు తెంచుకొన్న తెలుగుతో కొత్త కొత్త సాహిత్యం వచ్చింది. భాష ప్రజాస్వామీకరణకు దారులు తెరచుకొన్నాయి.

గిడుగువార్ని వాడుకభాషా ఉద్యమమంటే ప్రజల భాషను ప్రజలకే అందించడానికి జరిగిన ఒక గొప్ప ప్రయత్నం. ఆయన వేసిన పునాదులపై సిద్ధాంతాలపై ఆధారపడి ఆ ఉద్యమాన్ని విస్తరించడానికి, ఫలితాల్ని నిజం చేయడానికి తాపీ ధర్మారావు, శ్రీపాద సుబ్రహ్మణ్య శాస్త్రి వంటివారు వీలైన అన్ని దారుల్లోనూ ముందుకు సాగారు. ఆధునిక తెలుగు సాహితీరంగం కాంతులు విరజిమ్మింది.

సుమారు 25 ఏళ్ల క్రితం పరిస్థితి చూస్తే- తెలుగునేలపైన తెలుగుకేమీ ఢోకాలేదనే పరిస్థితే ఉండేది. కళాశాల స్థాయిలో కూడా తెలుగు మాధ్యమంలో చదువుకోవడానికి వీలుండేది. ఆ తర్వాత త్వరత్వరగా కాలం మారిపోయింది. అవసరంలేని చోట కూడా ఇంగ్లీషు భాషకు పీట వెయ్యటం అలవాటయింది. నిపుణుల సలహాలను, సిఫారసులను కూడా ప్రక్కనబెట్టి ప్రాథమిక విద్యనుండే ఆంగ్లాన్ని విత్తుచల్లడం మొదలైంది. ఎటువంటి విచక్షణ లేకుండా ఆంగ్లాన్ని నెత్తిన పెట్టుకోవడంతో మాతృభాషలోనే విద్య అనే సిద్ధాంతానికి చేటు వాటిల్లింది. అంటే ప్రజల భాషను ప్రజలకు దూరం చెయ్యడం ద్వారా ప్రజాస్వామ్య పునాదులనే తవ్వివేస్తున్నట్లయింది.

ప్రపంచీకరణ ప్రభావం విస్తరించేకొద్దీ ప్రజాభాషల అణచివేత పెరిగేకొద్దీ జీవవైవిధ్యం కనుమరుగైపోయే పరిస్థితి వచ్చింది. ఆధునికతకు ఆంగ్లమే ప్రాతినిధ్యం వహించే స్థితి ఏర్పడింది. తెలుగు నేలమీద ప్రభుత్వాలు పూర్తిగా దారితప్పి, తమదైన విద్యావిధానం, తమదైన భాషా విధానం ఉండాలనే స్పృహను కోల్పోయాయి. అందువల్ల పరిపాలన, విద్యారంగాల్లో తెలుగు వినిమయం తగ్గిపోసాగింది. సమకాలీన అవసరాలకు తగ్గట్లుగా అన్ని రంగాలలో మన భాషను ఎదిగించుకొనే ప్రయత్నమే లేకపోవడంతో తెలుగు అభివృద్ధి కుంటుపడింది. అంటే ప్రజల సహజ సంపదకు, వారి మేధోసంపదకు, వారసత్వ విజ్ఞానానికి ఆధారమైన మాతృభాష అణచివేతకు గురి అవుతున్నది. అంటే కాలక్రమంలో తెలుగుజాతి ప్రజలు తమ భాషా జాతీయతను ప్రజాస్వామ్య హక్కులను కోల్పోతున్నారన్నమాట.

ఈ పరిస్థితుల్లో మళ్ళీ 'గిడుగు' ఒక ప్రతీకలా చైతన్యవంతులైన కొందరు మేధావులల, ప్రజాస్వామ్య ప్రియుల మనసుల్లో మెదిలాడు. అందువల్ల ఆయన పుట్టిన రోజును 'తెలుగు భాషా దినోత్సవం'గా ప్రకటించుకొన్నారు. కొన్ని కార్యక్రమాలను చేపట్టారు. తమ చేతనైనంత మేరకు ఆందోళనను ప్రకటించడం మొదలుపెట్టారు. ఇంతలో ఐక్యరాజ్య సమితి వారి 'యునెస్కో' 1998-99 నాటికి మాతృభాషల్ని ఆయాభాషాజాతుల హక్కుగా గుర్తించి, వాటి రక్షణ కోసం ప్రతి ఫిబ్రవరి 21న అంతర్జాతీయ మాతృభాషాదినోత్సవంగా పిలుపునిచ్చారు. ఈ పిలుపును తెలుగు సమాజం అందుకొంది. తెలుగు భాషోద్యమ సమాఖ్యను ప్రారంభించుకొని ఉద్యమించసాగింది. 2003 నాటికి ఇదొక రూపాన్ని సంతరించుకొంది.

అప్పటికే తెలుగు రాష్ట్ర పాలకులు తెలుగును ఏమాత్రం పట్టించుకోని పరిస్థితి ఏర్పడింది. సచివాలయం వాకిలిపైన, దానిముందున్న తెలుగుతల్లి విగ్రహంపైనా తెలుగు అక్షరాలు పూర్తిగా మాయమై అంతా ఇంగ్లీషే తిష్ట వేసింది. ప్రభుత్వ ఉత్తర్వులన్నీ ఆంగ్లంలోనే! పాఠశాలల్లో ఆంగ్ల దురాక్రమణ మొదలైంది. తెలుగు అక్షరం కూడా నేర్చుకోకుండానే పాఠశాల చదువును పూర్తిగా సాగించుకొనే వీలు, దాన్ని సొమ్ము చేసుకోవడానికి విద్యావ్యాపారుల రంగప్రవేశం జోరందుకుంది. తెలుగుభాషోద్యమకారులు ఎంతో పోరాడి, ప్రభుత్వాన్ని ఒప్పించి కనీసం తెలుగును ఒక సబ్జెక్టుగానైనా 10వ తరగతివరకైనా చదివి తీరాలనే జి.ఒ.ను (86/2003) సాధించుకొన్నారు. దాని ఈనాటికీ అరకొరగానే ఉంది. ఆ తర్వాత పాఠశాల విద్యను అంచెలంచెలుగా ప్రభుత్వ పాఠశాలల్లో కూడా ఆంగ్లీకరించడం ఊపందుకుంది. ఇప్పుడది పతాకస్థాయికి చేరుకుంది.

ఆంగ్లాన్ని నేర్చుకోవద్దని ఎవరూ అనరు. ఆంగ్లాన్నే కాదు, అవసరాన్ని బట్టి ఏ భాషనైనా, ఎన్ని భాషల్నయినా నేర్చుకోవచ్చు. కాని ఇక్కడ తెలుగు ఒడిలో పుట్టి పెరుగుతున్న పిల్లలను పాఠశాలలో చేరిననాటినుండే ఇంగ్లీషు పిల్లలుగా మార్చాలనే ప్రయత్నం ఎంత అశాస్త్రీయమో, అమానవీయమో, అనాగరికమో ఏమాత్రం బుర్రవున్న వారికైనా అర్థమయ్యే సంగతి. తెలిసిన భాషద్వారా తెలియని దానిని (జ్ఞానాన్ని) తెలుసుకోవాలనే ఇంగితజ్ఞానాన్ని విస్మరించారు. ఒక భాషావిధానంగాని, విద్యావిధానంగాని లేకుండా గాలి ఎటు వీస్తే అటు కొట్టుకుపోయే ధోరణిలో మన ప్రభుత్వాలు సాగిపోతున్నాయి.

పైగా– ఎందుకు తెలుగుపట్ల నిర్లక్ష్యం వహిస్తున్నారని ప్రశ్నిస్తే విద్యావ్యాపారులైన కార్పొరేట్, మిషనరీ స్కూళ్లవారు తెలుగు ఇప్పటి అవసరాలకు పనికిరాదని, ఆంగ్లం నేర్చుకుంటేనే భవిష్యత్తు పదిలంగా ఉంటుందని అంటారు. ప్రభుత్వ నేతలను ప్రశ్నిస్తే–ప్రజలు ఇంగ్లీషు కావాలనే కోరుకుంటున్నారని, వారికి తెలుగు పట్ల ప్రేమలేదనే అంటారు. పైగా – 'పొరుగు రాష్ట్రాలను చూడండి; వారికి తమ మాతృభాషలమీద ఎంత ప్రేమో' అని ఎత్తి పొడుస్తారు. తెలుగు ప్రజలకు ఇంతగా అవమానిస్తున్న ఈ నేతలు భాషోద్యమకారులు అడుగుతున్న ప్రశ్నలకు సమాధానాలు చెప్పగలరా? ప్రతి తెలుగువాడికీ తన తల్లిమీద ప్రేమ ఉన్నట్లే, తన భాష మీద కూడా అంత మక్కువ ఉంటుంది. తన జీవనంలో, వికాసంలో తన తల్లినీ, తల్లిభాషనూ ఎన్నటికీ విడిచిపెట్టడు. కాని ఈ నాటి భాష అవసరాలు అపరిమితం. ఇప్పుడు తెలుగు కేవలం సాహిత్య భాషగానే ఉంటే చాలదు. అన్ని రంగాలలో, అన్ని ఆధునిక అవసరాలకూ–శాస్త్ర సాంకేతిక రంగాలన్నిటితోసహా– తన భాష తనకు కావాలి. పుట్టుకతోనే ఎటువంటి వ్యాకరణం నేర్వకుండానే తనకు పట్టుగల తన భాషలో చదువుకొని జ్ఞానాన్ని సంపాదించగల అవకాశాన్ని అతడు చేజార్చుకోడు. కాని ప్రశ్నఏమిటంటే–ఆ అవకాశాలున్నాయా? దానికి పూచీ ఈ ప్రభుత్వానిది కాదా? తన భాషలో చదువుకొంటే భవిష్యత్తు ఉంటుందనే భరోసా కలిగించవలసిన బాధ్యత ప్రభుత్వానిది కాదా? తన భాషలో తనకు పూర్తిగా పరిపాలనను అందించలేని ఈ నేతలు ఓట్లకోసం వచ్చినప్పుడు మాట్లాడేది తెలుగేకదా!

ప్రపంచమంతా ఇంగ్లీషులోనే వ్యవహారాలు నడపడంలేదు. అభివృద్ధి చెందిన, చెందుతున్న దేశాలు వాళ్ల మాతృభాషల్లోనే ప్రగతి సాధిస్తున్నాయి. మాతృభాషపై పట్టుంటేనే పరభాషల్ని నేర్చుకోవడం సులభమవుతుందనే సూత్రాన్ని అవి పాటిస్తున్నాయి. అందుకే చైనా, జపాన్ వంటి దేశాల్లో కూడా వ్యవసాయం నుండి పరిశ్రమలవరకూ వారి మాతృభాషలే కీలకం. ఇది మన విద్యా వ్యాపారులకూ, మన నేతలకూ బాగా తెలుసు. అయినా, బుకాయించగల ధైర్యం వాళ్లకు ఉంది. దుష్టవ్యూహాలూ ఉన్నాయి.

మన పాలకవర్గాలు కనీసం ఒక ప్రశ్నకు సమాధానం చెప్పాలి. పొరుగు రాష్ట్రాల ప్రజలకు తమ మాతృభాషలపై ప్రేమ ఉన్నదనీ, అదే మనకు లేదనీ మీరు అంటున్నారు కదా! మరి ఆ ప్రభుత్వాలు పరిపాలనను పూర్తిగా తమ భాషల్లోనే అందిస్తున్నాయే! తమ విద్యారంగంలో తమ భాషల్ని పూర్తిగా వినియోగించుకొంటున్నాయే! నేటి అవసరాలకు తగ్గట్లు తమ భాషల్ని తమ భాషామూలాలపైనే ఆధారపడి అభివృద్ధి చేసుకొంటున్నాయే! ఆ రాష్ట్రాల పాలకులు తమ లక్ష్యాలవైపు దూసుకుపోతున్నారే, మరి మన నేతలేం చేస్తున్నట్లు? వారు బాధ్యులు కారా? సంజాయిషీ చెప్పాలి. తెలుగు భాషోద్యమకారులు ఇప్పుడు అడుగుతున్నది ఇదే.

ఈ 29న గిడుగు జన్మదినోత్సవం. ఆయన మరణించి 75 ఏళ్లయినా, ఇంకా తెలుగు సమకాలీన చరిత్రలో నిలిచేవున్నాడు. ఆయన 'వ్యావహారిక భాషోద్యమాన్ని' నడిపి, పండితుల పిడికిళ్లనుండి భాషను విముక్తం చేసి భాషా ప్రజాస్వామీకరణకు దారులు తెరిచాడు. ఇప్పుడు జరుగుతున్నది కూడా భాషా ప్రజాస్వామ్య పరిరక్షణ ఉద్యమమే. కంచే చేను మేసినట్లు ప్రభుత్వమే ప్రజల భాషా హక్కులను అణచివేస్తూ ఉన్నందున ఇప్పుడు భాషోద్యమకారులు పోరాడుతున్నది పాలకులతోనే. అయితే గిడుగు ఉద్యమం పండితుల్ని దారిలో పెట్టగలిగింది. నేటి తెలుగు భాషోద్యమం కూడా పాలకుల్ని దారికి తీసుకురాగలుగుతుందా... అప్పటి పండితులేకాదు, ఇప్పటి పాలకులు కూడా మన తెలుగువాళ్లే కదా! ఏమైనా నిరంతర ఉద్యమాలే తెలుగుభాషను, తెలుగు జాతిని రక్షిస్తాయి. ఇందుకు యువతరంలోంచే కదలిక వస్తున్నది. నిరాశాపరులు దానిని చూడలేకపోవచ్చు. కళ్లు మూసుకున్నంతమాత్రాన వెలుగు లేకుండా పోతుందా!

**(29-8-2015 తేదీ ఆంధ్రజ్యోతి దినపత్రిక సౌజన్యంతో)**

# 'తెలుగు విశ్వవిద్యాలయం'కోసం రాజమండ్రిలో దీక్ష






ఆంధ్ర ప్రాంతంలోని తెలుగు విశ్వవిద్యాలయం శాఖల పరిరక్షణకోసం ప్రముఖ సాహిత్య సంస్థ సి.పి. బ్రౌను మందిరం సారథ్యంలో రాజమహేంద్రిలో 'ఏకదిన జాగృతి దీక్ష జరిగింది. సాహితీవేత్త ఆచార్య యార్లగడ్డ లక్ష్మీప్రసాద్, బ్రౌనుమందిరం నిర్వాహకులు సన్నిధానం శాస్త్రి దీక్ష చేశారు. ఆంధ్రప్రదేశ్ విభజన చట్టం 10వ షెడ్యూలు క్రింద తెలుగు విశ్వవిద్యాలయం పరిరక్షణకు ఆంధ్ర ప్రభుత్వం ఎటువంటి క్రియాత్మక చర్యలు చేపట్టక పోవడాన్ని వీరు నిరసించారు. ఆంధ్రప్రాంతంలో రాజమండ్రి కూచిపూడి, శ్రీశైలం పీఠాలున్నాయని, వందలాది ఎకరాల భూములు కూడా ఉన్నాయని, విభజనచట్టం ప్రకారం తెలుగు వర్సిటీని రక్షించాలని వీరు కోరారు. రాజమండ్రిని ప్రధాన కేంద్రంగా చేస్తూ యూనివర్సిటీని బలోపేతం చేయాలని యార్లగడ్డ, సన్నిధానం కోరారు. మూడు ప్రాంతాలనుండి యూనివర్సిటీ సిబ్బంది, విద్యార్థులు తరలివచ్చారు. వివిధ సంఘాలు, రాజకీయ పార్టీలు మద్దతు పలికాయి.

- శ్రీ వి. బాలసుబ్రహ్మణ్యం, శాసనమండలి సభ్యులు

# విద్యారంగం - భాషావిధానం

## (గుంటూరులో 28-8-2015న జరిగిన తెలుగుభాష రక్షణ-అభివృద్ధి సదస్సులో సమర్పించిన పత్రం)

రాష్ట్ర ప్రభుత్వం జి.వో.యం.యస్. నెం. 53 ద్వారా స్వాతంత్ర్య దినోత్సవానికి ముందు రోజు తీసుకొన్న నిర్ణయం విద్యారంగం పట్లా, మాతృభాష పట్లా ఏ కొంచెం అభిమానం వున్నవారినైనా తీవ్రంగా కలిచివేసింది. దీని ప్రకారం సక్సెస్ పాఠశాలల్లో (తెలుగు, ఇంగ్లీషు రెండు మీడియంలూ వున్న ఉన్నత పాఠశాలల్లో) 100 మందికి మించి ఇంగ్లీషు మీడియం పిల్లలుంటే తెలుగు మీడియం పిల్లలందరూ ఆ బడి వదిలి వెళ్ళిపోవాలి. దగ్గరగా వున్న మరో బడిలో చేరాలి లేదా ఇంగ్లీషు మీడియంకు అయినా మారాలి. ప్రభుత్వ గణాంకాల ప్రకారమే 69 శాతం తెలుగు మీడియం పిల్లలుంటే, 31 శాతం మాత్రం ఇంగ్లీషు మీడియం ఈ స్కూళ్ళలో చదువుతున్నారు. మూడవ వంతు కూడా లేని ఇంగ్లీషు మీడియం కోసం రెండు వంతులకు మించిన పిల్లలు ప్రక్క బడికెందుకు వెళ్ళాలి అని గానీ, ఆచరణలో ఇది సాధ్యమా అని గానీ ప్రభుత్వం ఒక్క నిమిషం కూడా ఆలోచించ లేదు. చివరికి గగ్గోలు కావడంతో దీన్ని ఉపసంహరించుకొన్నారు. అది వేరే సంగతి.

దీన్నుంచి ప్రభుత్వం విద్యారంగ భాషా విధానం పట్ల ఏ వైఖరితో వుందో మనం అర్థం చేసికోవచ్చు. ఏమిటీ వైఖరి?

**ఒకటి:** ఇంగ్లీషు మీడియం చాలా అవసరం. దీన్ని మీవీలున్నంతమందికి (బలవంతంగానైనా సరే) అందివ్వాలి. అప్పుడే మన పిల్లలు రాణిస్తారు. పేద పిల్లలు అంతర్జాతీయ అవకాశాల్ని అందుకొంటారు. ప్రభుత్వ పాఠశాలలు బ్రతికి బట్టకడతాయి.

**రెండు:** ఇంగ్లీషు మీడియం శక్తివంతంగా వుండాలంటే తెలుగు మీడియం దాని ప్రక్కన వుండగూడదు. దీనివల్ల పిల్లలకు ఇంగ్లీషు వాతావరణం వుండదు. ఇంగ్లీషు మీడియం పిల్లలు తెలుగు మీడియంలోకి జారిపోయే ప్రమాదం వుంది. (8,9,10 తరగతుల కొచ్చేసరికి నిజంగానే సగం మంది మోహం మొత్తి జారిపోయారు).

**మూడు:** తెలుగు మీడియం పిల్లలు ద్వితీయ శ్రేణి పిల్లలు. వీరు ఇంగ్లీషు మీడియం పిల్లలకోసం 'త్యాగం' చేయాలి. (ప్రాజెక్టు కోసం గిరిజనుల్లాగా). ఉన్న వూళ్ళో బడినైనా వదులుకోవాలి, వీళ్ళకేమీ బాలల హక్కులంటూ వుండవు. విద్యా హక్కు చట్టాలు వర్తించవు. వీళ్ళనీ, వీళ్ళ తల్లిదండ్రుల్నీ సంప్రదించాల్సిన అవసరం ఏమీ వుండదు. ఓ మంత్రిగారో, ఓ అధికారిగారో అనుకొంటే చాలు, వీళ్ళంతా బడి వదిలి వెళ్ళిపోవాలి. తెలుగు మీడియంలో చదువుతున్న పాపానికి తెలుగు నాట ఈ శిక్ష అనుభవించాలి.

ఈ సంవత్సరం కస్తూరిబా పాఠశాలల్లోని తెలుగు మీడియం విద్యార్థిను లందర్నీ ఇంగ్లీషు మీడియంలోకి వారి ఇష్టాయిష్టాలతో, శక్తిసామర్థ్యాలతో నిమిత్తం లేకుండా మార్పించారు. వీరంతా బడి మానేసిన పిల్లలు. నిరుపేదలైన ఆడపిల్లలు. వీరి మనోభిప్రాయాలకు విలువ ఏముంటుంది?

ఇప్పటికే గురుకులాలన్నిటా తెలుగు మీడియం రద్దయింది. గిరిజన గురుకులాల్లో సైతం రద్దయింది. కనీసం సమాంతరంగా రెండు మీడియంలు రెండు సెక్షన్లలో నడపమంటే ఒప్పుకోరు. గురుకులాల్లో చదవాలంటే ఇంగ్లీషు మీడియంలోనే చదవాలన్న షరతు విధించేశారు. గురుకులాలు అత్యున్నత ప్రమాణాల పాఠశాలలనీ, వాటిలో చదివే బలహీన వర్గాల పిల్లల్ని అంతర్జాతీయావకాశాల్ని అందుకొనేలా తీర్చిదిద్దాలంటే ఇంగ్లీషు మీడియం తప్పదని నిర్ణయించారు. దీనివల్ల ఈ వర్గాల్లోని మరీ నిరుపేదలు వీటికీ దూరం అవుతారు. అయినా ఫరవాలేదని సిద్ధాంతీకరించారు. క్రమంగా యిది ప్రాథమిక పాఠశాలలకు కూడా ప్రాకుతుంది. ఉన్నత పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం పిల్లలు ఎక్కువగా చేరకపోవడానికీ, చేరినా మధ్యలో జారిపోవడానికీ, నిలిచినా అనుకొన్న ప్రమాణాలు సాధించలేక పోవడానికీ ప్రాథమిక స్థాయిలో ఇంగ్లీషు మీడియం లేకపోవడమే కారణమని ఈ విద్యావేత్తలు ప్రవచిస్తున్నారు. ప్రభుత్వ పాఠశాలలు నిలబడాలంటే ఇంగ్లీషు మీడియంలోకి మార్చడమే శరణ్యమని ఇప్పుడు ఉపాధ్యాయులు కూడా రాగం తీస్తున్నారు.

ఇదీ ప్రభుత్వ వైఖరి, దృక్పథం, విద్యారంగ భాషా విధానం. ప్రభుత్వానికే గాదు, మన ఉపాధ్యాయులదీ, వారి సంఘాలదీ, సామాజిక ఉద్యమకారులదీ, వామపక్షాలదీ, చాలామంది తల్లిదండ్రులదీ, బుద్ధి జీవులదీ కూడా మన రాష్ట్రానికి సంబంధించినంత వరకు ఇదే ధోరణి. ఇదొక సంస్కృతిగా అల్లుకుపోయిన సందర్భంలో మనమున్నాం. కార్పొరేట్ శక్తులు విద్యారంగంలోకి చొచ్చుకొని పొయ్యాక ఈ సంస్కృతి ఘనీభవించి. ఒక భౌతిక శక్తిగా మారిపోయింది. వ్యాపారానికి కూడా ఓ మాధ్యమం కావాలి. అదే సంస్కృతి. విద్యావ్యాపారానికి ప్రస్తుతం ఇంగ్లీషు భాషా వ్యామోహం గొప్ప మాధ్యమం.

### మాతృభాషలో ప్రాథమిక విద్య :

కనీసం ప్రాథమిక విద్య వరకైనా (5వ తరగతి వరకా, 8 దాకానా అనే చర్చ మళ్ళీ వుంది) మాతృభాషలో విద్య నేర్వాలన్న వాదం అదేదో మాతృభాషోద్ధరణ కోసమో, సెంటిమెంట్‌గానో, దేశభక్తితోనో వచ్చింది కాదు. (అట్లని 'చేరా' చెప్పినట్లు మాతృభాషపై సెంటిమెంటు, ప్రేమ, భక్తి వుండటం నేరమేమీ కాదు).

ప్రతి బిడ్డకూ ఒకటవ తరగతిలోకి ప్రవేశించేటప్పటికి 300 నుంచి 600 పదాలు తెలిసివుంటాయి. వాటితో ఆ బిడ్డ తన పరిసరాలన్నింటితోనూ సంభాషిస్తుంటుంది. తన పదజాలాన్ని, వాక్య నిర్మాణ కౌశలాన్ని ఒక వైపు, తన ఆలోచనా శక్తిని, సృజనశీలతను, కల్పనా శక్తిని మరోవైపు పెంచుకొంటూ వుంటుంది. ఇది బిడ్డ భాషా రూపంలో చేసే చర్య, దానికెదురయ్యే ప్రతి చర్య ఆధారంగానే జరుగుతుంది. ఇదంతా మాతృభాష ద్వారానే జరుగుతుంది. దీన్ని మరింత పరిపుష్టం చేస్తూ, పరిణతం చేస్తూ విద్యాబోధన జరగాల్సి వుంటుంది. ఇదొక బోధనాభ్యసన సూత్రం.

మనిషికీ జంతువులకూ ప్రధాన భేదం సృజనాత్మకత. అందుకవకాశ మిచ్చేది భాష. భాష అంటే ప్రస్తుతార్థంలో మాతృభాష. మానవుని సృజనాత్మక శక్తికి భాష ఒక వేదిక, ఒక సాధనం. స్వభాషపై తగిన పట్టులేకపోతే ఆ వ్యక్తికి సృజనాత్మక శక్తి కుంటుపడుతుంది. ఇంగ్లీషు మీడియం స్కూళ్ళలో చదువుకొనే విద్యార్థులకు ఏ భాషా అధీనంలో వుండదు. ఏ భాషనూ క్రియేటివ్‌గా ఉపయోగించలేరు. వివిధ విషయాలను వివేచించి నూత్నాంశాలను ఆవిష్కరించే శక్తి వీళ్ళకుండదు. భాషా శాస్త్రవేత్తలే గాదు,

విద్యా తత్వవేత్తలు సైతం ప్రపంచమంతా అంగీకరిస్తున్న, పాటిస్తున్న విధానమది.

మాతృభాషను నేర్చుకొనే పద్ధతిని భాషా శాస్త్రజ్ఞులు సహజ సంపాదన (Acquistion) అంటారు. చాలా చిన్నతనంలోనే పిల్లలకు మాతృభాషపై పట్టు వస్తుంది. అది చాలా సహజంగా వస్తుంది. అయిదేళ్ళకే పిల్లలు మాతృభాషలో వాక్య నిర్మాణ రీతుల్ని స్వాధీనం చేసుకొంటారని 'చామ్‌స్కీ' అంటారు. పిల్లలకు పుట్టుకతోనే భాషా సంపాదనా సాధనం (Language Acqusition Device) వుంటుందనీ, అది అలిఖిత వ్యాకరణాన్ని నిర్మిస్తుందనీ ఆయన ప్రతిపాదన. అంటే భాషా సంపాదన అనుకరణ ద్వారా గాక సృజనాత్మక వాక్య ప్రయోగం ద్వారా జరుగుతుందనీ, అలాంటి వాక్యనిర్మాణ దక్షత, దానికి తగ్గ వివేచన, యంత్రాంగం పిల్లలకు పుట్టుకతోనే వస్తాయని ఆయన వాదం. దీన్ని ఆయన జీవ స్వభావం (Biological Endowment) అంటారు. అంతేగాక సహజ సంపాదన, సృజనాత్మక వాక్య నిర్మాణ దక్షతా మానవుల ప్రత్యేక లక్షణమని (Species specific) కూడా ఆయన ప్రతిపాదిస్తారు.

ఒకవేళ బిడ్డకు చిన్నప్పుడే మాతృభాషా వాతావరణం లాంటి మరో వాతావరణం కూడా వుండే అవకాశం వుంటే రెండు భాషల్లోనూ సమాన సృజన శక్తిని సంపాదించుకొంటారు.

'ఈ క్రమంలో పిల్లలు వాక్య నిర్మాణ రీతుల్నే గాదు, ప్రయోగ వైచిత్రిని, వైవిధ్యాన్ని కూడా నేర్చుకొంటారు. కొత్త వాటిని సృజిస్తారు. సామెతలు, జాతీయాలు, పలుకుబళ్ళు అర్థవంతంగా వాడతారు. అర్థపుష్టిపై స్పష్టత ఏర్పడుతుంది. ఇదంతా సంపూర్ణంగా బాల్యంలోనే లభిస్తుందనిగానీ, బాల్యంలోనే ఇదంతా ఆగిపోయిందని గానీ, జీవితాంతం ఈ సృజనశీలత వికసిస్తూనే వుంటుందని గానీ చెప్పలేము గానీ బాల్యదశ మాత్రం దీనికి కీలకమైంది. విద్యార్థి దశలోనే ఇది ఎక్కువగా, సహజంగా జరుగుతుంది. విద్య సహజ సంపాదనకు (Acquisition) స్పృహతో కూడిన అభ్యసనాన్ని (Conscious Learning) జోడిస్తుంది. మాట్లాడే భాషను రాసే భాషకు తోడు చేస్తుంది'.

'సారాంశం ఏమంటే మనిషిలోని సృజనాత్మకతకు దోహదం చేసేది మాతృభాష. కనుక దీన్ని క్షుణ్ణంగా నేర్చుకోవాలి. కొత్త ఆలోచనలు చెయ్యాలంటే మాతృభాష నేర్చుకొని తీరాలి'.

భాషలోనూ, భాష ద్వారానూ సంక్రమించే ఈ సృజనాత్మకత అన్ని రంగాల్లోనూ, అన్ని విషయాల్లోనూ వ్యక్తమవుతుంది. మనిషిని సర్వతోముఖ వికాసం వైపు నడిపిస్తుంది.

దాదాపు ఆధునిక సమాజాలన్నీ దీన్ని అంగీకరించి మాతృభాషలోనే విద్య నందిస్తున్నాయి. మాతృభాషను పటిష్టంగా నేర్చుకొనే పద్ధతిని పాటిస్తున్నాయి. అమెరికా నుంచి చైనా దాకా, చైనా నుంచి శ్రీలంక దాకా దీన్ని గమనించవచ్చు.

**బహుళ భాష సమాజాలు :**

ఆంగ్లమే మాతృభాషగా వున్న సమాజాల్లో ఏ సమస్యా ఉత్పన్నం కాదు. కానీ ఆ దేశాల్నించి మనం నేర్చుకోవలసింది ఏమంటే అవి విద్యారంగంలో భాషకిస్తున్న ప్రాధాన్యం, అవి భాష మీద పట్టు మాత్రమే, మరీ ముఖ్యంగా పఠనంలోని పరిణతిని మాత్రమే నేర్చుకొన్న చదువుకు కొలబద్దగా గుర్తిస్తాయి. దేన్నయినా ఆసక్తితో చదవడం, విమర్శనాత్మకంగా విశ్లేషించడం, భిన్నంగా ప్రతిపాదించడం, ప్రశ్నించడం అనేవి మూల్యాంకనాల్లో కీలక పాత్ర వహిస్తాయి. పాఠ్య గ్రంథాల వల్లెవేతను అవి చదువుగా స్వీకరించవు. వేల పుస్తకాలు చిన్న బిడ్డకు సైతం అందుబాటులో వుంటాయి. స్వేచ్ఛగా ఇష్టం వచ్చినవి చదవడం, చదవడమే ఒక ప్రవృత్తిగా మార్చుకోవడమే అక్కడ విద్యకు నిర్వచనంగా వుంది. పి.ఐ.ఎస్.ఎ. (PISA) లాంటివి విద్యార్థుల ప్రమాణాల్ని అంతర్జాతీయ స్థాయిలో నిర్ణయించేపుడు భాషకు అత్యంత ప్రాధాన్యత నిస్తాయి. ఇదేదో అందర్నీ భాషా పండితుల్ని చేసేందుకు కాదు. 'విమర్శనాత్మక ఆలోచన ఉన్నవారు సృజనశీలురుగా వుంటారని, వారు మాత్రమే నూతనావిష్కరణలు చేయగలరని వారి నమ్మకం. సమాజంలోనూ వారు మాత్రమే రాణించగలరని, సమాజాన్ని సైతం వారే నడిపించగలరని వారి విశ్వాసం. ఇదేదో గుడ్డి నమ్మకం కాదు. ఈ భాషా విధానం ఫలితంగానే వారు ప్రపంచాన్ని శాసిస్తున్నారు.

బ్రిటన్, ఫ్రాన్స్, జర్మనీ, జపాన్ కాలనీలు గానో, ఆర్థికంగా సాంస్కృతికంగా చారిత్రక కారణాల వల్ల ఇలాంటి సామ్రాజ్యవాద దేశాలకు అత్యంత సన్నిహితంగా వున్న దేశాల్లోనో ఈ 'అంతర్జాతీయ' భాషను కూడా నేర్చుకోవాల్సి వస్తోంది. ఇంగ్లీషు నేర్చుకోడం మనకు తప్పనిసరి అవసరంగాకున్నా ముఖ్యమైన అవసరంగా మారింది. రేపు జపాన్, ఎల్లుండి చైనీస్ భాషల్ని కూడా మనం ఇలానే నేర్చుకోవాల్సి రావచ్చు. మనిషికి ప్రపంచం విస్తృత మవుతున్న కొద్దీ భిన్న భాషల్ని నేర్చుకోడం జీవితావసరంగా మారుతుంది. ఇందులో తప్పేమీ లేదు. విద్యా విధానం దీన్ని కూడా పరిగణనలోకి తీసుకోవాల్సి వుంటుంది.

అయితే ఎపుడు నేర్చుకోవాలి? ఎవరు ఎంతవరకు నేర్చుకోవాలి? ఎలా నేర్చుకోవాలి? మాతృభాషకూ, ఈ భాషకూ మధ్య వైరుధ్యం వుండాలా? అనేవి ప్రశ్నలు.

దీనికి ముందు మనం మొదట ఒకటి ఒప్పుకోవాలి. బిడ్డ 'సహజ సంపాదన' ఎన్ని భాషలు నేర్చుకొనేలా వుంటుందన్నది. 'చామ్‌స్కీ' దీన్ని సైతం వివరించాడు. మాతృభాషకున్న వాతావరణం బిడ్డ చుట్టూ వుంటే ఏ బిడ్డయినా రెండు మూడు భాషలను అవలీలగా నేర్చుకోగలడు. మన ముస్లిం సోదరులందరూ తెలుగు, ఉర్దూ రెండూ మాట్లాడుతున్నారు. (వీళ్ళ ఉర్దూ, తెలుగు రెండూ ప్రామాణికమైనవి గావని ఎత్తిపొడిస్తే ఏమీ చేయలేము). చాలామంది మన పిల్లలు తెలుగు, ఇంగ్లీషు, హిందీ మూడు భాషలూ అనర్గళంగా మాట్లాడతారు. అర్థం చేసుకొంటారు. ఇవన్నీ పట్టుబట్టి మనం వ్యాకరణ సూత్రాలు వల్లెవేయిస్తే జరగలేదు. ఒక వాతావరణంలో తన పరిసరాలతో బిడ్డ చేస్తున్న సంభాషణ వల్ల, సంవాదం వల్ల సాధ్యమైంది. ఏ ఒక్క భాషా మరీ ముఖ్యంగా మాతృభాష రెండో భాష నేర్చుకొనేందుకు అడ్డంకి కాలేదు. అయితే వీటిలో ఏదో ఒక భాషపై ఆ బిడ్డకు ఎక్కువ పట్టు వుంటుంది. అది ఆ బిడ్డకు ఏది ఎక్కువ అవసరమో, దేన్ని ఎక్కువగా ఉపయోగిస్తుందో దాన్ని బట్టి వుంటుంది.

ఇలా చూచినపుడు ఇంగ్లీషు నేర్పడం కోసం తెలుగుపై నిషేధాలు విధించాల్సిన అవసరమేమిటి? మాతృభాషా నిషిద్ధ ప్రాంతాలు (Vernacular Free Zones)గా పాఠశాల్ని ప్రకటించాల్సిన అవసరం ఏమిటి? ఈ దారిద్ర్యం ఎందుకు వచ్చిందంటే భాష ఎలా నేర్పాలో చేతగాక. బిడ్డ సహజంగా పలు భాషలు ఎలా నేర్చుకొంటోందని చూచైనా మన విద్యా సంస్థలూ, విద్యారంగ ధురీణులు ఏమీ నేర్చుకోనందు చేత. నర్సరీ నుంచి ఇంగ్లీషు మీడియంలో చదివినా, ఇంజనీరింగు పట్టభద్రుల్లో 3 శాతం మించి ఆంగ్లంలో ధారాళంగా మాట్లాడలేక పోవడం దేనివల్ల? పిల్లలు ఇంగ్లీషు నేర్చుకోలేక పోవడం వల్ల గాదు, వాళ్ళు తెలుగు మాతృభాషగా పుట్టిన వాళ్ళయినందు వల్ల కాదు, వాళ్ళకు ఇంగ్లీషు ఎలా నేర్పాలో మన కార్పొరేట్ విద్యాసంస్థలకు తెలియనందువల్ల.

వాస్తవానికి మాతృభాషలో ప్రావీణ్యం వుంటే, వాక్య నిర్మాణ కౌశలం పట్టుపడితే, స్వీయ పఠనం స్వేచ్ఛగా సాగితే ఆంగ్లం నేర్చుకొనేందుకిది ఎంతో దోహద పడుతుంది. స్థూలంగా భాషలన్నింటికీ ఓ విశ్వ వ్యాకరణం వుంటుందంటాడు చామ్‌స్కీ. వాక్య నిర్మాణం గణిత సమీకరణ కన్నా తక్కువ

క్లిష్టమైనవేమీ కాదంటాడాయన. ఒక భాష మీద పట్టు లభిస్తే అది రెండో భాషనూ నేర్చుకొనేందుకు బిడ్డకు కావల్సినంత పునాది నందిస్తుంది.

ఇంతమాత్రం కూడా తెలియకనో, తెలిసినా ఇంగ్లీషు నేర్పడం తమకు తప్ప, తమ పద్ధతిలో తప్ప సాధ్యంగాదనే ఒక కృత్రిమ మార్మికతను వ్యాపారం కోసం అల్లినందు వల్లనో మన కార్పొరేట్ విద్యా సంస్థలు పిల్లల్ని రెంటికీ చెడిన రేవళ్ళుగా మారుస్తున్నాయి. ఈ పిల్లలకు ఏ భాషా రాదు. ఎందులోనూ ప్రేమా, ఆసక్తి వుండవు. దేని ద్వారానూ సమర్ధవంతంగా వీరు ప్రపంచంతో సంభాషించరు. స్వంతంగా చదువుకోరు. వల్లెవేత చదువుతో, మార్కుల మాయాజాలంతో, హంగు, ఆర్భాట చమత్కారాలతో ఈ వ్యాపార సంస్థలు ప్రజల్ని దోపిడీ చేస్తున్నాయి. తల్లిదండ్రులకీ మాత్రం చెప్పేవాళ్ళు లేరు. వాళ్ళకి వినే ఓపికా లేదు. ప్రభుత్వానికిదంతా తెలుసు. కాని పాలకులు ఈ విద్యా బేహారులకు దాసానుదాసులు! ఇప్పుడీ బేహారులే మన పాలకులు కూడా!

అందువల్ల మాతృభాషను ప్రాథమిక దశలో తప్పనిసరి చేయాలి. తెలుగు మాధ్యమమే వుండాలి. బిడ్డ సామర్థ్యాన్ని బట్టి అది 5వ తరగతి వరకు కావచ్చు, 8వ తరగతి వరకు కావచ్చు, రెండో భాష మాట్లాడ్డం మాత్రం ఏ స్థాయిలోనైనా ప్రారంభించవచ్చు. కాని ఆ వాతావరణాన్ని తరగతి గదిలో సృష్టించడం ముఖ్యం. అసలీ ఇంగ్లీషు పిచ్చి ఇంగ్లీషును సమర్థవంతంగా నేర్పడం చేతగానందు వల్లనే వచ్చిందనీ, భారతదేశంలో మొదటి భాషగా ఇంగ్లీషు నేర్పడంపై జరిగినంత పరిశోధన, రెండవ భాషగా నేర్పడం ఎలా అనేదానిపై జరగలేదని ఎన్.సి.ఎఫ్. – 2005 విశ్లేషించింది. ఇంగ్లీషును ఒక భాషగా శక్తివంతంగా నేర్పడం సాధ్యం కాకపోతే తల్లిదండ్రులు నర్సరీ నుంచి ఇంగ్లీషే నేర్చుకోవాలని భావించే ప్రమాదం వుందని కూడా అది హెచ్చరించింది. అక్షరాలా ఇప్పుడదే జరుగుతోంది.

ఏ భాషను ఎప్పటి నుంచి ఎంతవరకు ఎలా చెప్పాలో మనకు స్పష్టత లేకపోవడం వల్ల, సమర్ధత లేనందువల్ల జరిగిందేమిటి? మొరటుగా బలవంతంగా అందరికీ ఇంగ్లీషు మీడియం నెత్తికెత్తడమే మిగిలింది. ఈ పిల్లలు ఎవరు? వీరు పాఠశాల విద్య తర్వాత ఏమవుతారు? అనే దాంతో నిమిత్తం లేకుండా మనం ఇంగ్లీషు మీడియంలోకి అందర్నీ తోసేస్తున్నాం. నిజానికి వీరిలో 99 శాతం స్వదేశంలోనే వుంటారు. చిన్న చిన్న ఉద్యోగాలు చేస్తారు. చాలామంది అదీ చెయ్యరు. చేసే వుద్యోగాలకు ఆంగ్లభాషా ప్రావీణ్యం ఏమీ అవసరం వుండదు. ఇతర నైపుణ్యాల్ని కలిగి వుండాలి. ఇంత చిన్న విషయం తెలీకుండానే వీళ్ళనందర్నీ ఇంగ్లీషు మీడియంలోకి నెడుతున్నారనుకోలేము.

అన్నిటికంటే ముఖ్యమైన విషయం అసలు ఈ పిల్లలకి నిజంగా ఏమి వచ్చుననేది. దీన్ని పరిశీలించి సర్వేలు చేసి నిజాల్ని నిగ్గుతేల్చిన వాళ్ళు లేరు. చాలా చాలా విషయాల మీద – మరీ ప్రభుత్వ పాఠశాల తీరుతెన్నుల మీద ఒంటికాల్తో లేచేవాళ్ళూ, సర్వే మీద సర్వేలు చేసేవారు కోకొల్లలు. 'సర్వే జనాః సుఖినో భవన్తు' అని వూరికే అన్నారా మరి. కాని ఇంగ్లీషు మీడియం పిల్లలు ప్రభుత్వ ప్రైవేటు కార్పొరేటు స్కూళ్ళలో ఇంగ్లీషు నెంత నేర్చుకోగల్గుతున్నారు? ఇంగ్లీషు మాధ్యమం ద్వారా విషయ పరిజ్ఞానం ఎంత పొందగలుగుతున్నారు? స్వంతంగా ఎంత చదివి విమర్శనాత్మకంగా వుండగలుగుతున్నారు? వీరి సృజనాత్మకత ఎలా వుంది అనేవి లోతుగా పరిశోధించిన వారు లేరు. తెలుగు, ఇంగ్లీషు మీడియం పిల్లల మధ్య వున్న తేడాను పరిశీలించిన వారూ అరుదు. ఈ పని చేస్తే అప్పుడు బయట పడుతుంది మన పిల్లలెంత దగాపడ్డారో! అమెరికా పిల్లలు గణితంలో వెనకబడుతున్నారని దీనివల్ల ఆ దేశానికి 13 ట్రిలియన్ డాలర్లు నష్టం వచ్చిందని హార్వర్డు విశ్వ విద్యాలయం వారు ఓ లెక్క గట్టారు. మరి మన పిల్లలు తెలుగూ రాక, ఇంగ్లీషూ రాక, విషయ పునాది కనీసం లేక మరబొమ్మల్లా మారినందువల్ల మన మెంతమంది శాస్త్రవేత్తల్ని కోల్పోయాం? ఎందరు సామాజిక తత్వవేత్తల్ని, విమర్శకుల్ని, సాహితీకారుల్ని, ఉద్యమకారుల్ని, నిపుణుల్నీ, నూతనావిష్కర్తల్నీ కోల్పోయాం? దానివల్ల దేశానికెంత నష్టం వచ్చింది? పిల్లలెంత నష్టపోయారు? మరీ పేద పిల్లలు, దిగువ మధ్యతరగతి పిల్లలు ఎంత నష్టపోయారు? దీన్ని నిగ్గు తేల్చిన నాథుడెవ్వడూ లేడు. వాస్తవానికీ పని రాష్ట్ర ప్రభుత్వ విద్యా శాఖ, దాని ఎస్‌సిఇఆర్‌టి, డైట్‌లు చెయ్యాలి. వాటికా తీరిక వున్నట్టు ఎక్కడ దాఖలా లేదు.




**పేదలూ – ఇంగ్లీషు విద్య :**

ఈ మధ్యకాలంలో ఇంగ్లీషు మీడియంను ఒక సామాజికాంశంగా కొందరు పరిగణిస్తున్నారు. విద్యా రంగం వాస్తవానికి సమాజంలోని అసమానతల్ని తగ్గించాలి. ప్రపంచమంతా ఆ పాత్రనది పోషించింది కూడా. కానీ మన దేశంలో విద్యారంగం అసమానతల్ని స్థిరీకరిస్తుంది. పెంచుతుంది. ఘనీభవింపజేస్తుంది. ఈ నేపథ్యంలో ఇంగ్లీషు మీడియం బలహీన వర్గాలకు అందకపోవడాన్ని సామాజిక వివక్షగా భావించడంలో తప్పేమీ లేదు. అగ్రవర్ణాల వారూ, ధనికులూ, నోరున్నవారూ ఇంగ్లీషు మీడియంలో పిల్లల్ని చదివిస్తుంటే, నిమ్న వర్గాల పేదలు, గ్రామీణులు తమ పిల్లల్ని తెలుగు మీడియంలో ఎందుకు చదివించాలి? మాతృభాషోద్ధరణ పేదలే చెయ్యాలా? ఇంగ్లీషు ఒక కులీన వర్గ చిహ్నమైనపుడు, అది ఆ వర్గాలకు ఒక పెత్తనానికి సాధనంగా మారినపుడు, దాన్ని కింది

వర్గాలూ పొందాలనుకోడం, లాక్కోవాలనుకోడం అత్యంత సహజమైన సామాజిక ప్రతిచర్య.

దీన్ని సాధించుకోవాలన్నా జరగాల్సిందేమిటి? మొదట మాతృభాషతోనే విద్య ప్రారంభించాలి. బలంగా, శాస్త్రీయంగా ఇంగ్లీషు కూడా నేర్పాలి. ఏ 6వ తరగతిలోనో, 9వ తరగతిలోనో మార్పు (Transition) జాగ్రత్తగా జరగాలి. దానికి కొంచెం ముందునుంచే ఒక సన్నద్ధత వుండాలి. ఒక మేరకు దీన్ని నవోదయ పాఠశాలలు విజయవంతంగా పాటిస్తున్నాయి. మన పాఠశాలల్లో అలా ఏమీ జరగడం లేదు. బోధనా వ్యూహాలేమీ లేవు. బలవంతంగా ఇంగ్లీషు మీడియంలోకి పిల్లలు బిక్కుబిక్కుమంటూ వస్తున్నారు. మన విద్యా వ్యవస్థ మాతృభాషను శక్తివంతంగా నేర్పడమే అంతంతమాత్రం. ఇక ఇంగ్లీషు నేర్పడం అయ్యే పనేనా? చివరికి ఎలాగో పరీక్షల్లో గట్టెక్కిస్తున్నారు. వీరికి ఏ భాష మీదనైనా ఏ పట్టులభిస్తోందో, విషయ పరిజ్ఞానం ఎంత దక్కుతోందో, విమర్శనాత్మకత ఏమి పొంటబడుతుందో. ప్రపంచంలో నెగ్గుకు రాగల శక్తి ఎంత సమకూరిందో ఎవరి కెరుక? ఫలితంగా ఈ ఇంగ్లీషు మీడియం వల్ల నష్టపోతున్నది అందరికంటే ఎక్కువగా బలహీన వర్గాల పిల్లలే. ఎంతో గొప్పగా చెప్పుకొనే గురుకుల పాఠశాలల్లోని ఇంగ్లీషు మీడియం పిల్లల్ని పరిశీలిస్తే ఇది అర్థమవుతుంది. ఈ పాఠశాలల్లో తెలుగు మీడియం వున్నపుడు ఇంతకంటే ఎంతో మెరుగ్గా వున్నారని, ఎన్నో ఉన్నత శిఖరాలను ఇంతింత కసరత్తు లేకుండానే అధిరోహించారని ఘంటాపథంగా చెప్పవచ్చు.

ఏతావాతా తేలిందేమిటి? శక్తివంతంగా భాష నేర్పడం, ఆధునిక పద్ధతుల్లో భాష నేర్పడం ముఖ్యం.

**సర్వరోగ నివారిణి :**

మంత్రులూ, అధికార్లూ ప్రభుత్వ పాఠశాల తీరుపై విమర్శలు వచ్చినప్పుడల్లా, వాటి నుద్ధరించడానికి కంకణం కట్టుకొన్నామని చెప్పాల్సి వచ్చినప్పుడల్లా ఇంగ్లీషు మీడియం ప్రస్తావన తెస్తుంటారు. ఇంగ్లీషు మీడియం ప్రవేశ పెడితే సకల సమస్యలూ పరిష్కారమై పోతాయన్నట్టు, పేదపిల్లల్ని దీంతో ఉద్ధరించేస్తున్నట్టు, దీంతో ప్రభుత్వ పాఠశాలల్లోకి పిల్లలు పరుగెత్తుకొచ్చేసేటట్టు చెప్పడం ఈ మధ్య పెద్ద ఫ్యాషన్‌గా మారింది. షరా మామూలుగా మన మంత్రిగారు కూడా ఈ ఉద్ఘాటన చేశారు. మనలో కూడా చాలామంది దీన్ని నమ్ముతున్నారు.

వాస్తవానికి ప్రభుత్వ పాఠశాలల్లో లేనిదల్లా ఇంగ్లీషు మీడియం ఒక్కటేనా? రాష్ట్రంలోని 4976 ఉన్నత పాఠశాలల్లో ఇంగ్లీషు మీడియం వుంది గదా! అయినా వీటిల్లో నగానికి నగం స్కూళ్ళల్లో పిల్లలు చేరక బిక్కుబిక్కుమంటున్నాయి కదా! తెంగాణాలో వీటినుంచి ఇంగ్లీషు మీడియం రద్దు చేశారు గదా! వీటిలో పిల్లలెందుకు లేరు? మన గురుకులాలన్నిటిని ఇంగ్లీషు మీడియం స్కూళ్ళకింద మార్చారుగదా? వాటిలో నిరుపేదలు మాత్రమే ఎందుకు చేరుతున్నారు?

అసలు సమస్య ప్రభుత్వ పాఠశాలల్లోని వసతులకు, నిర్వహణా విధానానికి సంబంధించింది. ఏలినవారికి వీటిపై వున్న శ్రద్ధకూ, చిత్తశుద్ధికీ సంబంధించింది. ఇప్పటికే తెలుగు మీడియంలోనే నూటికి డెబ్భైమంది సక్సెస్ పాఠశాలల్లో చదువుతున్నారు. బడి అన్ని వసతులతో, ఆహ్లాదకరంగా వుండి, టీచరు మంచిగా చదువు చెపుతుంటే హైస్కూళ్ళలో ఇప్పటికే వందమందే గాదు వేలమంది చాలా పాఠశాలల్లో వున్నారు. ప్రాథమిక పాఠశాలల్లో వందల మంది వున్నారు. ఇంగ్లీషు వ్యామోహాన్ని తీర్చాలంటే ఇంగ్లీషు టీచరును కూడా ప్రతి ప్రాథమిక పాఠశాలలో నియమించండి, దేశంలో అత్యున్నత ప్రమాణాలుండి, ప్రభుత్వ పాఠశాలల్లో 80 నుండి 90 శాతం చదువుతున్న తమిళనాడు, కేరళ, గుజరాత్ లాంటి రాష్ట్రాల్లో ఏం జరుగుతోందో చూడండి. వీటన్నింటా మాతృభాషా మాధ్యమంలోనే బోధన జరుగుతోంది. కాని అక్కడ పాఠశాల వ్యవస్థ పటిష్టంగా వుంది. మన రాష్ట్రంలో ఇది దివాళా తీసి మూసివేతకు సిద్ధంగా వుంది. దీన్ని సరిచేసుకోకుండా ఇంగ్లీషు మీడియం ప్రారంభిస్తే ఏమవుతుంది? పిల్లలు, మరీ పేద పిల్లలు రెంటికీ చెడ్డ రేవళ్ళు అవుతారు. అలా కావాలనే కదా మేం చెప్తున్నదంతా అంటే అది వేరే సంగతి. ప్రస్తుతం మన రాష్ట్రం ధోరణి ఇలానే వుంది.

**మన భాషా భేషజం :**

తెలుగు భాషలో పిల్లలకు కనీస సామర్థ్యాలు లేకుండా చెయ్యడంలో మన పండితులు కూడా శక్తికి మించి దోహద పడుతున్నారు. వీరి దృష్టిలో భాష అంటే సాహిత్యం, సాహిత్యమంటే కవిత్వం, కవిత్వమంటే ప్రాచీన ఛందోబద్ధ కవిత్వం. భాష నేర్పడమంటే వ్యాకరణాన్ని బోధించడం. సజీవ భాష, పరిసరాల భాష, ఆధునిక అవసరాల్ని తీర్చే భాష, ప్రస్తుత లిఖిత సాహిత్యంలోని భాష. పిల్లలకు, ప్రస్తుత సమాజానికి అవసరమని మన పండితులు ఒప్పుకోరు. పిల్లలకు రాయడంకన్నా చదవడం ముఖ్యమని అంగీకరించరు. స్వేచ్ఛా ప్రపంచంతో సంభాషణా సంవాదాలు చేయగలిగినపుడే భాష జీవభాషగా పొంటపడుతుందని నమ్మరు. అసలు వ్యావహారిక భాష వీరి దృష్టిలో భాషే కాదు. (అట్లని గ్రాంధికం నాలుగు ముక్కలు రాయగలరా అంటే అదీ లేదు). మన పాఠ్య గ్రంథాల్లో జీవభాషకూ జీవితానికీ ఏమీ స్థానం వుండదు. అందువల్ల తెలుగు పండితుడొక ఛాందస చక్రవర్తి కింద, తెలుగు నేర్చుకోడం ఒక కృత్రిమ కసరత్తు కిందా మారింది.

ఎన్ని ఇంగ్లీషు మీడియాలు వున్నా మన పిల్లలు 10వ తరగతి దాకా తెలుగును ఒక భాషగా అన్ని యాజమాన్యాల పాఠశాలల్లోనూ చదువుతున్నారు. ఈ పది ఏళ్ళలో భాష పట్ల ఒక ప్రేమ, భాషలో కనీస పరిజ్ఞానమూ, పఠనాసక్తీ కలిగించలేమా? దీనికి వచ్చిన అవరోధా లేమిటి?

ఈ బలహీనత ఇంగ్లీషు నేర్పడంలోనూ వుంది. (కాకుంటే తెలుగుతో పోలిస్తే కొంచెం తక్కువ). ఇలా చూచినపుడు భాషా మాధ్యమానికన్నా భాష నేర్పడం లోని కృత్రిమత్వంలోనే అసలు సమస్య అంతా వున్నదనిపిస్తుంది.

**శాస్త్ర గ్రంథాలు ఎలా వస్తాయి?**

చాలామంది వాదన ఏమంటే – ఆధునిక శాస్త్ర గ్రంథాలన్నీ ఆంగ్లంలోనే వున్నాయి. సమాచార సాంకేతికమంతా ఆంగ్లంలో వుంది. మంచి వార్తాపత్రికలు కావాలన్నా ఆంగ్లంలోనే దొరుకుతున్నాయి, ఆధునిక ఆలోచనలన్నీ ఆంగ్లంలోనే సాగుతున్నాయి. మరి తెలుగు మీడియం విద్యార్థి ఎప్పటికయినా ఇంగ్లీషు మీడియం విద్యార్థితో సమానంగా వీటిని అందుకోగలడా అని. ఉద్యోగావకాశాలు, ఉపాధి ప్రపంచమంతా విస్తరిస్తున్నప్పుడు మాతృభాషను పట్టుకొని వేలాడితే బ్రతకడమెట్లా అని, అందువల్ల మార్కెట్‌ను బట్టి విద్య, భాష వుండక తప్పవని.

ఇంగ్లీషులో వున్న సాహిత్యాన్ని తెలుగులోకి తెచ్చుకోవడం ఏమీ బ్రహ్మ విద్య గాదు. మలయాళాన్ని చూస్తే ఇది మనకర్థ మవుతుంది. మనం భాషను కాపాడుకోదలిస్తే, మన భాష మన వికాసానికి దోహద పడుతుందని ఒప్పుకుంటే ఈ గ్రంథాలూ, సమాచారమూ తెలుగులోకి రావడం పెద్ద సమస్యేమీ కాదు. ఉన్నత విద్య సైతం తెలుగులో వుండి తీరాలని మనం పూనుకొంటే దానికి తగ్గ గ్రంథాలు తమంత తామే వస్తాయి. తెలుగు అకాడమీ లాంటివి ఈ పని చేస్తాయి. ఈ దృక్పథం వుంటే ప్రభుత్వాలు, అకడమిక్ సంస్థలు దీనికి పెద్ద ఎత్తున పూనుకొంటాయి. ఈ ఆధునిక యుగంలో అనువాదాలు చాలా సులభం. ముద్రణ మరీ సులభం. హైదరాబాద్ స్టేట్‌లో

వైద్యవిద్యతో సహా ఉర్దూలో నేర్పేవారు. అప్పటికే దానికవసరమైన పాఠ్యగ్రంథాలు రూపొందించారు. ఉర్దూను మాతృభాషగా గౌరవించి, ఆ మీడియం ప్రజల కవసరమని భావించడం వల్లనే అది సాధ్యమైంది. ఆమాత్రం తెలుగులో చెయ్యలేమా?

ఇప్పుడు సమాచార సాంకేతిక విప్లవాన్ని ఆంగ్లేతర భాషలు కూడా సమర్ధవంతంగా వాడుకొంటున్నాయి. చైనా త్వరలోనే ఇంటర్నెట్‌ను శాసిస్తుందంటున్నారు. జర్మనీ, జపాన్, ఫ్రాన్స్ లాంటి దేశాలే గాదు, కొరియా లాంటి దేశాలు కూడా ప్రపంచ విజ్ఞానాన్నంతటినీ తమ భాషల్లోకి అద్భుతంగా తెచ్చుకొంటున్నాయి. ఇంటర్నెట్‌ను తమ దారిలోకి మళ్ళించుకొంటున్నాయి. అసలు ఇంగ్లీషు పెత్తనం, దాని ఆర్థిక పెత్తనం ముగిసే కాలమూ దగ్గరకొచ్చింది.

**రెండు భాషలు భారం కాదు :**

మాతృభాష కోసం ఇంగ్లీషును వదులుకోమని ఎవ్వరూ చెప్పడం లేదు. ఒక భాషగా ఇంగ్లీషును ఎంత అద్భుతంగానైనా నేర్చుకోవచ్చు. మన మొదటి తరపు శాస్త్రవేత్తలూ, సామాజిక శాస్త్రవేత్తలూ, రచయితలూ అందరూ ఇలాంటి వారే. ఒక దశ దాటాక అవసరమనుకొన్నవాళ్ళు ఇంగ్లీషు మీడియంలోకి కూడా మారవచ్చు. వీరికైనా మాతృభాషలో పట్టువుంటేనే ఇంగ్లీషు మీద పట్టు లభిస్తుంది. ఇంగ్లీషు కోసం మాతృభాషను త్యాగం చెయ్యాల్సిన అవసరం ఏమీ లేదు.

రెండు భాషలకీ సమాన ప్రాధాన్యం ఇస్తూ అరబిక్‌ను అధికార భాషగా, ఫ్రెంచిని రెండో భాషగా బోధించే వినూత్న విధానం ట్యునిషియాలో వుంది. ప్రకృతి శాస్త్రాలను ఉన్నత పాఠశాల స్థాయిలో ఫ్రెంచి భాషలో నేర్పిస్తారక్కడ. సమాంతరంగా రెండు భాషల మధ్యమాల్లోనూ పాఠాలు చెప్పి, పరీక్షల్ని పిల్లలు కోరుకున్న భాషలో రాసే పద్ధతిని కూడా వీరు ప్రవేశ పెట్టారు. సుదీర్ఘ కాలం ఫ్రెంచి కాలనీగా వున్నందున జనాభాలో 64 శాతం ఫ్రెంచి భాష మాట్లాడుతున్నప్పటికీ, పత్రికల్లో వ్యాపార వాణిజ్యాల్లో ఫ్రెంచి మాత్రమే బహుళ చలామణిలో వున్నప్పటికీ, అరబిక్ భాషకు ట్యునిషియా ఇస్తున్న ప్రాధాన్యత, రెండింటినీ బోధిస్తున్న తీరూ చాలా దేశాలకు ఆదర్శం.

కావల్సింది సరైన బోధనా వ్యూహం, బోధనా విధానం. పాలకుల చిత్తశుద్ధి తప్ప రెండు భాషలేమీ పిల్లలకు భారాలు కావు.

**మైనారిటీ భాషలు :**

మాతృభాషలో విద్య అనే సూత్రాన్ని అంగీకరిస్తే అది మైనారిటీ భాషకు, గిరిజన భాషకు కూడా వర్తిస్తుంది. లిపి లేని ఆదిమ జాతుల భాషలకు కూడా ఇది వర్తిస్తుంది. వారి భాషల్లోనూ విద్యాబోధన జరగాలి. ఎంత దూరమైనా వారి భాషా మాధ్యమాలు వుండాలి. మైనారిటీ భాషల్ని అంతరింపజేసే హక్కు మనకేమీ లేదు. ఇలా చూచినపుడు మనం నడుపుతున్న ఉర్దూ స్కూళ్ళు ఎంత నాసిరకమైనవో తెలుస్తుంది. గిరిజన భాషల్లో అమ్మ, ఆవు అంటే ఏమిటో కూడా తెలీని ఉపాధ్యాయులతో విద్యాబోధన చేయించడం ఎంత దుర్మార్గమో తెలుస్తుంది. తమిళం, కన్నడం లాంటి పొరుగు భాషలు మాతృభాషలుగా గలవారికీ వారి భాషా మాధ్యమాల్లో ఎంతవరకైనా చదువుకొనే అవకాశం వుండాలి. ఈ బాధ్యతను మనం తీసుకోవాలి. గిరిజన భాష విషయంలో ప్రాథమిక దశలో మాతృభాషలతో ప్రారంభించి, తర్వాత తెలుగులోకి ఒక క్రమపద్ధతిలో మార్పించవచ్చు. పరాయి రాష్ట్రాల్లో వున్న తెలుగు వారికి కూడా ఈ అవకాశం వుండేలా ఏర్పాట్లు వుండాలి. కేంద్ర ప్రభుత్వమే దీనికి బాధ్యత వహించాలి. అలాంటి పాఠశాలలకి గ్రాంటు ఇవ్వాలి. కొన్ని కేంద్రీయ పాఠశాలల్ని ఆదర్శంగా నెలకొల్పాలి. విద్యారంగంలో భాషకు సంబంధించి ఇదొక ప్రజాస్వామిక పద్ధతి.

'మనం ఒకే భాషను జాతీయ భాషగా గుర్తిస్తే దేశం రెండు జాతులుగా చీలిపోతుంది. రెండు (సింహళ, తమిళ) భాషలనూ జాతీయ భాషలుగా గౌరవిస్తే ఒకే జాతి నిర్మాణ మవుతుంది' అంటాడు శ్రీలంక వామపక్ష నాయకుడు కాల్విన్ ఆర్ డిసిల్వా. భాషా విధాన రూపకర్తలు సదా గుర్తించాల్సిన, పాటించాల్సిన మాటలివి.

హిందీ మూడవ భాషగా కొనసాగుతుంది. కానీ ఈ త్రిభాషా సూత్రం ఉత్తర భారత రాష్ట్రాలకు కూడా వర్తించాలి గదా. వ్యవహార అవసరాలను హిందీ తీర్చగలిగితే చాలు. మీడియా, సినిమాలు'; ఇతర రాష్ట్రాల పిల్లలు, ముస్లింల పిల్లలు పట్టణాల పాఠశాలల్లో సహవిద్యార్థులుగా అపార్ట్‌మెంట్లలో సహవాసులుగా పెరుగుతున్న ధోరణి మనం గమనిస్తున్నాం. రాజస్తాన్, బీహార్ లాంటి రాష్ట్రాల నుంచి హిందీ భాషీయులు కార్మికులుగా మన ఇళ్ళలోకి సైతం వచ్చేస్తున్నారు. ఈ క్రమం పెరిగే కొద్దీ హిందీని వ్యవహార అవసరాలు తీర్చగల భాషగా నేర్చుకోడం పెద్ద కష్టమేమీ కాదు. అయితే ఇక్కడ కూడా హిందీని ఎలా నేర్పాలి అనే వ్యూహం, విధానం ముఖ్యం.

**ప్రోత్సాహకాలు :**

కర్ణాటక రాష్ట్ర ప్రభుత్వం కర్ణాటకేతర రాష్ట్రాల్లో కన్నడ మీడియంలో విద్య నేర్చుకొనే వారికి ఉద్యోగాల్లో రిజర్వేషన్ సౌకర్యం కల్పించింది. కన్నడాన్ని అన్ని ప్రాథమిక పాఠశాలల్లో తప్పనిసరి చేసింది. తమిళనాడు ప్రభుత్వం ఇంజనీరింగ్, మెడికల్ కళాశాలల్లో తమిళ మీడియం పిల్లలు పెరిగే విధంగా ఎంసెట్ రద్దుచేసి చర్యలు తీసికొంది. వాటిని చూసి మనం నేర్చుకోవాలి.

తెలుగు మీడియం పిల్లలు ట్రిపుల్ ఐటిలో మన రాష్ట్రంలోనూ సీట్లు పొందగలుగుతున్నారు. వీరెంతో రాణిస్తున్నారు కూడా. ఇలాంటివి విస్తృతం చెయ్యాల్సిన అవసరం వుంది. తెలుగు మీడియంలో చదివిన వారికి ఉద్యోగాల్లో ప్రాధాన్యత, రిజర్వేషన్ లేదా వెయిటేజి ఎందుకు యివ్వకూడదు? ఉన్నత విద్య తెలుగు మీడియంలో చదివే వారికి ప్రోత్సాహకాలు, స్కాలర్‌షిప్పులు ఎందుకు ఇవ్వకూడదు? పరిశోధనా పత్రాల్ని తెలుగులో రాసేవారికి ప్రత్యేకార్థిక సహాయం ఎందుకు చెయ్యకూడదు?

ఇవన్నీ ప్రభుత్వానికి తెలుగు పట్ల గల శ్రద్ధను వ్యక్తం చేస్తాయి. సమాజంలో మాతృభాషకిస్తున్న గౌరవాన్ని తెలియచేస్తాయి. సహజంగానే తల్లిదండ్రులకు, పిల్లలకు ప్రేరణ లభిస్తుంది.

**ఆర్థిక, రాజకీయాంశాలు :**

ఒకప్పుడు సంస్కృతం, తర్వాత ఉర్దూ, ఇప్పుడు ఇంగ్లీషు – తెలుగు మీద చెయ్యాల్సినంత పెత్తనం చేశాయి, చేస్తున్నాయి. ఒక భాషపై మరో భాష పెత్తనం చెయ్యడం ఒక జాతిపై మరో జాతి చేసే పెత్తనంలో భాగంగా మాత్రమే జరుగుతుంది. సాంస్కృతిక అధికారం లేకుండా సాధారణ అధికారాన్ని చెలాయించ లేరు. దీన్ని ఇంగ్లీషులో 'సాఫ్ట్ పవర్' అంటారు. ఆయుధాలకన్నా, వ్యాపార వ్యూహాలకన్నా ఇది శక్తివంతమైంది, ప్రమాదకరమైంది.

ఇప్పుడు జరుగుతున్నదిదే. మన ఆర్థిక వ్యవస్థను ప్రపంచ మార్కెట్‌లో భాగమవుతున్నామని చెప్పుకొంటూ పరాధీనం చేశాము. ఎగుమతి ఆధారిత ఉత్పత్తి వ్యవస్థను నెత్తికెత్తుకొన్నాము. మన యువకుల్ని నిపుణుల్నిగా మార్చి ఎగుమతి చెయ్యాలనుకొంటున్నాము. ప్రపంచంలోనే ఎక్కువగా యువకులున్న దేశం మనదనీ, మనం ప్రపంచాన్ని జయించబోతున్నామనీ బడాయికి పోతున్నాము. చాలా దేశాల్లో మన కూలీలు ఆ దేశాల జనాభాతో పోటీ పడుతున్నట్లున్నారు. దాంతో ఆ దేశాలన్నిటిని మనం

జయించినట్టవుతుందేమిటి? మన సాఫ్ట్‌వేర్ ఉద్యోగుల కథ ఇంతే. మన కాళ్ళ మీద మనం నిలబడ్డం, మన వనరుల్ని మనం సమర్థవంతంగా వాడుకను పెంచుకోడం, మన శాస్త్ర సాంకేతిక రంగాల్ని ధీటుగా ఆధునీకరించుకోడం, నూతన ఆవిష్కరణల్లో పోటీపడ్డం, ప్రజందరికీ కనీస అవసరాల్ని తీర్చడం, అన్నిటికీ మించి ప్రతి బిడ్డకూ ఉన్నత ప్రమాణాల విద్య నందించి, సృజనశీలిగా, క్రియాశీలిగా తిర్చిదిద్దడం జాతిని శక్తివంతంగా తీర్చిదిద్దుతాయి గానీ ముడిసరుకుల్ని, వృత్తి నిపుణుల్ని ఎగుమతి చేస్తే ఒరిగేది ఏమీ వుండదు. చివరిగా ముడి సరుకుల్ని, మానవ వనరుల్ని అందించి ఎక్కడెక్కడి పెట్టుబడిదారుల్నీ పిలిచి పీటవేసి 'మేక్ ఇన్ ఇండియా' (Make in India) అంటూ బాకాలూదినా ఒరిగేదేమీ వుండదు. మనం గొప్ప ఆదర్శంగా చెప్పుకొంటున్న చైనా ఇలా ఏమీ చెయ్యలేదు. మొదట తన కాళ్ళ మీద తాను గట్టిగా నిలబడి ఆ తర్వాతనే అది ప్రపంచానికి తలుపులు తెరిచింది.

మాతృభాష నిరాదరణకు గురికావడానికి ఈ ఆర్థిక ఉత్పత్తి విధానాలు పెద్ద ఆటంకాలు. వీటిని అంతర్జాతీయ వ్యాపారులు, సంస్థలు, ఒప్పందాలు పెంచి పోషిస్తున్నాయి. అదొక పెద్ద కాల బిలం. అందులోకి మనల్ని బలవంతాన దించేస్తున్నాయి. మన పాలకులు దీనికి వత్తాసు పలుకుతున్నారు.

ఈ క్రమంలోనే ఇంగ్లీషు మనమీద పెత్తనం చేస్తోంది. దాని ఆకర్షణ మనల్ని బలవంతంగా తన పరిష్వంగంలోకి లాక్కుంటోంది. ఇది పరాధీనుల్ని చెయ్యడమే. ఈ పరాధీనతను భాష ద్వారా ఎంత పెంచి పోషించవచ్చో పాశ్చాత్యులకు తెలిసినంతగా ఎవ్వరికీ తెలియదు. అందువల్ల మాతృభాష కోసం మనం చేసే పోరాటం ఈ ఆర్థిక సాంస్కృతిక సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా చేసే పోరాటంలో అవిభాజ్య భాగం.

**విద్యా వ్యాపారం :**

మన భాషనిలా బలిచెయ్యడంలో విద్యా వ్యాపారులదీ తక్కువ పాత్ర కాదు. దురదృష్టవశాత్తు అందరికీ సమానమైన నాణ్యమైన సార్థకమైన విద్యను ప్రభుత్వమే అందించడంలో భారతదేశానిది ప్రపంచ దేశాలన్నిటికీ మినహాయింపు. అన్ని దేశాలదీ ఒక దారి – మనది మరో దారి. మనకు విశ్వసనీయమైన విద్యా విధానం అంటూ దీనివల్లనే లేకపోయింది.

క్రమంగా ఈ శూన్యాన్ని ప్రైవేటు, కార్పొరేట్ శక్తులు జబర్దస్తీగా ఆక్రమించుకొన్నాయి. నూతన ఆర్థిక విధానాల్ని, ప్రపంచ మార్కెట్ శక్తుల మాయాజాలాన్ని తమ కనుగుణంగా మలచుకొన్నాయి. అంతర్జాతీయ అవకాశాల్ని అందుకోగల యువకుల్ని తామే తీర్చిదిద్దగలమని, దానికి ఇంగ్లీషు తప్ప గత్యంతరం లేదని ప్రజల్ని ఒప్పించగలిగాయి. తమ వ్యాపార సామ్రాజ్యాల్ని ఊహాతీతంగా పెంచుకొన్నాయి.

ఇటీవల ఎఫ్.ఐ.సి.సి.ఐ., సి.ఐ.ఐ. (FICCI, CII) లాంటి సంస్థలు విద్యారంగాన్ని తమకు అప్పచెప్పమని ప్రభుత్వాన్ని డిమాండు చేసిన తీరు, భారత దేశంలో విద్య ఎన్ని బిలియన్ డాలర్ల వ్యాపారావకాశాలున్న రంగమో విశ్లేషించిన తీరు మనల్ని ఆశ్చర్యచకితుల్ని చేస్తుంది.

వీళ్ళ వ్యాపారం చదువు చుట్టూ, భాష చుట్టూ, వాటి బోధన చుట్టూ, ఒక కృత్రిమ సంస్కృతిని, మార్మికతనూ దట్టంగా అల్లకుండా సాగదు. వీళ్ళకి పిల్లలేమవుతారని గాని, దేశం ఏమవుతుందని గానీ పట్టదు. కొద్దిమందిని అందలాలెక్కించి, వాళ్ళని నమూనాలుగా చూపించి, ప్రజల్ని మభ్య పెట్టడం వాళ్ళ వ్యాపార రహస్యం. ఇప్పుడీ వ్యాపార సామ్రాజ్యం తెలుగునాట గ్రామాల దాకా విస్తరించి అల్లిబిల్లిగా అల్లుకుపోయింది. రాజకీయాల్ని శాసించే స్థితికి చేరుకొంది.

విద్యారంగంలో కార్పొరేట్ శక్తులు రాజ్యమేలుతున్నంత కాలం 'శాస్త్రీయ విద్య' అసంభవం. ఈ శక్తుల నుంచి ప్రజల్ని ఎలా చైతన్యపరచి రక్షించుకొనేలా చెయ్యాలా అనేది మన ముందున్న సవాలూ, కర్తవ్యమూ. ఇప్పుడిప్పుడే మన మధ్య తరగతిలో లీలామాత్రంగానైనా ఈ ధోరణి వ్యక్తమవుతోంది. ఇది శుభసూచకం.

మాతృభాషకై తపించే మనం విద్యారంగంలో కార్పొరేట్ శక్తుల్ని వ్యతిరేకిస్తూ, శాస్త్రీయ విద్య కోసం పోరాడే శక్తులతోనూ కలిసి పనిచేయాల్సి వుంటుంది. వాటిని బలోపేతం చెయ్యాల్సి వుంటుంది.

**మన డిమాండ్లు :**

1. ప్రాథమిక విద్య వరకు తప్పనిసరిగా మాతృభాషా మాధ్యమంలోనే విద్యాబోధన జరగాలి. పిల్లల సామర్థ్యాల్ని అవసరాల్ని బట్టి అది 5వ తరగతి వరకు గావచ్చు, 8వ తరగతి వరకు గావచ్చు.
2. మాతృభాషా మాధ్యమం పి.జి. స్థాయి వరకు వుండాలి. శక్తివంతంగా ఇది సాగాలి.
3. తెలుగు మీడియం వారికి సమర్థవంతంగా ఇంగ్లీషు, ఇంగ్లీషు మీడియం వారికి శక్తివంతంగా మాతృభాష విధిగా నేర్పాలి.
4. భాషా బోధనలో శాస్త్రీయమైన తీవ్రమైన మార్పు రావాలి. వ్యావహారిక భాషకు, ఆధునిక సాహిత్యానికి అందులో ప్రాధాన్యత వుండాలి. ఉపాధ్యాయులకు దీనిపై శిక్షణ ఇవ్వాలి. సామగ్రి నందించాలి.
5. తెలుగు విశ్వ విద్యాలయంతో సహా అన్ని విశ్వ విద్యాలయాలూ, తెలుగు అకాడమీ పెద్ద ఎత్తున శాస్త్రీయ గ్రంథాల్ని తెలుగులోకి అనువదించాలి. దీనికి ప్రభుత్వం చేయూత నివ్వాలి.
6. కంప్యూటర్, సాఫ్ట్‌వేర్, హార్డ్‌వేర్‌లూ తెలుగు భాషకనుగుణంగా రూపొందించుకోవాలి. దీనిపై పరిశోధన, కృషి జరగాలి. దీనికి ప్రభుత్వం సహకారం అందించాలి.
7. తెలుగు మీడియంలో చదువుకొన్న వారికి ప్రోత్సాహకాలు, కొన్ని కోర్సుల్లో ప్రాధాన్యతలు, ఉద్యోగాల్లో అవకాశాలు కల్పించాలి.
8. రాష్ట్రంలోని మైనారిటీ భాషకు, గిరిజన భాషకు ప్రాథమిక స్థాయిలో తప్పని సరిగా ప్రాధాన్యత వుండాలి. ఆయా భాషల మాధ్యమంలో విద్య కొనసాగాలి. వారు తెలుగు మీడియంలోకి (ముఖ్యంగా గిరిజనులు) మారే అవకాశం ప్రాథమిక స్థాయి తర్వాత కల్పించాలి. దీనికి అనుగుణమైన అభ్యసన విధానం వుండాలి.
9. ఇంగ్లీషు మీడియం విద్యార్థులకు డిగ్రీ స్థాయి వరకు మాతృభాషను తప్పనిసరి చెయ్యాలి.
10. పాఠశాల విద్యతో పాటు ఉన్నత విద్య సైతం పిల్లలందరికీ సమానంగా, నాణ్యంగా అందించే బాధ్యతను ప్రభుత్వం తీసుకోవాలి. దీన్నొక హక్కుగా ప్రభుత్వం అమలు చెయ్యాలి.
11. కార్పొరేట్ విద్యను నిరుత్సాహపరచాలి. నియంత్రించాలి. వీటి సిలబసు, పాఠ్యగ్రంథాలు, బోధనా విధానాలు, మూల్యాంకనాలు, బాలల హక్కు, ఫీజు, ప్రభుత్వ విధానాలకు లోబడి వుండాలి. వీటిపై తల్లిదండ్రుల నియంత్రణ వుండాలి.


**రచయిత శాసన మండలి సభ్యులు,**
**ఉపాధ్యాయ నాయకులు,**
**ఫోను: 9490098912**

– డా॥ పి. శివరామకృష్ణ ('శక్తి')

# భాష - వారసత్వం

(గుంటూరులో 28-8-2015న జరిగిన తెలుగుభాష రక్షణ-అభివృద్ధి సదస్సులో సమర్పించిన పత్రం)

**'పరువు దూలిన నీ యనాదరణ కతన**
**మేటి నీ భాష పొలిమేర దాటలేదు**
**పరుల విజ్ఞానమునకు సంబరము పడక**
**కడగి యెత్తుము నీ వీర కాహళంబు' –**

*(ఆంధ్రప్రశస్తి : గుర్రం జాషువా)*

**1990** తరువాత ప్రారంభమైన స్వేచ్ఛావాణిజ్య విధానాలవల్ల, విజ్ఞాన రంగంలో అసంఘటిత రంగం, అంటే అప్పటివరకు పుస్తకాలకెక్కని, గుర్తింపుకు నోచుకోని, సామాన్యజనం మేధోజనిత సంపత్తి హక్కుల గుర్తింపు ప్రారంభమైంది. మానవ, భాషా, శాస్త్రవేత్తలతో డబ్ల్యూ.ఐ.పి.ఒ. (వరల్డ్ ఇంటెలెక్చువల్ ప్రాపర్టీ రైట్స్ ఆర్గనైజేషన్) సంస్థ ప్రపంచ వాణిజ్యసంస్థలో భాగంగా 1975లో ఆవిర్భవించింది. ప్రఖ్యాత మానవశాస్త్రవేత్త లెవిస్ట్రాస్ మొదలైనవారు ఇందులో సభ్యులు. భాష వారసత్వానికిగల సంబంధానికి ఐ.రా.స. ఇచ్చిన వివరణలకు 'ట్రిప్స్' (ట్రేడ్ రిలేటెడ్ ఇంటలెక్చువల్ ప్రాపర్టీ రైట్స్) ఒప్పందం, ఈ హక్కులను గుర్తించే విధానాన్ని రూపొందించింది. 2002లో మనప్రభుత్వం జీవవైవిధ్యచట్టం తెచ్చింది. కొండపల్లి బొమ్మలకు, కలంకారి నేతలు వగైరాలకు ఈ చట్టంద్వారా గుర్తింపువచ్చింది.

అంతటితో ఆగక, ఈ సామాన్యజనం ఉమ్మడిగా వాడుకునే అడవులు, బీళ్ళు, సముద్రతీరంలో, వ్యక్తిగత, ఉమ్మడి వనరుల గుర్తింపుకూడా ప్రారంభమైంది. తీరప్రాంత మత్స్యకారులకు సముద్రంలో ఐదు కి.మీ. వరకు హక్కులు కల్పిస్తూ 2009లో బిల్లు ప్రవేశ పెట్టింది. భారతప్రభుత్వం అటవీ హక్కుల గుర్తింపు చట్టం అవతారికలో ఇంతవరకూ ఈ హక్కులను గుర్తించకపోవడం 'చారిత్రక అన్యాయం'గా పేర్కొన్నది. బుద్ధిజీవుల, ప్రజల అజ్ఞానంవల్ల ఈ చట్టం అమలు అరకొరగా సాగుతుంది. ఉమ్మడిరాష్ట్ర ప్రభుత్వం, మన గిరిజనుల వాడుకలోగల మగనాలి మెట్టలు, చేవడిబసలు, చీపురుపొలాలు మొదలైనవాటికి హక్కులను ఇస్తున్నట్లు అటవీహక్కుల గుర్తింపు పట్టాదారు పాసుపుస్తకాలమీద ముద్రించి చాటుకున్నది. ఇంకా అటువంటి మనకు తెలియని ఎన్నో పదాలను సేకరించి, వాటన్నిటికి గుర్తింపులివ్వవలసిందిగా ఉత్తర్వులిచ్చింది. ఇటువంటి గుర్తింపులు పూర్తికాకుండా, ఒరిస్సాలోని నీయంగిరి కొండలో బాక్సైట్ తవ్వకాలకు వేదాంత కంపెనీకి ఇచ్చిన అనుమతిని సుప్రీంకోర్టు నిలిపివేసింది.

ఈ చట్టంప్రకారం చెంచుల విజ్ఞానం ఆధారంగా, వారి పెంటల సంప్రదాయ సరిహద్దు పటాల తయారి జరుగుతున్నదని భారతప్రభుత్వానికి ఇచ్చిన నివేదికలో, ఒక విశ్రాంత ఉన్నతాధికారి యన్.సి.సక్సేనా పేర్కొన్నాడు. ఈ చెంచులురాసుకున్న సంప్రదాయ విజ్ఞానాన్ని 'చెంచులబతుకు కథలు'గా 'నడుస్తున్న చరిత్ర' ధారావాహికంగా ప్రచురించింది. అటువంటిదే 'గోదావరిలోయలో – కొండరెడ్ల బతుకు కథలు', ప్రళయకావేరిలో, సముద్రతీరంలో స్థల విశేషాలు 'అమ్మనుడి'లో వస్తున్నాయి. ఇవి కథలుకావు, ఆ జాతుల తెగల ఆత్మకథలు. వారి జీవధాతు నిఘంటువులు.

వాడుకభాష, ప్రాచీనభాష, అధికారభాష, సాహిత్యం, చారిత్రక వారసత్వం – అందరికీ అలవాటైన ఈ ఒరవడికి భిన్నంగా జరుగుతున్న ఈ కృషి, అందరి దృష్టికి రాకపోయినప్పటికీ, మొదట్లో చెప్పినట్లు ప్రపంచవ్యాప్తంగా ఈ వనరులమీద ఆధారపడిన బడుగుజీవుల సాధికారతకు, అవకాశం లభించినంతమేరకు కృషిజరుగుతుంది.

ప్రపంచంలో పోకడలు గమనించడం, ప్రభుత్వంచేత అమలుచేయించడందాకా పోలేకపోయినప్పటికీ, మన తెలుగుపెద్దలు వృత్తిపదకోశాలు, మాండలికపదకోశాలు, వ్యుత్పత్తికోశాలు, సామెతలు, జానపద వైద్యవిధానాలు – వీటిని 60నుండి తయారు చేయడం మొదలు పెట్టారు. వాటిని నేటి శాస్త్రబోధనకు సంప్రదింపు గ్రంథాలుగా వాడుకోవలసిందిగా, మనం ప్రజాభిప్రాయాన్ని కూడగట్టాలి. తమ సంప్రదాయ జ్ఞానానికి, పరిభాషను రూపొందించడంలో చిన్నచిన్న దేశాలు ఎప్పటినుండో పనిచేస్తున్నాయి. జెల్టల్ (మెక్సికో) ప్లాంట్, జూలాజికల్ క్లాసిఫికేషన్ వంటివి 1970లోనే తయారైనాయి. క్రైస్తవ ప్రచారకుడు ఇవాన్ ఇల్లిచ్ వంటివారు ఆధునికవిద్యలో లోపాలను తూర్పారపట్టారు. భాషాశాస్త్రవేత్త ఛామ్స్కీ సంప్రదాయ విద్యావ్యాప్తిని లాటిన్ అమెరికాదేశాలలో ప్రోత్సహిస్తున్నారు.

చామ్స్కీ హైదరాబాదు వచ్చినపుడు అమెరికన్ సామ్రాజ్యవాదాన్ని దుయ్యబడుతుంటే అందరూ చప్పట్లు కొట్టారు. కానీ ఆయన దానికి విరుగుడుగా ప్రచారం చేస్తున్న సంప్రదాయవిద్యలను ఎవరూ పట్టించుకోలేదు. హైదరాబాదు కేంద్రంగాగల ఓరియంట్ బ్లాక్స్వాన్ 2010లో ఆయన వీడియో ప్రసంగాలను ('ఇండీజెనెస్ రెసిస్టెన్స్')ను ప్రచురించింది. ఇలా ప్రపంచమంతా వారసత్వాన్ని బలోపేతం చేయడానికి సాగరమథనం చేస్తుంటే 1997లో కుమ్మరి పదకోశం ముందుమాటలో భద్రిరాజు కృష్ణమూర్తి ఈ వృత్తులు అంతరించకముందే మిగిలిన పదకోశాలు ప్రచురిస్తే బాగుండును' అంటూ 'ఆఖరిచూపు' అయినా దక్కితే అదే పదివేలు అనుకున్నారు.

నేను ముప్పైఏళ్ళక్రితం 1933లో కన్నెమరా లైబ్రరీలోని "వాట్స్ డిక్షనరీ ఆఫ్ కమర్షియల్ ప్రోడక్ట్ ఆఫ్ ఇండియా" అనే నిఘంటువును చూసినప్పుడు దానిలో పదపదార్థ విచారం చదివి నివ్వెరపోయాను. ఎంత గొప్ప పరిశ్రమ అది! అలాంటిది తెనుగులో ఉంటే ఎంత బాగుండును? అని అనిపించింది. (1963).

"తెలుగు పునరుజ్జీవనానికి ఎన్నో సంస్థలు నేడు పుట్టాయి. అవి కొందరు భాషాతత్వ వేత్తలను నియమించి వ్యుత్పత్తి పదకోశాన్ని కేవలం భాషాశాస్త్ర దృష్టితో కాక, సాంఘిక, మానవజాతి, రాజనీతిశాస్త్రాల దృష్టితో నిర్మించాలి". (1995) 'నుడి-నానుడి' ముందుమాటలో తిరుమల రామచంద్ర సంకల్పం నేటికీ రూపుదాల్చలేదు.

భాషాసాహిత్యాలమీద పట్టులేని ఆధునిక శాస్త్రవేత్తలు ఎత్నోబాటనీ– ఎత్నోబయాలజీ మొదలైన ఉపరితల పరిశోధనలతో సరిపెడుతున్నారు. ఇవి

శ్రమజీవుల సాధికారితకు తోడ్పడవు. పరిశ్రమల కవసరమైన, ఉపాధికల్పనకు తోడ్పడే కోర్సులను ప్రవేశపెట్టాలి అని సలహాలిస్తుంటాము. అలాగే, సంప్రదాయంగా వస్తున్న బతుకుతెరువులను గుర్తించి, మార్పుకు తోడ్పడే పరిశోధనలు, పాఠ్యాంశాలను ప్రభుత్వం తప్పనిసరిగా ప్రవేశపెట్టే వాతావరణాన్ని అందరూ ఏర్పరచాలి.

భూమి, అడవి, నీరు వలెనే భాష ఒక ఉత్పత్తి సాధనం. ఆధునిక శాస్త్రాలు చదువుకున్నవాళ్ళు, మాతృభాషలో మనుగడసాగించే జాతులతో ఉత్పత్తి, సంపదల పెంపుకు కృషిచేయాలి కదా! సకశేరుకాలు, అకశేరుకాలు వంటి అనువాదపు తెలుగులో, లేదా ఆంగ్లంలోనో చదువుకున్నవాళ్ళకు, ఈ జాతుల పదాలు నుడికారం, సృజనాత్మక వారసత్వం తెలియకపోతే ఉత్పత్తి కుంటుపడుతుంది. మన పేటెంట్ రాబడి పడిపోతుంది. ఈ అవగాహన లోపంవల్లనే ఇన్నోవేషన్ రంగంలో వెనుకబడివున్నామని పరిశోధనా సంస్థలు మనను వెక్కిరిస్తున్నాయి.

ఈ సహజవనరులమీద ఆధారపడిజాతుల జ్ఞానసంపద – రక్షణలో విఫలమవుతున్న అధికార, మేధావిగణం, వారిని ఆ వనరులనుండి దూరం చేయడానికి దౌర్జన్యానికి దిగుతోంది. వీళ్ళతో పడలేం, కంపనీలకు అప్పచెప్పండి అని సలహాలిస్తోంది. కొందరు ఈ జ్ఞానాన్ని తస్కరించి తమపేర పేటెంటు చేసుకుంటున్నారు.

గాంగ్రీన్ ముదిరి, కాలు తొలగించవలసిన పరిస్థితికి చేరిన ప్రవాస భారతీయుణ్ణి నిజామాబాద్ జిల్లా కమ్మరపల్లి గ్రామంలో నాటువైద్యం ప్రయత్నం చేయవలసిందిగా ఎవరో సలహాఇచ్చారు. ఆ మందుతో అతని కాలు నయమైంది. ఆ మందును తన పేర పేటెంట్ చేసుకొని బదులుగా ఒక కోటి రూపాయల చెక్కును ఆ వైద్యుడికి పంపారు. తీరా ఆ చెక్కు బౌన్స్ అయింది.

ఇక్రిసాట్, మెట్టపంటలసాగును ప్రోత్సహించే అంతర్జాతీయ సంస్థ. గిరిజన ప్రాంతాలలో పండే పెద్ద కందులను వారికి పారితోషికం చెల్లించకుండా ఈ సంస్థ సొంతం చేసుకుంటున్నది. రాష్ట్ర జీవవైవిధ్యబోర్డు కార్యదర్శిగా పనిచేసిన అధికారి డా. భాస్కర రమణమూర్తి ఇటువంటి దోపిడీలనుగూర్చి నెత్తీనోరు బాదుకుంటున్నారు.

చదువుకున్న సగటుభారతీయుడు ఇలా మూర్ఖంగా మారుతుంటే, మిగతాప్రపంచం మరోదారినపోతూ, సమన్వయం సాధించుకొని సంపద పెంచుకుంటోంది.

కోస్టారికా ద్వీపంలోగల జీవవైవిధ్యం నమోదుచేయడానికి 'మెర్క్'అనే మందులకంపెనీ పెట్టుబడి పెట్టింది. తగినంతమంది శాస్త్రజ్ఞులు దొరకక, అక్కడ అక్షరాస్యులైన సాధారణ యువకులకు శిక్షణ ఇచ్చి ఈ పనిపూర్తిచేశారు. జింబాబ్వేలో ఏనుగుల అభయారణ్యం యాజమాన్యాన్ని అక్కడి ప్రభుత్వం తెగలకే అప్పజెప్పింది. చైనా సంప్రదాయ ఆరోగ్య విజ్ఞానాన్ని, అధునిక వైద్యవిద్యతో జోడించి 'బేర్ ఫూట్ డాక్టర్స్' పేరుతో సామాజిక ఆరోగ్యకార్యకర్తల గణాన్ని ఛైర్మన్ మావో నిర్మించాడు. ద్వారకానాథ్‌కోట్నీస్ ఇటువంటి కార్యకర్తలతోనే యుద్ధరంగంలో వైద్యశాలలు నిర్వహించాడు.

మనదేశంలోకూడా కొందరు మానవీయ దృక్పథంగల శాస్త్రవేత్తలు తమవంత ప్రయత్నం చేస్తున్నారు. డాక్టర్ పుష్పాంగదన్, భారత వనస్పతి సర్వేక్షణ సంస్థ తరపున తూర్పుకనుమలలోని 13 తెగల పదాలతో వారి చెక్కమందుల వాడకం గ్రంథస్థం చేయడమేకాదు, కేరళలో 'కాని' తెగవారి మందుకు, వారి పేరిటే పేటెంట్ చేసి, ఆ లాభాలను వారికే ఇప్పించాడు. ఇటువంటి శాస్త్రవేత్తలు మానవ, సాహిత్య భాషాశాస్త్రవేత్తలతో కలిసి పనిచేస్తే బంగారానికి తావి అబ్బినట్లు వుంటుంది.

మనకు శాంతా బయోటెక్ వరప్రసాద్‌రెడ్డి, రెడ్డి లాబోరేటరీస్ అంజిరెడ్డి, ఎల్లాప్రగడ సుబ్బారావు వగైరాలు ఉన్నారుకాని, ఒక పుష్పాంగదన్‌ను మనం తయారు చేసుకోలేకపోయాం. మనకు భద్రిరాజు కృష్ణమూర్తి తయారుచేసిన వ్యవసాయ పదకోశం వుందికాని, దాన్ని వాడుకునే వ్యవసాయ శాస్త్రవేత్తలులేరు. మనకు భాష శాస్త్రవేత్తలున్నా, మరో ఛామ్స్కినీ, లేవిస్ట్రాస్‌ను తయారు చేసుకోలేకపోయాం. సముద్రవిజ్ఞాన సంస్థ (ఇంకోయిస్), మత్స్య కళాశాలలు, సుదీర్ఘమైన తీరప్రాంతం వున్నాయికాని, తుమాటి దొణప్ప సంకలనం చేసిన మత్స్యపరిశ్రమ పదకోశాన్ని ఉపయోగించుకొనే శాస్త్రవేత్తలు లేరు. చేనేత పదకోశాన్ని వాడుకునే పరిస్థితిలో 'నిఫ్ట్' (నేషనల్ ఇన్‌స్టిట్యూట్ ఆఫ్ ఫ్యాషన్ టెక్నాలజీ) వుందా? అక్కినేని నాగేశ్వరరావు కూతురు యార్లగడ్డ సత్యవతి; బీనారావు, కేశవరావు దంపతులు ఈ రంగంలో పనిచేస్తున్నారుగాని, వారి దృష్టికి ఈ పదకోశాలను తెచ్చామా? వాస్తుపదకోశం వుందికాని దాన్ని ఉపయోగించుకునే ఇంజనీర్లు వుంటే, మనలో ఒక లారీబేకర్ తయారయ్యేవాడు. చెన్నైలో తండ్రికొడుకులు జాన్ విటేకర్, రాంవిటేకర్‌లు విషంకోసం పాములను చంపే తెగవారికి శిక్షణనిచ్చి, విషం పిండిస్తున్నారు. తెగలతో కలిసి పనిచేస్తున్నారు ప్రక్కనే ఉన్న మన శ్రీహరికోట రాకెట్ కేంద్రంలో శాస్త్రవేత్తలు, చుట్టూవున్న యానాదులతో అటువంటిపని ఎందుకు చేయించలేకపోతున్నారు?!

**అంగట్లో అవకాశాలు:**

ఒకనాడు మిఠాయిలు అంటే ఉత్తరాదివే. ఈనాడు తెలుగు పిండివంటలు, పచ్చళ్ళు, కూరలు, జొన్న రొట్టెలు విరివిగా దొరుకుతున్నాయి. లక్షలాది మందికి ఉపాధి కల్పిస్తున్నాయి. చత్తీస్‌ఘడ్, భోపాల్‌లో రోజుల తరబడి జరిగే సంప్రదాయ గిరిజన నాటకోత్సవాలు ప్రసిద్ధిపొందాయి. మనకు ఎన్నో యాత్రాస్థలాలున్నాయికాని తగినంత యాత్రా సాహిత్యం లేదు. తెలుగు వారికి రెండు రాష్ట్రాల ఏర్పాటులో మాండలికాల ప్రభావం కూడా ఉంది. ఆయా మాండలికాలలోని బతుకు తెరువులలో లోతును వెలికి తెచ్చే ఆంధ్రుల శాస్త్ర చరిత్ర రావాలి. 'నాడు, నుడి, నానుడి' శీర్షికతో వివిధ వర్గాల భాగస్వామ్యంతో ఈ చరిత్ర సంకలనానికి 'అమ్మనుడి' పిలుపునిచ్చింది.

'మన కవిత్వం మేడిపండు – మన దరిద్రం రాచపుండు' అన్నట్లు మన భావదాస్యమే మన అధోగతికి కారణం. కాబట్టి ఈ లోపాలను దిద్దుకొని సమన్వయించడంకోసం ఇప్పటికైనా తెలుగువాళ్ళు పూనుకోవాలి.

తెలుగు పరిశోధకులు శాస్త్ర దృష్టిని తెలుగువారైన శాస్త్రపరిశోధకులు తెలుగుచూపును అలవరుచుకోవాలి.

**కార్యాచరణ ప్రణాళిక:**

1. వృత్తి పదకోశాలను వ్యవసాయ సాంకేతిక విద్యకు సంప్రదింపు గ్రంథాలుగా తయారుచేయాలి. మిగిలిన కోశాలను కూడా పూర్తి చేయాలి.
2. తెలుగువారి శాస్త్రవారసత్వం ప్రాథమిక స్థాయి నుండి పాఠ్యాంశాలుగా చేర్చాలి.
3. తెలుగువారి శాస్త్ర వారసత్వం మీద ప్రచురణలు తేవాలి.
4. వివిధ రంగాలలో ఆంధ్రుల సృజనాత్మకతకు గుర్తింపు ప్రయత్నాలు ప్రారంభించాలి.

**రచయిత ఫోను: 9441427977**

గిడుగు 152వ జయంతి

# గిడుగు పిడుగే

- శ్రీ వేదగిరి రాంబాబు



గిడుగు రామమూర్తి

గిడుగు వేంకటరామమూర్తిగారు చాలా సామాన్య కుటుంబంలో జన్మించారు. శ్రీకాకుళం జిల్లా పర్వతాలపేటలో వీరరాజు, వెంకాయమ్మ దంపతులకు 1863 ఆగస్టు 29న.

చిన్నప్పుడు ఏ పాఠశాలకూ వెళ్లి చదువుకోని రామమూర్తిగారు విజయనగరంలోని మహారాజా కళాశాలలో లోయర్ ఫోర్త్ అప్పర్ ఫిఫ్త్ మెట్రికులేషన్ వరకే అక్కడ చదువుకున్నారు. అప్పుడు ఆయనకు గురజాడ వేంకట అప్పారావు గారు మిత్రులయ్యారు. ఇద్దరూ తెలుగు భాషకి, సాహిత్యానికి పట్టుగొమ్మలయ్యారు. ఇద్దరూ చరిత్రపట్ల అభిరుచిగలవారు. ఇద్దరూ చరిత్ర బోధకులుగా పనిచేశారు. ఇద్దరూ శాసన పరిష్కర్తలు, గిడుగు శ్రీముఖలింగం శాసనాల్ని పరిష్కరించి ఎపిగ్రాఫికో ఇండియాలాంటి పత్రికలో వ్యాసాలు రాశారు.

గురజాడ చదువు కొనసాగినా గిడుగుకి తండ్రి చనిపోయిన తర్వాత కుటుంబ భారం మీదపడడంతో మెట్రిక్‌తో చదువు మానేసి ఉద్యోగంలో చేరారు. అది అయిదు రూపాయలు జీతం ఎక్కువని, పర్లాకిమిడిలో అక్కడ పులులెక్కువని, అక్కడి దోమలు కుడితే పుట్టుచెవుడు వస్తుందని అందరూ భయపడ్డా గిడుగు వెళ్ళి చేరారు. పర్లాకిమిడి రాజావారి పాఠశాల, పాఠశాలనుంచి కాలేజీ అయ్యింది. గిడుగు పాఠశాలలో పనిచేస్తూనే ఇంటర్, బియ్యే (చరిత్ర) పూర్తి చేశారు. ప్రయివేట్‌గా రాసి, యూనివర్శిటీ మొత్తంలో రెండవశ్రేణిలో పాసయ్యారు. అంతా స్వయంకృషే. ప్రాచీన, ఆధునిక గ్రంథాలన్నింటిని చదివారు.

పర్లాకిమిడిలో జరిగే సంతలలో కొండప్రాంతాలనుంచి, అక్కడికి వచ్చి అమ్ముకుంటున్నవాళ్ళని అక్కడి ప్రజలు మోసగిస్తుండేవారు.ఆ మోసాలని గుర్తించి, మోసపోకుండా ఉండాలంటే వాళ్ళు విద్యనేర్వాలి. అందుకని సవరలను ఇంటికి పిలిచి వాళ్ళ ప్రాంతాలకి వెళ్ళి సవరల కథలు, పాటల్ని సేకరించేవారు. ఇలా జానపద మౌఖిక విజ్ఞానాన్ని సేకరించిన వాళ్ళలో ఆయన మొదటి వారయ్యారు. స్వరాలకోసం సవర తెలుగు, తెలుగు-సవర, సవర-ఇంగ్లీష్, ఇంగ్లీష్-సవర నిఘంటువుల్ని బోధించారు. ప్రభుత్వం పట్టించుకోకపోయినా సవరల పాఠశాలలని తామేనిర్వహించారు. ఇతర ఉపాధ్యాయులకి జీతాలూ గిడుగే ఇచ్చేవారు. ఒక సందర్భంలో ప్రభుత్వం ఆయనకు బహుమతిగా కొంత సొమ్ము ఇవ్వజూపితే నాకు వద్దు. ఆ సొమ్ముని సవరల విద్యకోసం ఖర్చుపెట్టండన్న మహనీయుడు.

ఆ పరిశోధనలోనే గిడుగుకి పుట్టుచెముడు వచ్చింది. సవరలుంటున్న కొండలలోకి వెళ్ళినప్పుడు అక్కడి దోమలు కుట్టి! చెముడు రాకపోతే ఇంకా సవరల కథలు, పాటలు సేకరించగలిగే వాడినని బాధపడ్డారు.

అప్పట్లో ప్రాథమిక స్థాయిలో కూడా అనువాద పద్ధతిలో భాషాబోధన జరిగేది. అలా కాకుండా ప్రత్యేక పద్ధతిలో విద్యాశోధన జరగాలని కృషిచేశారు. చిన్న వయస్సులోనే ఉద్యోగంలో చేరడంతో 30 సంవత్సరాలుపూర్తి చేసుకుని తక్కువ వయసులోనే రిటైర్ అయ్యారు. అప్పుడు ఆయనను గురజాడ విజయనగరంలో మహారాజావారి రెండవ కుమారునికి ట్యూటర్‌గా నియమించడం అక్కడున్న అధ్యాపకులకు కోపం వచ్చింది. గిడుగుని అక్కడనుంచి పంపించి వేయాలని - గిడుగుకి చెవుడని, అతను విద్యాబోధనచేసే కొత్త విధానం సరైనది కాదని రాణిగారికి నూరిపోసారు. ఆమె పాత విధానంలో చెప్పమన్నారు గిడుగుని.

పాతవిధానమైతే నేను చెప్పడమెందుకు? మీదగ్గరే చాలా మంది ఉన్నారుగా అన్నారుట. ఆయన అలా చెప్పడం రాణిగారికి కోపం తెప్పించింది. రేపు ఫస్ట్ నుంచి రావద్దన్నారట. వెంటనే ఫస్ట్ దాకా ఎందుకు? నేటినుంచే రాన'ని లేచి చక్కా వచ్చారట. అంతటి ముక్కుకి సూటిగా పోయే వ్యక్తి గిడుగు.

ఒరిస్సా ప్రత్యేక రాష్ట్రంగా ఏర్పడేప్పుడు పర్లాకిమిడి రాజావారు తన ఆధీనంలో వున్న పర్లాకిమిడి మరికొన్ని తెలుగు ప్రాంతాలలో కలపాలని చూశాడు. గిడుగు అందుకు వ్యతిరేకించాడు. కారణం ఆ ప్రాంతాల వాళ్ళు అంత వరకూ కంబైన్డ్ స్టేట్‌లో తమిళుల తర్వాత సెకండ్ రేట్ సిటిజన్స్‌గా ఉన్నారు. ఇప్పుడు ఒరిస్సా రాష్ట్రంలో కలిస్తే ఒరియా వాళ్ళ తర్వాతిస్థాయి పౌరులు అవుతారు. ఇది ఇష్టంలేక పర్లాకిమిడి రాజాకి వ్యతిరేకంగా ఉద్యమించాడని, దాంతో ఆయనకు విరోధి అయ్యారు. చివరకు కొన్ని గ్రామాల్ని మాత్రమే తెలుగుదేశంతో ఉంచగలిగారు. పర్లాకిమిడి ఒరిస్సాలో కలిసింది. దాంతో అక్కడ ఉండలేక, అన్నీ వదిలేసిరాజమండ్రి చేరాడు.

గిడుగు మొట్టమొదటి ఆధునిక తెలుగుభాషా శాస్త్రవేత్త. ఆధునిక సాహిత్య విమర్శకులలో కూడా ఆయన మొదటివారు ఏ ఇద్దరి గ్రాంధిక భాషా ఒకటిగా ఉండదని గ్రాంధిక వాదుల భాషని ఎత్తి చూపిస్తూ 'ఆంధ్ర పండిత భిషక్కుల భాషాభేషజము' అనే గ్రంథం రాశారు. సూర్యరాయాంధ్ర నిఘంటువు మీద గొప్ప విమర్శ చేశారు. ప్రాచీన కావ్యాలలో వాడుక భాషా ప్రయోగాల్ని సేకరించి 'గద్య చింతామణి'ని రూపొందించారు.

గ్రంథభాషేకాదు, బోధనా భాషకూడా మారాలని ఎంతగానో కృషి చేశారు. ఈ వ్యావహారికభాషా ఉద్యమం దాదాపు 1906 ప్రాంతంనుంచి 1940లో ఆయన మరణించేవరకూ జరిగింది. ఆయన వల్లే ఉద్యమస్థాయికి చేరింది. అదే ఆయన ఊపిరిగా బ్రతికారు. చాలావరకు విజయాల్ని ఆయన బ్రతికుండగానే సాధించారు. తుది పలుకుల్లో ఆ బాధ్యత మీమీదే ఉందని పత్రికా సంపాదకులతో అన్నారు.

గిడుగు 150 వ జయంతప్పుడు పర్లాకిమిడి నుంచి మొదలుపెట్టి ఆయన జీవించిన ప్రాంతాల్ని చుట్టివచ్చి, గిడుగు రచనలన్నింటిని సేకరించి తెలుగు 'గిడుగు రచనల సర్వస్వం' పేరిట అకాడమీకి ఇచ్చాము. వాళ్లు 'గిడుగు' తదితర రచనలన్నిటినీ వేయిపేజీల గ్రంథంగా తెచ్చారు. రెండో గ్రంథం నిఘంటువులు కొత్త ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వం తీసుకురావాలి. .ఆయన పోస్టల్ స్టాంపుని తేవాలి.

ఫోను: 9391343916

- ఆచార్య గారపాటి ఉమామహేశ్వరరావు
- డా॥ అద్దంకి శ్రీనివాస్

# తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం

**తె**లుగు భాషను అభివృద్ధిపరచాలి. తెలుగు వ్యవహారాన్ని పెంచాలి. అందరి నినాదమూ ఇదే.

అందుకు అనుసరించవలసిన మార్గం ఏమిటి? రాజ్యాంగపరంగా, చట్టాలపరంగా ఉన్న అవరోధాలు ఏమిటి? వాటిని ఎలా అధిగమించాలి? మాతృభాషావ్యవహారం అన్న అంశంపై రాజ్యాంగం మనకు కల్పించిన హక్కులు ఏమిటి? మనం వాటిని సద్వినియోగం చేస్తున్నామా ! దుర్వినియోగం చేస్తున్నామా ? ఇలా ఎన్నో ప్రశ్నలు. వీటిపై స్పష్టత లేదు.

తెలుగు భాషకు సంబంధించిన చట్టాలు ఏవో అవి ఎంతవరకు అమలులో ఉన్నాయో ఆ సమాచారమూ అందరికీ అందుబాటులో లేదు.

తెలుగు భాషావిధానం ఎలా ఉండాలి? అసలు భారతదేశంలోనూ, తెలుగురాష్ట్రాలలోనూ ఇప్పటిదాకా ఉన్న భాషావిధానాలు ఏమిటి? ఇతర దేశాలలో మాతృభాషల విషయంలో తీసుకున్న చర్యలు మనం ఆచరించదగ్గవిగా ఉన్నాయా? ఆ విషయాలు మనకు తెలియాలి.

ఆధునిక సాంకేతిక సమాచార విప్లవం, ప్రపంచీకరణ, స్థానికీకరణ, ప్రయివేటీకరణ మొదలైన నేపథ్యాలనుంచి భాషలను అధ్యయనం చేయడం అవసరం. ఆ అధ్యయనం వల్ల దేశభాషలకు అభివృద్ధిలో భాగస్వామ్యం కల్పించడానికి మార్గాలు తెలుస్తాయి. దేశభాషలు ఆధునిక సాంకేతికను అందిపుచ్చుకోవాలి.

భాషల ఆధారంగానూ ఉపాధి భద్రతను సాధించాలి. ఈ దిశగా పటిష్టమయిన భాషావిధాన రూపకల్పన శాస్త్రీయపద్ధతులలో ఇప్పటిదాకా జరగలేదు. వాటి ఆచరణ సఫలీకృతమయ్యే దిశగా ఆలోచనలుగానీ వ్యూహాలుగానీ లేవు.

మాతృభాషాకే పట్టం కడుతూ అభివృద్ధిపథంలో అందరికంటే ముందంజ వేస్తున్నాయి చైనా, జపాన్ వంటి దేశాలు. మరి వారు ఆచరించిన భాషావిధానం ఏమిటి ?

ఇటీవల అంతరించిపోయే భాషల జాబితా విడుదల చేసింది యునెస్కో. అందులో తెలుగు కూడా ఉందని పదే పదే అందరూ చెప్తూ వస్తున్నారు. అసలు యునెస్కో ఏం చెప్పింది ? ఒక భాష అంతరించిపోతోందా లేదా అని నిర్ధారించడానికి కొలమానాలు ఏమిటి ?

తెలుగు భాషకు రెండు రాష్ట్రాలు (ఆంధ్రప్రదేశ్, తెలంగాణా) ఆవిర్భవించాయి. అంతకు ముందు సంయుక్తాంధ్రప్రదేశ్ లోనూ తెలుగు అధికార భాషగా ఉంది. ఇప్పుడూ రెండు రాష్ట్రాలలోనూ తెలుగు అధికార భాష. ఇప్పుడు ఇరు రాష్ట్రాలలో మంత్రిత్వశాఖలు రెట్టింపు అయ్యాయి. వీటిలో ఒక్క భాషాసాంస్కృతికశాఖకు తప్ప తక్కిన శాఖలకూ భాషకూ ఏమీ సంబంధం లేదనే ధోరణి ఉంది. కానీ ఆయా శాఖలు ఏమిటి ? ఆయా శాఖలలో భాషపరంగా తీసుకోవలసిన చర్యలు ఏమిటి ?

ఇలాంటి ఎన్నో ప్రశ్నలకు సమాధానం ఈ తెలుగు రాష్ట్రాలలో భాషావిధానం (ప్రాథమిక ముసాయిదా). దీనికి ప్రేరణ తెలుగు అకాడమీ వారి ద్వారా జరిగింది. అకాడమీ వారికి సూత్రప్రాయంగా భాషావిధానం ఇలా ఉండాలని సూచించిన తర్వాత ఇంకా కొంత విపులంగా ఒక చేపొత్తంలాగా తయారుచేయాలని అనిపించింది. దానికి కార్యరూపమే ఈ ముసాయిదా.

భాషాదృక్పథం, విధానం, ఆచరణ అనే మూడు మార్గాలను ఎంచుకొని వాటిని ప్రస్తుత భాషా స్థితికి సమన్వయిస్తూ రావలసిన మార్పులూ, కావలసిన చేర్పులూ సూచిస్తూ తయారుచేసిన ముసాయిదా ఇది.

## రాష్ట్ర భాషా దృక్పథం - భాషా విధానం
## (ప్రాథమిక ముసాయిదా)

### 1.0 ప్రవేశిక

**ఉద్దేశ్యం**

తెలుగు భాష వ్యవహారవ్యాప్తికీ, అభివృద్ధికీ సంబంధించిన ప్రణాళికలు, కార్యాచరణ మార్గదర్శకాలూ, సంయుక్త ఆంధ్రప్రదేశ్ రాష్ట్రం ఏర్పడిన నాటినుండి ప్రత్యేక తెలంగాణా, అవశిష్ట ఆంధ్రప్రదేశ్ రాష్ట్రాలు ఏర్పడిన నేటివరకూ ఆశించినంతగా కృషి జరగలేదన్నదీ అందువల్ల ఆశించినంత ఫలితం అందలేదన్నదీ అందరూ అంగీకరించే విషయమే. దీనికి కారణాలను అన్వేషిస్తూ కూర్చొనే కన్నా ఇప్పటివరకూ ఉన్న ఆలోచనలన్నింటినీ క్రోడీకరించి ఆచరణయోగ్యమైన ప్రణాళికను సిద్ధం చేయడమే మన ముందున్న కర్తవ్యం. భాషాప్రయుక్త రాష్ట్రంగా ఆంధ్రప్రదేశ్ అవతరించడం భాషాభివృద్ధికి తొలిదశ అనుకొంటే ఒకే

భాషను వ్యవహరించే రెండు రాష్ట్రాలు తెలుగు భాషకు ఆవిర్భవించడం మలిదశ. ఈ మలిదశను వికాసదశగా మార్చుకొని అన్ని విధాలా భాషాభివృద్ధిని సాధించడానికి మూడు కీలక సోపానాలు ఉన్నాయి. అవి దృక్పథం, విధానం, ఆచరణ. ఈ మూడింటిలో ప్రయోగాత్మకంగా అడుగులు వేసేలా మార్గదర్శనం చేయడం కోసమే ఈ ప్రయత్నం.

**1.1 తెలుగు భాషకు పునరుద్ధానం**

ఇప్పుడు తెలుగు భాష రెండు రాష్ట్రాలలో ప్రధాన భాష. మరికొన్ని రాష్ట్రాలలో ముఖ్య భాష. భారతీయ భాషలలో విశిష్ట భాష. ప్రపంచంలో ఉన్న ఆరువేల భాషలలో తెలుగుది పదమూడవ స్థానం. పదమూడు కోట్లమంది ప్రధాన వ్యవహర్తలు గల భాష.

మొదటిసారి క్రీపూ.200 – క్రీశ. 200 మధ్య శాతవాహనుల నాణేలపై కనిపించిన తెలుగు ఇప్పటికి 2000 సంవత్సరాల నాటికే అధికార భాషగా ప్రజల వినియోగంలో ఉన్నట్లు రుజువు చేస్తోంది.

భాష, మానవ వికాస పరంపరలో అత్యంత ముఖ్యమైనదే గాక, జీవనోపాధికీ, జ్ఞానసృష్టికీ, సమాచార వినిమయానికీ వినోదానికీ మొదటి చిరునామా.

సమాచార ప్రసార సాంకేతిక యుగంలో అంతర్జాల ప్రగతిని అన్వయించుకొంటూ ఆధునిక అవసరాలకు అనువుగా వాడుకకు అవసరమైన వనరులతో తెలుగు భాష సాగుతోంది. సాంకేతికంగా ఆంగ్లభాషకు ఉన్న ఉపకరణాలను, సౌలభ్యాలనూ రూపొందించుకునే దిశగా వడివడిగా అడుగులు వేస్తోంది. ఇలాంటి తెలుగు భాష మనుగడ, కొన్ని తప్పుడు విధానాల వలన గాలిలో దీపంలా తయారైంది. తెలుగు భాషకు సముచిత స్థానాన్ని తీసుకురావడానికీ తద్వారా జాతి ప్రతిష్ఠనూ, ప్రజలలో జీవన విశ్వాసాన్ని పెంచడానికీ, బాషాభిమానాన్నీ, జాతిసమైక్యతనూ పెంపొందించడానికీ తెలుగు జాతి వారసత్వ సంపదను పరిరక్షించడానికీ, ఆధునికీకరించడానికీ తగిన విధంగా భాషా విధానం రూపొందించాలి. అది అమలయ్యే విధంగా శాసనాలు పనిచేయాలి.

అందుకు కావలసిన విధి విధానాలనూ మార్గదర్శకాలనూ శాస్త్రీయంగా, సోపపత్తికంగా అందించడమే దీని ప్రధాన ఉద్దేశ్యం .

**2.0 తెలుగు భాష చారిత్రక నేపథ్యం**

భారతదేశం సంక్లిష్ట బహుభాషా దేశం. హిందార్య, ద్రావిడ, ఆస్ట్రో–ఆసియా, టిబెటీయ–బర్మీయ భాషా కుటుంబాలకు చెందిన వెయ్యికి పైగా భాషలతో 120 కోట్ల జనాభాతో భారతదేశం ప్రపంచంలోని అతిపెద్ద భాషా కుటుంబాలకు అటపట్టు. ఇక్కడ అనేక భాషలకు చెందిన భిన్న భాషావ్యవహర్తల సమూహాలు వేలాది సంవత్సరాలుగా కలిసి మెలసి జీవనం సాగిస్తున్నాయి. ఈ అవిచ్ఛిన్న భాషా సమూహాల చరిత్రే సుదీర్ఘమైన, వైవిధ్యభరితమైన భారతదేశ చరిత్రకు సాక్ష్యం. పైగా, భారతీయ భాషలలో అనేక సాదృశ్య లక్షణాలు వ్యాపించడానికి ఇది సహాయపడింది. సమాన లక్షణాలను కలిగి ఉంటూనే ఒకదానికి ఒకటి భిన్నంగా ఉంటూ భారతదేశ భిన్నత్వంలో ఏకత్వాన్ని నిరూపించడంలో భారతీయ భాషలు ప్రధానమైన పాత్రను నిర్వహిస్తున్నాయి. ఇవి కేవలం వాగ్వ్యవహారానికి మాత్రమే ఉపయోగపడేవి అనుకొంటే పొరపాటే.

గత కొన్ని వేల సంవత్సరాల భారత ఉపఖండ చరిత్రను గనుక పరిశీలిస్తే– చిన్న చిన్నరాజ్యాలను కలిపి ఒకే పెద్ద రాజ్యం కిందికి చేర్చడం, అలాగే ఒకే పెద్ద రాజ్యాన్ని చిన్న చిన్న రాజ్యాలుగా విడగొట్టడం జరిగినట్లు తెలుస్తోంది. అయితే దీనివల్ల ఎప్పుడూ ఏ ఒక్క భాషా దాని మనుగడా మంట గలిసేలాంటి ప్రత్యేక పరిస్థితులు భారతదేశంలో ఏవీ ఏర్పడలేదు. ఇతరదేశాలలో (ఉత్తర, దక్షిణ అమెరికాలు, ఆస్ట్రేలియా లాంటి దేశాలలో) జరిగినట్లు దేశభాషలను అణచివేసే పద్ధతీ లేదు.

భారతీయ భాషలు ప్రపంచ భాషా చరిత్రలో ఒక విలక్షణ సంప్రదాయానికి తెరతీశాయి. ప్రపంచ పటంపై భారతీయ 'భాషా ప్రాదేశికత' కు (India as a Linguistic Area) ఒక గుర్తింపు తెచ్చాయి. ఈ విలక్షణత, భాషలు కనుమరుగు కాకుండా ఉండేందుకు అవలంబించిన ఒక ప్రణాళిక అని భాషా శాస్త్రజ్ఞులు అంటారు. అదే తెలుగు విలక్షణత. అఖండ భారతదేశంలో ఉత్తర దక్షిణాలమధ్య వారధిలా నిలబడిన తెలుగుభాష, భాషాప్రాదేశికతకు గీటురాయిగా నిలిచింది. భాషల మనుగడ హేతుబద్ధమైన కారణాలపై ఆధారపడి ఉండాలి. భారతీయ భాషలు విలక్షణతనీ, సంస్కృతినీ, జీవనాడినీ పట్టి చూపుతాయి. ఇంటువంటి వైవిధ్యం ఉన్న భాషలలో ఏ ఒక్క ప్రత్యేక లక్షణం కనుమరుగైపోయినా కొన్ని వేల సంవత్సరాల చరిత్ర, సంస్కృతి, వారసత్వ సంపదలను కోల్పోయినవారం అవుతాం. ప్రాచీన మానవ జీవవికాసానికి సంబంధించిన ఎన్నో సత్యాలు ఇంకా ఇప్పటికీ వెలుగు చూడలేదు. పైగా చరిత్ర వక్రీకరింపబడిన సందర్భాలూ ఉన్నాయి. అందుకు కారణం భాషలను చరిత్రరచనలోనూ పునర్నిర్మాణంలోనూ వాగ్రూప సాక్ష్యాలుగా స్వీకరించకపోవడమే. ఈ దిశగా ఆయా భాషలపై లోతైన పరిశోధనలు జరగకపోవడం ఒక ఎత్తయితే సమాజంలో అన్ని స్థాయిలకూ భాషలను విస్తరించనివ్వకపోవడం, పరిపూర్ణంగా ఆమోదించకపోవడం మరో ఎత్తు. ఇప్పుడు తెలుగు రాష్ట్రాలు రెండూ రెండింతల కృషితో తెలుగు చెట్టుకు వెలుగు పూలు పూయించాలనే లక్ష్యంతో ముందుకు సాగాలి.

**3.0 దృక్పథం**

ప్రజల భాషలో సాగని పాలన ప్రజాస్వామ్యం కాదు. ప్రజాస్వామ్యంలో పరిపాలన, విద్య, సమాచారప్రసార వినిమయం, వృత్తి – వాణిజ్య రంగాలలో అన్ని స్థాయిలలోనూ మొత్తం వ్యవహారాలు ప్రజల భాషలోనే సాగాలి.

**3.1 భాషాదృక్పథం – మౌలికాంశాలు**

**నియమాలు :**

**రాష్ట్ర భాషా విధానం – పంచసూత్ర విధానం**

1. భారత రాజ్యాంగ బద్ధంగా ఉండాలి.
2. హేతుబద్ధంగా ఉండాలి.
3. సామాన్యుల బతుకు తెరువుకు వనరుగా ఉండాలి
4. ఆధునిక సాంకేతిక వ్యవస్థకు ఆలంబన కావాలి.
5. ప్రజాస్వామ్య మనుగడను పటిష్ట పరచేదిగా ఉండాలి.

**ప్రాతిపదిక :**

భారతరాజ్యాంగంలోని 345వ ప్రకరణం, రాష్ట్రాలలోని భాషావిధానం గురించి ఇలా చెబుతోంది.

ఒక రాష్ట్రం – తన అధికారిక అవసరాలకు గాను ప్రాంతీయ

భాషను గానీ లేదా దేశ అధికార భాషను గానీ స్వీకరించే స్వేచ్ఛను కల్పిస్తోంది. ఐతే, అల్పసంఖ్యాక వర్గాల భాషలు పరిరక్షింపబడాలి. దానితో పాటు కనీసం ప్రాథమిక విద్యవరకైనా వాళ్ళు తమ మాతృభాషలో చదవుకొనేందుకు తగిన సదుపాయాలు కల్పించాలి. (భారత రాజ్యాంగంలోని 345 వ ప్రకరణం, చూ. అనుబంధం1).

భారతరాజ్యాంగానికి అనుగుణంగా ఆధికారిక భాషగా తెలుగును అన్నిరంగాలలో అభివృద్ధి పరుచుకోవటం మన కర్తవ్యం.

**సూచనలు :**

1. ఒక రాష్ట్రంలోని అధిక సంఖ్యాకుల భాషను అధికారబాషగా గుర్తించడం, అల్పసంఖ్యాకుల భాషలను పరిరక్షించడం రాజ్యాంగం నిర్దేశించిన భాషావిధానం. ఆలా అధికారభాషగా గుర్తించకపోవడం, పరిరక్షించకపోవడం, రాజ్యాంగ నిర్దేశకాలను అతిక్రమించడమే. అందువల్ల అధికార భాషాచట్టాలను ఉల్లంఘించడం నేర పూర్వకప్రవృత్తిగా గుర్తించాలి. ఇలాంటి నేరప్రవృత్తిని దేశద్రోహంగా, సమాజంపట్ల అనైతిక ప్రవర్తనగా పరిగణించాలి.
2. హేతుబద్ధత అంటే కొద్దిమంది ఇష్టానిష్టాలకు అతీతంగా జాతి, కుల, మతాలకు అతీతంగా నిర్దేశించబడినది. భాషల ఎంపికకూ అభివృద్ధికీ ప్రత్యక్ష సంబంధం కనబడుతోంది.
3. ఆర్థిక అభివృద్ధికి భాష కూడా ఒక సాధనం. అంటే బతుకు తెరువు చూపించేదే భాష. అంటే తెలుగు వెలగాలంటే బతుకుతెరువుకు సాధనం కావాలి. అదే జరగాలంటే పరిపాలన, విద్య, సమాచార ప్రసారరంగాల లోనూ వృత్తి వాణిజ్యాది రంగాలు అన్నింటిలోనూ తెలుగే మాధ్యమంగా సాగాలి. తెలుగులో చదివిన వారికే ఉద్యోగాలు, ప్రజాసేవకుల కొలువులలోనూ తెలుగు వాడే వారికే ప్రాధాన్యం ఉండాలి. ఇంగ్లీషు చదువులతో విదేశీ ఉద్యోగం చేయవచ్చుగానీ దేశీయ ఉద్యోగాలు కాదు. ఎవరిసేవకోసం ఇక్కడి ఇంగ్లీషు చదువులు?
4. భాష ఆధునిక సాంకేతికతకు ఆలంబనగా మారాలి. ప్రజాభాషలలో పరిపాలన, విద్యార్జన సాగాలి. సమాచార ప్రసార వృత్తి వాణిజ్యాది రంగాలలో తెలుగుకు సముచితస్థానం రావాలంటే అన్ని రకాలుగా అన్ని సాంకేతిక వ్యవస్థలలోనూ తెలుగే మాధ్యమం కావాలి. ప్రజల భాషలలోనే ఆధునిక సాంకేతిక వ్యవస్థల వాడకం అత్యంత వేగవంతం అవుతుంది. అలాంటి ప్రజాభాష మాధ్యమంగా ఉండే సాంకేతిక వ్యవస్థను చౌకగానూ వేగవంతంగానూ అందిస్తే అది ఎక్కువమందికి చేరువ అవుతుంది.

### 4.0 విధానం

భాషాసామర్థ్యం మానవ జన్మసిద్ధం. అలా సంక్రమించిన భాషా నైపుణ్యాలను అణగదొక్కడం అంటే భాషను ధ్వంసంచేయడమే. భాషాధ్వంసమూ జీవ విధ్వంసమే. దీనిని అరికట్టేందుకు ఒక సమయ బద్ధ భాషావిధానం ఉండాలి. అది కొన్ని నియమాలపై ఆధారపడి ఉండాలి. అంటే జీవ విధ్వంసాన్ని అరికట్టేందుకే భాషా విధానం. ఇదే ఐక్యరాజ్య సమితి భాషా విధానం.

### 4.1 భాషా విధానం – రూపకల్పన

**నియమాలు:**

రాష్ట్ర భాషా విధానం – పంచసూత్ర విధానం
ఆచరణలో అధికార భాష

1. సామాన్యులతోసహా అధికసంఖ్యాక ప్రజలకు మాతృభాషగా ఉండాలి.
2. నిత్యజీవితంలో అన్ని అవసరాలకూ పనికి వచ్చేదిగా ఉండాలి.
3. సామాజిక సమానత్వాన్ని పెంపొందించేట్లుగా ఉండాలి.
4. తెలుగువారి చరిత్ర, సాంస్కృతిక నేపథ్యానికి తగినట్లుగా ఉండాలి.
5. ఐక్య రాజ్య సమితి భాషావిధానాన్ని గౌరవించేటట్లు ఉండాలి (చూ. అనుబంధం 2).

**ప్రాతిపదిక :**

రాష్ట్రభాషా ప్రతిష్ఠను పెంపొందించే విధంగా హెచ్చుతగ్గులు లేని సమ సమాజ నిర్మాణానికి మాతృభాషే ప్రధాన భూమిక. మాతృభాష మానవ అస్థిత్వానికి మూలం. సామాన్య ప్రజలకు నిత్య వ్యవహారంలో ఉపయోగపడే ఒక సులభమైన ఉపకరణం మాతృభాషే. (అందుకే సాంకేతికంగా భాషను అభివృద్ధి చేయవలసిన అవసరం ఎంతో ఉంది.) మానవీయ విలువలతో కూడిన జీవన ప్రమాణాలు, మాతృభాష ద్వారా మాత్రమే నిరూపితం అవుతాయి. ఒక వ్యక్తి ప్రాదేశికత, ప్రాంతీయత మాతృభాషలోనే ప్రతిబింబిస్తాయి. భావ వ్యక్తీకరణకే కాదు, జీవనానికి బుద్ధివికాసానికీ భాష ఓ మాధ్యమం. వ్యక్తిత్వ వికాసాన్నీ నడవడికలో మార్పునూ తీసుకురాగల సత్తువ భాషకు ఉంది. భాషను బట్టి సంస్కారం, విద్య ఇనుమడిస్తాయి. భాషాచరిత్రే సమాజ చరిత్ర, దేశ చరిత్ర కూడా. మండలిక వ్యవహారాలలో మనకెవరికీ చెవినపడని అపారమైన పదసంపద ఉంది. అది జాతి ఉనికినీ, పరిణామాన్నీ, పరిణతినీ తెలియజేస్తుంది.

భాషను విభజన సాధనంగా వాడటాన్ని ఐరాస వ్యతిరేకిస్తోంది. అలా వాడటాన్ని నిరోధించడంపై ఒక నివేదికనూ తయారుచేసింది. దాని సారాంశం ఇది.

ఆధిపత్య/ఆధికారిక భాషావ్యవహారంలో కొన్ని పరిమితులు ఉంటాయి. ఆ పరిమితులు విద్య, రాజకీయం, న్యాయం మొదలైన రంగాలలోనికి స్థానిక భాషావ్యవహర్తలను రానివ్వవు. దూరంగా ఉంచుతాయి. ఆంగ్లం నేడు ఆధిపత్య భాషకూ, తెలుగు స్థానిక భాషకు ప్రాతినిధ్యం వహిస్తాయి.

మౌఖిక, సంకేత భాషలు వ్యవహారంలో నిలిచి ఉండాలి. ఆ భాషల పరిరక్షణ తల్లిదండ్రుల నుండి పిల్లలకు వారసత్వంగా అందించడంపై ఆధారపడి ఉంటుంది. ఇది ముఖ్యమైన అంశం. భాషా పరిరక్షణ జరగాలి. భాషా సాంస్కృతిక విధ్వంసం ఆగిపోవాలి. భాషలకు సంబంధించిన మానవ హక్కుల హరణాన్ని నిరోధించాలి. మాతృభాషా మాధ్యమంలో చదువుకోవడం ప్రతి పౌరుడి ప్రాథమిక హక్కు. దశాబ్దాలుగా లేదా శతాబ్దాలుగా మాతృభాషలలో సాధారణ విద్యాబోధన జరగని భాషలు అదృశ్యమైపోతాయి. ఆధునీకీకరణ, ప్రపంచీకరణ నేపథ్యంలో ఈ హక్కులు మరింత త్వరగా హరించుకు పోతున్నాయి. మాతృభాషా మాధ్యమంలో విద్యార్జన చేసే అవకాశాలను కాలరాయడం

అంటే మాతృభాషలకు మరణ శాసనాలను రాయడమే.

సాంఘిక – రాజకీయ నేపథ్యాలనుంచి చరిత్రనూ, సంస్కృతినీ, ప్రజాజీవితాన్ని పునర్మూల్యాంకనం చేసుకోవాలి. దీనికి సామాజిక భాషా శాస్త్ర దృష్టికోణమూ ఎంతో అవసరం. ఇప్పటిదాకా చీకటికోణాలలో మగ్గిపోయిన వాస్తవాలకూ, ఆ వాస్తవాల అట్టడుగున ఉన్న జనులు మాట్లాడే భాషలకూ ఆయా వర్గాలకూ ఒక గుర్తింపు, గౌరవం, సమప్రాధాన్యం కలిగేలా మన ఆలోచనలూ విధానాలూ ఆచరణలూ ఉండాలి. ఇలా చేయడం వల్ల సహానుభూతి కలుగుతుంది. అది జాతి సమైక్యతకు దోహదం చేస్తుంది. మాండలికాల అధ్యయనం వల్ల భాషా సామరస్యాన్నీ, వర్గసామరస్యాన్నీ సాధించటం సాధ్యమవుతుంది.

**సూచనలు:**

1. భాష ఒక సాధనం. మనిషికి ఒక అవయవం. దాన్ని మానవ మనుగడకు ఒక ఆనవాలుగా గుర్తించాలి. మాతృభాషాభివృద్ధి మన అభివృద్ధిలో భాగం. మాతృభాషానైపుణ్యాలు మన జీవన సోపానాలు.
2. భాష వేరు సాహిత్యం వేరు. జీవన సమరంలో భాష ఒక ఆయుధం. భాషను అభివృద్ధి పరచే ప్రణాళికా రూపకల్పనల విషయంలో సాహిత్యం, సంస్కృతుల నుంచి భాషను వేరుగా చూడాలి. అలా చూస్తేనే భాషాభివృద్ధి సాధ్యం.
3. ప్రజల భాషలోనే జ్ఞానసృష్టి, సమాచార వినిమయం జరగాలి.
4. ప్రపంచీకరణ భావానికి సంబంధించినది కానీ భాషకు సంబంధించినది కాదు. ప్రపంచీకరణకు ప్రజలభాషలు/ మాతృభాషలు ఆలంబనం కావాలి. ప్రజాస్వామ్యదేశాల లక్ష్యం తమ ప్రజాసంక్షేమమే. ప్రజాసంక్షేమంలో ప్రజల మాతృభాషలూ ఇమిడి ఉన్నాయి. ప్రపంచీకరణ పేరుతో ఆంగ్లభాషావ్యాప్తి వలసవాదానికి మారుపేరు. నిన్నటి వలసవాదం కంటే నేటి ఆంగ్ల మాధ్యమ విద్యలే బడుగుదేశాల స్వాతంత్ర్యాన్ని హరిస్తున్నాయి. ఆ దిశగానే రేపటి అడుగులు పడబోతున్నాయి. దాన్ని అడ్డుకోవాలి.
5. చరిత్రా సంస్కృతుల మూలాన్వేషణలో భాషా ప్రాధాన్యాన్ని గుర్తించే స్థాయిలో పరిశోధనలు ఎదగాలి. వాటిని ప్రోత్సహించాలి.
6. ప్రజల భాషకు సాంకేతిక పరికరాల రూపకల్పన స్వావలంబనకు గీటురాయి. రాష్ట్ర భాషావిధానం దానిని ప్రోత్సహించేదిగా ఉండాలి.

**తరువాయి వచ్చే సంచికలో.....**

**రచయితలు హైదరబాదులోని కేంద్రీయ విశ్వవిద్యాలయంలో ఆచార్యులు గారపాటి ఉమామహేశ్వరరావు,**

**ఫోను:** 9866128846,

**డా॥ అద్దంకి శ్రీనివాస్. ఫోను:** 8500305374.

## పుస్తక సమీక్ష

# అన్ని కోణాల్లో వేమన వాక్కులు




**వే**మన పద్యాలు వినని వారు, వానలో తడవని వారు ఉండరన్నమాట తెలుగునాటేకాదు. పొరుగు రాష్ట్రాల్లోనూ నిజం. తానుచూచిన, అనుభవించిన విషయాల్లో మంచి చెడులను మూడు పాదాల్లో ముచ్చటగా చెప్పటం ఒక్క వేమనకే చెల్లింది. క్రీ.శ. 19వ శతాబ్దం నుంచి విదేశీ పండితులను సైతం ఆకట్టుకొన్న వేమన పద్యాలపై ఇప్పటి దాకా వందల సంఖ్యలో పుస్తకా లొచ్చాయి. అయినా రచయితల్లో ఎవరి తీరు వారిదే. వారికున్న అవగాహన మేరకు వారివారి వ్యాఖ్యానాలున్నాయి. కొందరు పద్యాలకు భావాలు రాస్తే, మరికొందరు సమగ్రవ్యాఖ్యలు రాశారు. అయితే విషయపరంగా ఒక్కో అంశాన్ని ఎన్నుకొని రాసిన వాళ్లలో గుర్రం వెంకటరెడ్డి, పోచన రామిరెడ్డి ముఖ్యులు. వైరాగ్యం, భక్తి, హేతువాదం, లోకరీతి, మూఢాచారాలు, ఛాందసం, మానవత్వం, శాంతం, మోక్షం, వేదాంతం, లోభం, మోహం, నీతి, హితం, వ్యంగ్యం, పరిహాసం లాంటి 64 అంశాలుగా విభజించి రాసినవారు అంగత వరప్రసాదరావు ఒక్కరేనని చెప్పాలి. వేమన అందుబాటులో ఉన్న అన్ని పుస్తకాలను సేకరించి, చదివి, ఆకళింపు చేసుకొని, బేరీజు వేసుకొని, ఆయన మనసులోంచి మళ్లీ జాలువారిన భావాలను భిన్న కోణాల్లో ఆవిష్కరించటానికి వేమన పద్యాలను వర్గీకరించిన తీరు ప్రశంసనీయమేకాక, రచయిత విషయ పరిజ్ఞానాన్నికూడా తెలియజేస్తుంది. రచయిత ఎంచుకొన్న ప్రతి అంశమూ చదివే ప్రతి పాఠకుడు కూడా అదే అనుభూతిని పొందేట్లు చేస్తుందనటంలో సందేహం లేదు. 'కనీసం ఆణిముత్యాల్లాంటి ఓ రెండు మూడొందల వేమన పద్యాలైనా హైస్కూలు విద్య పూర్తయేనాటికి ప్రతి విద్యార్థి నేర్చుకొనేలా పాఠ్యప్రణాళిక రూపొందిస్తే, మంచి పాఠాలను భారతదేశానికి అందించినవారమవుతాం. అని మనవి చేసుకొన్న అంగత వరప్రసాదరావు అభినందనీయుడు. ఏ సమాజ జీవితాన్ని కోరి వేమన పద్యాలు చెప్పాడో, అదే వరవడిలో రచయిత సులువైన వాడుక భాషలో పద్యాలకు అర్థాలను చెప్పి, వేమన పద్యాలను మళ్లీ చదవాలనిపించేలా చేశారు. విద్యార్థులే కాదు, ఉపాధ్యాయులు, పరిశోధకులేకాదు ఆచార్యులు, ప్రతివాళ్లూ వద్ద ఉంచుకోవాల్సిన పుస్తకం వేమనవాక్కులు. ఎప్పుడో చెప్పిన వేమన మాటలు ఇప్పటికేకాదు. ఎప్పటికీ చక్కని బాటలే. ఖండన, హేతువాద అంశాలపై కూర్చిన ప్రతిపద్యమూ మనిషిని మనిషిగా బతికేట్లు చేస్తుంది. యోగి వేమన శీర్షికలోని 'ఏరుదాటి మెట్టకేగిన పురుషుండు' పద్యం బుద్ధుడు చెప్పిన మాటల్ని గుర్తు చేయటమే కాక వేమన సర్వ మతసారాన్ని వంటబట్టించుకొన్నాడని తెలియజేస్తుంది. వేమన పద్యాలుగా చలామణి అవుతున్న *'నాదబిందు కళల నయమొంది యాత్మ'* (పే.314) లాంటి పద్యాలను వేమననుంచి వేరు చేసి ఉండాల్సింది. ఎందుకంటే పాదంలోని ప్రతిపదం అచ్చతెనుగు పదం ఉండటం వేమన పద్య లక్షణం. చక్కటి ముఖచిత్రంలో 453 పేజీల ఈ పుస్తకం ప్రతి ఇంటా ఉండాల్సినదే. వెల: రూ.300/-. ప్రతులకు: అంగత చంద్రశేఖరరావు, రాఘవ ఫుట్‌వేర్, కామయ్యతోపు, బందరురోడ్డు, విజయవాడ-7. మొబైల్:99492 62772.

**– *ఈమని శివనాగిరెడ్డి*** , ఫోన్: 9848598446

జాషువ జయంతి

# మహాకవి జాషువ తెలుగు సామాజిక జీవనదృశ్యం

- డా॥ కత్తి పద్మారావు

‘మహాకవి జాషువ తెలుగు సామాజిక జీవనదృశ్యం. నేటికీ ఆయన గీసిన చిత్రాలు చెరగలేదు. ఆయన జాలువార్చిన తెలుగు పదాల విన్నాణం చెదరలేదు. మానవతా దివ్వెల వెలుగులు తరగలేదు. ఆయన తెలుగువారి హృదయవేదనలను వినిపించాడు. తెలుగువారి సామాజిక అసమానతలకు అద్దం పట్టాడు. ఆ అసమానతలు ఇప్పటికీ మనల్ని వెంటాడుతున్నాయి. ఆయన కవితాశిల్పం తెలుగువారి జీవనదృశ్యం. మహాకవి జాషువ పలికిన ప్రతిపలుకులో తెలుగు జాతీయత వుంది. జీవన స్వరాలు ఆయన పదాల్లో పలుకుతాయి. తెలుగువారి గ్రామ జీవితంలోనుండి వచ్చిన నానుడులు, పలుకుబడులు, సామెతలు జాషువాగారి కవిత్వానికి జీవనాడులు. అందుకే జాషువ కవి మహాకవి అయ్యాడు. ఎవరి కవిత్వం అయితే సమకాలీన జీవన దర్పణం అవుతుందో, ఎవరి కవిత్వంలో అయితే మన జీవితం అద్దంలా కనిపిస్తుందో, ఎవరి కవిత్వం అయితే శ్రుతిబద్ధమై, మాధుర్యమై తేనెలవర్షం మెరుస్తుందో ఆ కవే మహాకవి. జాషువ గొప్పభావుకుడు. నిజానికి తెలుగు జీవితానికి కలలెక్కువ. కళ్ళుమూస్తే కలలుకంటాం. ఆ కలల్లో మన ఊహలు ఆశ్చర్యాన్ని గొలుపుతాయి. ‘స్వప్న కథ’లో మహాకవి జాషువ కల చూడండి:

*‘నేనొకనాఁడు స్వప్నమున*
*నింగికి రివ్వున లేచి చంద్రబిం*
*బానికి దాపునం గనుల*
*పండువు సేయుచున్న వింత మై*
*దానమునందు వ్రాలి ప్రమో*
*దంబున దిక్కులు సూచుచుండ నా*
*పై నును లేత వెన్నెల తు*
*పానులు వీచె మనోహరంబుగన్.*

*అచ్చెరువు పడుచుఁ బచ్చల*
*పచ్చిక బయలునఁ జరింపవలెనని తిరుగం*
*జొచ్చితి నపుడొక కమ్మని*
*ముచ్చెర్నాదంబు శ్రవణయుగళిన్ దాకెన్’.*

*(జాషువ రచనలు (రెండవ సంపుటం), స్వప్నకథ (ప్రథమాశ్వాసం), పుట. 1, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్.)*

కవి భావుకుడు, స్వప్నప్రియుడు. దళితులు ఎక్కువ భావుకులే వుంటారు. కలలు మీద కలలు



**ఇంకా తెలుగు నేలలో, అస్పృశ్యతా కల్మషం రూపుమాయలేదు. జాషువా కోరిన ‘పేదలు దుఃఖపడని చోటు’, ‘జ్ఞానం స్వేచ్ఛగా పెరుగుచోటు’, స్వేచ్ఛాపక్షి పాదలుచోటుగా తెలుగు నేల ఆవిర్భవించాలంటే వర్ణ, కుల, మత ఆధిపత్యాలు తొలగిపోవడానికి సాంఘిక సాంస్కృతిక ఉద్యమం నిరంతరం కొనసాగాలి.**

కంటారు. నేను చిన్నపుడు మా పెదనాన్న దగ్గర కథలు వినేవాణ్ణి, మానాన్న కూడా గొప్ప కథకులు. కథలమీద కథలు, గొలుసు కథలు. మౌఖిక సమాజం కథాసముద్రం. అందులో ఎంతో తెలుగు వెలుగులు వుంటాయి- చంద్రుడు, వెన్నెల - జాషువ ‘స్వప్నకథ’లో కథలో రివ్వున లేచిపోయాడు.

చంద్రబింబానికి ఆవల - కనులపండుగ చేసే వింతమైదానం. ‘ఆవల’ ‘కనులపండువ’ ఈ శబ్దాలను తెలుగువారు ఎక్కువగా వాడతారు. ఈ పద్యంలో ‘నింగి’ దిక్కులు, ‘లేతవెన్నెల’ తెలుగు ప్రయోగాలు గుండెల్ని హత్తుకుంటాయి. ‘అచ్చెరువు’ పడుచు, పచ్చిక, బయలు, చరించుట, చొచ్చితి, తాకెన్- అనే పదాలు రెండవ పద్యంతో వాడారు. ఈ పదాలన్నీ తెలుగువారి గ్రామాల్లో నిరంతరం నోళ్ళనానేవే. అందుకే జాషువాకవి ప్రజల నాలుకలమీద నర్తిస్తున్నాడు. కవి చంద్రమండలానికి వెళ్ళిన తరువాత ఏమి జరిగిందో చూద్దాం....

*‘ఇంద్రధనువు వంటి హృదయంగమంబైన*
*వన్నె చిన్నె లీను వలువఁగట్టి*
*బాలుఁ డొక్కరుండు కేళి సల్పుచు నుండె*
*కాఱుమబ్బు డోలికలఁ బరుండి.*

*నన్ను రాచుకొనుచు నలువంకలకు ఁబారు*
*మెఱువు దీవియలను నొరయుచున్న*
*వాని చక్కఁదనము వర్ణింపవలెనని*
*కలము నందికొంటిఁ గౌతుకమున.*

*అతడు కికాకిక న్నగి వి*
*యత్తల మెల్ల ధ్వనించిపోవ, స్వా*
*గతము కవీశ! రమ్మిచటి*
*కాలువ గట్టున నున్న రత్న రం*
*జితమగు నస్మదీయ గృహ*
*సీమను నించుక విశ్రమించి నీ*
*కత వివరింపుమం చెదురు*
*గా నటబెగురు లల్లలాడగన్.*

*కలయో? నిక్కువమో! యను*
*తలంపు చిత్తంబునందుఁ దళుకొత్తఁగ భూ*
*తలమునఁ బడియెదనో యని*
*యులుకుచు గగనమునఁ దిరుగుచుంటి*
*నతనితోన్’*

*(అదేపుస్తకం: పుటలు 1, 2.)*

ఈ పద్యాలలో జాషువా మహాకవి ‘ఇంద్రధనువు వంటి వస్త్రం కట్టిన బాలుడు’ కనిపించాడు. ‘కారుమబ్బుల’ ‘డోలికలు’లో ‘పరుండి’ పదాలు వాడాడు. <u>ఇది ఒక గొప్ప దృశ్యచిత్రం.</u> ‘వన్నెచిన్నెలు’, ‘కారుమబ్బులు’, ‘డోలికలు’ వంటి తెలుగు పదాలతో అద్భుతమైన చిత్రాన్ని జాషువా గీశాడు. రెండవ పద్యంలో ‘నన్ను రాచుకుంటూ మెరువు తీగలు ఒరియుచున్నవి’. వాటి చక్కదనాన్ని వర్ణించడానికి కలం పట్టాను అన్నాడు. ‘మెరువుతీగలు’ ‘ఒరుచుకోవడం’ అద్భుతమైన వర్ణన - నిజానికి వ్యవసాయ సంస్కృతిలో భాగంగాను, చిన్నచిన్న గుడిసెల్లో ఉండడం వల్లను తెలుగువారు అందునా దళితులు ఎక్కువ ఆకాశంవేపు చూస్తారు. ఇప్పుడు సంస్కృతం నుండి వచ్చిన తత్సమపదాలు రాకముందే దళితులు ఆకాశంలో వుండే అన్నింటికి పేర్లు పెట్టారు.

ఆ భావుకతనుండే కలం పట్టానని జాషువా కవిగా చెప్పుకున్నాడు. నా చిన్నప్పుడు మావూరి అరుగులమీద చెట్లక్రింద నాపబండ్లమీద ఇటువంటి కవులే కొల్లలుగా వున్నారు. ఆ తరువాత జాషువా

ఆ వెన్నెల స్నానం ఆడేబాలుడు – 'కికాకిక' 'నగి' అనడంలో ఒక అందం వచ్చింది. 'కలయో' 'నిజమో' 'చిత్తము' 'తళుకొత్తగా' వంటి తెలుగునుడికారపు సొబగులను కవి ఇక్కడ దృశ్యీకరింపజేశారు. జాషువా కవి అసమాన కవితా సామర్థ్యం కలవాడు. కవితా శిల్ప సౌందర్యాలను ఆవిష్కరించడంలో ఆయన్ని మించినవాడు తెలుగు గడ్డపై లేడు. పిరదౌసి కావ్యంలో తన కవితాశిల్ప నైపుణ్యాన్ని చూపించాడు. భారతీయుల సంపదను గజనీ మహమ్మద్ ఎలా కొల్లగొట్టాడో చెబుతూ పిరదౌసిలో–

*'బంగరు నాణెముల్ బస్తాల కెత్తించి*
*మదపుటేన్గుల మీఁదఁ బదిలపరచి*
*లేఁతపచ్చల నేరి గోతాలఁగుట్టించి*
*లొట్టిపిట్టలమీఁద దిట్టపఱచి*
*కురువింద మణులను కుంచాలఁ గొలిపించి*
*పరువు టెద్దులబండ్లపై నమర్చి*
*మొలకపజ్రముల జాలెలఁ బోసి కూర్పించి*
*గుఱ్ఱాల మూఁపుల cగుస్తరించి*

*పదియు నెనిమిది విజయరంభల వరించి*
*గాంగజలమున నెత్తుటికత్తి గడిగి*
*సర్వము హరించి హిందుదేశంబు విడిచి*
*గజనిమామూదు గజనీకిఁ గదలిపోయె'.*

*(జాషువా రచనలు, రెండవ సంపుటం, పిరదౌసి –ప్రథమాశ్వాసం, విశాలాంధ్ర పబ్లిషింగ్ హౌస్)*

గజనీమహమ్మద్ చరిత్ర వ్రాసి బంగారునాణాలు కానుకగా పొందవలసిన జాషువా వెండినాణాలు పొందిన ఉదంతం పిరదౌసికావ్యంగా వచ్చింది. ఈ కావ్యశిల్పం శ్రీనాథుణ్ణి మించుతోందనుటలో అత్యుక్తి లేదు.

తెలుగు కవిత్వంలో కందపద్యాన్ని తీర్చిదిద్దడంలో తిక్కన, ఆటవెలదులను తేటగీతిలను కూర్చడంలో వేమన, ఉత్పలమాల పేర్చడంలో పెద్దన, సీసం చెక్కడంలో శ్రీనాథుడు, చంపకమాలను కుట్టడంలో చేమకూర, మత్తేభం ఎక్కడంలో భట్టుమూర్తి రామరాజభూషణుడు దిట్టలనిపేరు. ఈ నైపుణ్యాలన్నింటిని మహాకవి జాషువా ఒడిసి పట్టాడు. తెలుగు ఛందస్సుల్లో 'నగణం' వచ్చిందంటే తెలుగు పదం పడినట్లే, తత్సమ పదాలకి అనువుగా వున్న చోటకూడా తెలుగు పదాలనే కూర్చడంలో గుర్రం జాషువాది అందెవేసిన చేయి.

ఈ పద్యం శైలి విషయంలో శ్రీనాథుణ్ణి, భట్టుమూర్తిని రామరాజభూషణుణ్ణి జాషువా ఒక్క అడుగు మించుతున్నాడు. 'బంగారు నాణెములు', 'బస్తాలు' 'మదపుటేన్గులు', 'లేతపచ్చలు' 'గోతాలు', 'లొట్టిపిట్టలు' కురువిందమణులు' 'కుంచాలు' 'పరువుటెద్దులు', 'మొలకవజ్రములు', 'జాలెల', 'నెత్తుటికత్తి', 'గుర్రాలమూపులు', 'కదలిపోయె', 'ఎత్తించి', 'కొలిపించి', 'కూర్పించి–గుస్తరించి', 'కడిగి', 'విడిచి', – ఇన్ని తెలుగు పదాలతో సీస పద్యాన్ని కూర్చారు. భారతదేశాన్ని గజనీమామూదు దోచిన విషయాన్ని చెప్పటం ఆశ్చర్యకరమైన విషయం. జాషువాలో జాతీయత, దేశీయత, చారిత్రక అవగాహన మనకు కళ్ళకు కట్టినట్లు కనబడుతున్నాయి. కవికి తెలుగు పదాలమీద అసమనమైన పట్టు వుంది. ఒక్క పద్దెం జాషువాది కంఠతా వస్తే, ముప్పయి, నలభై పదాలు మనసొంతమవుతాయి. ఒక చెరిగిపోని చారిత్రక దృశ్యం మన కళ్ళలో మెదులుతుంది. కవిత్వానికి ఇంతకంటే సార్థకత ఏముంది? ఏ వీరగాథకైనా కవి కలమేగా శాశ్వతత్వాన్ని కల్పిస్తుంది. చరిత్ర మర్మం తెలిసిన చక్రవర్తి ఎవడైనా తన చరిత్రను శాసనాల్లో, అక్షరాల్లో చెక్కించాలనుకొంటాడు.

గజనీమామూదు అలాగే ఆలోచించాడు. పిరదౌసి కవిని పిలిపించాడు. తన చరిత్ర రాయమన్నాడు. జాషువాకవికి కవియొక్క శాశ్వతత్వం తెలుసు, చక్రవర్తికంటే కవి గొప్పవాడనీ తెలుసు. అందుకే ఈ సందర్భాన్ని పుణికి పుచ్చుకొని ఎల్లలోకాలకు కవి గొప్పతనాన్ని చాటి చెప్పాడు.

*కవిని కన్న తల్లి గర్భంబు ధన్యంబు*
*కృతిని జెందువాఁడు మృతుడు గాఁడు*
*పెరుగు దోటకూర విఖ్యాత పురుషులు*
*కవిని వ్యర్థజీవిగాఁ దలంత్రు.*

*తమ్మి చూలి కేలుదమ్మిని గలనేర్పు*
*కవికలంబునందుఁ గలదు గాన*
*నీశ్వరత్వ మతనికే చలామణి యయ్యె!*
*నిక్కువముగఁ బూజనీయుఁడతఁడు.*

(అదే పుస్తకం, 47వ పుట)

కవిని గురించి ఇంత ఉన్నతంగా చెప్పడం అందునా తెలుగు ఉపమాన ఉపమేయములతో దుస్సాధ్యం. ముఖ్యంగా పెరుగుతోటకూర మడినుండి పీకివేయడంతో వాడిపోతుంది. చాలామంది కవులు ఆ రోజుల్లో 'అహంకార' పూరితంగా ఉండేవాళ్ళు. ముఖ్యంగా జాషువాకవి దృష్టిలో విశ్వనాథ సత్యనారాయణగారున్నారు. ఆయన 'అల నన్నయ్యకు లేదు. తిక్కనకు లేదు. అస్మాదృశుండు, బ్రాహ్మీయమూర్తి, ధిషణాహంకారి శిష్యుడైన కీర్తి, చెల్లపిళ్ళ కవులకు దప్ప' అని చెప్పుకొన్నాడు. గుర్రం జాషువాకి చెళ్ళపిళ్ళ వంటి గురువులు లేరు. ఆయన చెళ్ళపిళ్ళవారి చేత గండపెండేరం తొడిగించుకున్నాడు.

కవిని గురించి ఎక్కువ అహంకారపూరితమైన నిర్వచనాలే చూస్తాం. శ్రీశ్రీ ఒకసారి

*'భూతాన్ని / యజ్ఞోపవీతాన్ని / వైప్లవ్యగీతాన్ని*
*నేను / స్మరిస్తే పద్యం / అరిస్తే వాద్యం /*
*అనలవేదిక ముందు అస్రనైవేద్యం'*

అన్నాడు. ఇదంతా సంస్కృతమే. యజ్ఞోపవీతం, అస్రనైవేద్యం ఇదంతా వైదిక కర్మకాండ. కాగా జాషువ – కవిని నిజమైన సృష్టికర్తగా సార్వజనీనం చేశాడు.

*క్షణము గడచిన దాని వెన్కకు మఱల్ప*
*సాధ్యమే మానవున కిలా చక్రమందు?*
*దాఁటిపోయిన యుగములనాఁటి చరిత*
*మరల బుట్టింప గవియ సమర్థుడగును.*

క్షణం గడచిపోతే అది తిరిగిరాదు. కాని కలంతో చిత్రించిన జీవన చిత్రాలు ఆ కాలాన్ని మన ముందుకు తెచ్చి ఉంచుతాయి. వేమన కాలంలో వున్న సామాజిక పరిస్థితులు, పోతులూరి వీరబ్రహ్మం, తాపీ ధర్మారావు, జాషువా తమ కాలాలను మన ముందు ఉంచినవారే.

జాషువ కవి పిరదౌసి వుదంతం తీసుకోవడానికి కారణం – ఆ కథలో కరుణ రసార్ద్రతవుంది. కవి పారసీకుడైనా, ఇంగ్లీషు వాడైనా, తెలుగు వాడైనా విశ్వజనీనుడే. రాజ్యానికి కవికి జరిగే యుద్ధమే నిజమైన కవిత్వాన్ని సృజిస్తుంది. అందుకే పిరదౌసి పక్షాన జాషువా నిలబడ్డాడు. గజనీమహమ్మద్‌ను చీల్చి చెండాడాడు. కవి వ్యక్తిత్వాన్ని ఆకాశానికి ఎత్తి చూపించాడు. రాజు కర్కశత్వాన్ని కూడా దృశ్యీకృతం చేశాడు. జాషువాకు తెలుగుమీద ఎంత పట్టుందో సంస్కృతం మీదకూడా అంతే పట్టువుంది. అనేక సందర్భాల్లో తత్సమ పదాలను కూడా తెలుగు ఛందంలోకి సొబగు పొదిగాడు. మత్తేభంలో, సభరనమయవ, శార్దూలంలో, మసజసతతగ, గణాలుంటాయి. ప్రతిగణంలో రెండు దీర్ఘాక్షరాలు వస్తాయి. అందుకు తెలుగు కవులు తత్సమ పదాలనే తెచ్చుకొంటారు. కాని, జాషువా చాలా తెలివిగా తెలుగు పదాలని మత్తేభ, శార్దూల ఛందస్సుల్లోకి కూడా తీసుకొచ్చి పొదుగుతాడు. ప్రతి పద్యాన్ని ఆయన చెక్కే విన్నాణంలో తెలుగు పదాల నైగనిగ్యాన్ని తీసుకురావడానికి ఎంత ప్రయత్నిస్తాడో మనకు అర్థం అవుతుంది.

*ఒక్కొక్క పద్దియంబున*
*కొక్కొక బంగారు రూక యొసఁగెదను కవీ!*
*మక్కా మసీదు తోడని*
*వక్కాణించెన్ మహాసభా మధ్యమునన్.*

*(జాషువా రచనలు 2వ సంపుటి)*

తెలుగు సాహిత్యంలో కందపద్యం అజరామరమైంది. తిక్కన్న కూడా కందపద్యాన్ని

మహాభారతంలో చాలా ప్రాధాన్యమున్న చోట వాడాడు. ఆ తరువాత అంత ప్రాధాన్యాన్ని జాషువ కంద పద్యానికి ఇచ్చాడు. తెలుగు ఛందస్సులో 'కందాన్ని' రారాజుగా చెబుతాం. సంస్కృత కళాశాలల్లో తెలుగు వ్యాకరణాలు, ఛందస్సులు బోధించే సమయంలో కంద పద్యానికి ఒక ప్రత్యేకతను ప్రకటిస్తాం. కందపద్యాల్లోని 'ప్రాస'లో తెలుగు పదాల నిగారింపు మనకు నిక్షిప్తమై వెలుగొందుతుంది. అందుకే జాషువ చాలా కీలకమైన సందర్భంలో ఈ 'కందాన్ని' శిల్పించాడు.

*మానవేంద్రుని సత్యవాగ్దానమునకు*
*హృదయ గోచరమగుచు వర్ధింపరాని*
*యద్భుతావేశ మంగంబునాక్రమించె*
*స్వాంతనమున దోచె నూత్న, నిసర్గ కవిత*
*(అదే పుస్తకం – 47వ పేజి)*

రాజు వాగ్దానంతో కవికి గొప్ప ఆవేశం వచ్చింది. మనస్సులో 'దోచె' కొత్తదైన కవిత్వం.ఈ మొత్తానికి ఆయువు 'దోచె' అనే తెలుగు క్రియ. తెలుగుభాషలోని గొప్పతనం ఇదే. తెలుగు చాలా సంక్షిప్తమైన భాష. ఒక్క క్రియాపదంతోటే మొత్తం భావాల్ని చెప్పవచ్చు. తిను, పండు, లే, రా, పో, ఇవన్నీ ఒకటి రెండక్షరాల్లోనే విషయాన్ని వ్యక్తం చేస్తాయి. తెలుగు అంతరించి పోతుందని అనుకునేవాళ్ళంతా తెలుగు క్రియాపదం జీవన సూత్రాలను ఎలా చెప్పిందో తెలుసుకోవాల్సివుంది. 'లే' కునుకు తీయుట, మేను, కళ్ళవుని కడుగుకొనుట, ఈ పదాలు తెల్లవారు జామున లేచేవారికే ఉపకరిస్తాయి! పొద్దు పొడిచాక లేస్తే ఉపకరించవు. ఒక్కొక్క పద్యానికి ఒక్కొక్క బంగారు నాణం ఇస్తాననే వాగ్దానంతో కవితావేశపరుడై పిరదౌసి గ్రంథాన్ని రాయడానికి ప్రారంభించాడు. జాషువాకవి ఆ పారసీకవి కృషిని తెలుగునుడులతో ఎలా అలంకరిస్తున్నాడో చూడండి...

*'పారసీక గ్రంథ భండారములనెల్ల*
*గదిలించి తీయని పదము లేరి*
*వ్యంగ్యవాచ్యార్థ మహాంబోనిధానంబుఁ*
*దరచి ముత్యములు రత్నములు గూర్చి*
*లలితంబులైన యలంకారముల నెల్లఁ*
*బొరలించి మేలైన సరకులెత్తి*
*దిరిసెనపుం బూవు కరణి ముద్దులుగారు*
*శయ్యావిలాసంబు సంతరించి*

*శాసనము లన్ని పరికించి సకల రాజ*
*చరితలం దింత సత్యంబు జాఙనీకు*
*ఆర్యసన్నుత షాహనామాభిదాన*
*భాసుర గ్రంథరచన కుపక్రమించె'.*
*(అదే పుస్తకం పుట 42)*

జాషువా ఈ పద్యంలో తెలుగు పదాలను, క్రియా పదాలను ఎలా 'ఎల్ల కదిలించి', 'తియ్యని పదములేరి', 'తరచి', 'ముత్యములు రత్నములుకూర్చి', 'ఎల్లబొర్లించి' 'మేలైన సరుకులెత్తి', 'దిరిసెన పూకరణి', ముద్దులుగారు', 'సంతరించి', అని 'ఉపక్రమించె'తో పద్యం ముగిస్తాడు.

ఈ కావ్యానికి నాయకుడు పారసీక కవి కాని తెలుగు పదాల నగారాను ఆధునిక కవిత్వం రాసే పద్ధతిలో జాషువా మ్రోగించాడు. పొర్లించి మేలైన సరుకులెత్తడం తెలుగువారి సంస్కృతి.

గుర్రం జాషువ సినిమా రాయడంకోసం వారివూరు గుంటూరుజిల్లా వినుకొండ దగ్గర చాట్రగడ్డపాడు – జాషువ మనవడు సందేశం, నేను వెళ్ళాం. జాషువ కుమార్తె 'హేమలతా లవణంగారు, యాదవులకు దళితులకు కలిపి కాలనీ కట్టించారు. ఎస్సి, బిసిలు కలసిన కాలనీ అది. జాషువగారి తండ్రి వీరయ్య. యాదవ, తల్లి దళితురాలు. జాషువగారిని చూసినవారంతా ఆయన బాగా నవ్వించేవాడని ప్రతిమాటలో ఒక హాస్యోక్తి ఉంటుందని, అన్ని తరగతులవారితో ప్రేమగా ఆత్మీయంగా ఉండేవాడని, మృదుహృదయుడని కథలు కథలుగా చెప్పారు. జాషువ పిరదౌసిలాగే అనేక కష్టాలు పడ్డాడు.

అన్ని కష్టాల్లో కూడా జాషువ తెల్లని పంచెకట్టుకొని ఖద్దరు చొక్కా వేసుకొని నీటుగా వుండేవాడు. జాషువ పదహారణాల తెలుగు వాడిలా జీవించాడు. కులమతభేదాలు లేవు. వ్యక్తులను వారి వ్యక్తిత్వాని బట్టే గౌరవించేవారు అని అక్క హేమలత చెప్పారు. జాషువ వ్యక్తిత్వమే పిరదౌసి, స్వప్నకథ, అనాథల్లో ప్రతిఫలించాయి.

*మత పిచ్చిగాని వర్ణో*
*న్నతి గానీ స్వార్థచింతనముగానీ నా*
*కృతులందుండదు, శబ్దా*
*కృతి బ్రహ్మానంద లక్ష్మి నృత్యమొనర్చున్*
*(కొత్తలోకం – పేజీ 18)*

జాషువ ఏదైనా ఒక సందేశం ఇవ్వదలచుకొన్నపుడు కందపద్యంలో సూక్ష్మంగా చెప్పేవాడు. మత పిచ్చికి, వర్ణోన్నతికి వ్యతిరేకంగా ఆయన జీవితాంతం పోరాడాడు.

మహాకవి గుర్రం జాషువ సామాజిక ఆర్థిక అసమానతలపై పోరు సల్పిన సాంఘిక విప్లవకారుడు. ఆయన అనాథలో ఒక అనాథ స్త్రీ గుండెకోతను దుర్భర దారిద్ర్యాన్ని, జీవన సంక్షోభాన్ని మన కళ్ళకు కట్టినట్లు చూపించారు.

*'ఎవడారగించు నమృత భోజనంబున*
*గలిసెనో యీ లేమ గంజిబువ్వ*
*ఎవడు వాసము సేయు శృంగార సౌధాన*
*మునిగెనో యిన్నారి పూరిగుడిసె*
*ఎవని దేహము మీది ధవళాంబరములలో*
*నొదిగెనో యిన్నాతి ముదుక పంచె*
*ఎవడు దేహము సేర్చు మృదుతల్పములలోన*
*నక్కెనో యీ యమ్మ కుక్కి పడక*
*వసుధపై నున్న భోగ సర్వస్వమునకు*
*స్వామిత వహించి మనుజుండు ప్రభవమందు*
*నెవడపహరించె నేమయ్యె నీమె సుఖము*
*కలుష మెఱుగని దీని కొడుకుల సుఖము?'*
*(సాంఘిక విప్లవ రచయితలు 'డా॥ కత్తిపద్మారావు, పే.123, లోకాయత ప్రచురణలు)*

ఈ పద్యంలో ఉద్దేశించిన దళిత స్త్రీని 'యీ లేమ', 'యిన్నారి', 'యిన్నాతి', 'యీయమ్మ' అని అచ్చంగా తెలుగులో సంబోధించాడు. ఆమె జీవన విధానంలోని 'గంజిబువ్వ', 'పూరిగుడిసె', 'ముదుక పంచె', 'కుక్కిపడక' పదాలతో ఆమె పేదరికాన్ని బొమ్మ కట్టించాడు. ఇక తెలుగు క్రియా పదాలను ఈ పద్యంలో ఒడిసి పట్టాడు. 'గలిసెనో', 'మునిగెనో', 'నొదిగెనో', 'నక్కెనో', అని చాలా గొప్పగా మట్టితో బొమ్మ చేశాడు. ఎవడు అపహరించె నేమయ్యె ఈమె సుఖము – అని ప్రశ్నించాడు. అనే పద్యం తెలుగు సాహిత్యానికే మకుటమైంది. కరుణరసార్ద్రకమైంది కూడా. మానవతా దీప్తి ఈ పద్యంలో కన్పిస్తుంది. తెలుగు జీవనంలోని ఎత్తుపల్లాలు, ధనిక పేదవర్గాల తారతమ్యాలు, పేదరికం గుండెల్లో దాగిన భాషా నిధులు మనకు ఈ పద్యంలో కన్పిస్తాయి. ఒకపక్క పేదలు, అనాథలు, అన్నార్తులై జీవిస్తుంటే, మరోపక్క సోమరులు దేశ శ్రమ సంస్కృతిని అపహాస్యం చేస్తున్నారు.

కవి ఎంత రసార్ద్రుడో అంత వ్యంగ్య భాషా చతురుడు.

*'త్రావుచున్న రెండ మావులలో నీరు*
*వెడగులై నాలుకల్ పిడుచగట్ట*
*తిరుగుచున్నారు కుందేటి కొమ్ములకయి*
*యాత్రికుల్ జరణంబు లరిగిపోవ*
*కూర్చుచున్నార(భ)కుసుమ మాల్యంబులు*
*జోగులై దేహముల్ స్రుక్కిపోవ*
*సృష్టించుచున్నార సికములో తైలంబు*
*ముగ్ధులై తలకాయ బూజుపట్ట*
*తలంపులందు కొనని నెలవున్నదని పల్కు*
*వెఱ్ఱి మొఱ్ఱి కథలు విశ్వసించి*
*అట్టిచోటు దాచిపెట్టుకోవలదిట్లు*
*కష్ట పెట్టవలదు క్ష్మాతలమును'.*
*(కొత్త లోకము– జాషువ–పుట 23).*

మతోన్మాదం మీద ఒక సాంస్కృతిక యోధుడిలా యుద్ధం చేశాడు జాషువా. ఈ నాటికీ ఇదే పరిస్థితి ఆంధ్రదేశంలో, దేశవ్యాప్తంగానూ కన్పిస్తుంది. ఏ జాతి అయినా శ్రమ జీవితోనే సంపన్నం అవుతుంది. శ్రమ సంస్కృతిని అపహాస్యం చేసే దేశంలో కరువు కాటకాలు రాక తప్పదు. పనిచేసే వారిసంఖ్య తగ్గిపోతోంది.

స్వాములు, యోగులు, బాబాలు, పీఠాధిపతులు, రామాయణ, భారత, భాగవత ప్రవక్తలు ఎక్కువైపోయారు. అన్యమతాలలోను బోధకుల సంఖ్య పెరుగుతోంది. ఇది సోమరులను పెంచడానికి పనికి వస్తుంది. విద్యా బోధనలో వ్యక్తిత్వ నిర్మాణం, సామాజిక జీవనం, సంస్కృతిపై అవగాహన లేదు. మూఢ విశ్వాసాలతో మనిషిని నిర్వీర్యం చేసే అంశాలే ఎక్కువ నేర్పుతున్నారు.

ఈ పద్యంలో 'పిడచగట్ట', 'కుందేటి కొమ్ములు', 'జోగులు', 'స్రుక్కిపోవ', 'ఇసుములో తైలంబు', 'బూజుపట్టుట', వెట్టి మొట్టి ఇలా తెలుగు పదాలతోనే మతోన్మాద సోదరులను ఎండగట్టాడు. తెలుగులో వ్యంగ్య పదాలు ఎక్కువ. పల్లెటూరులో ఎక్కువ వ్యంగ్య పదాలతోటే ఎవరినైనా తూర్పారబడతారు. జాషువా కవిత్వంలో తత్వశాస్త్రం తొణికిసలాడుతూంటుంది. కాందిశీకుడులో మనిషి మరణంలోనే తాత్విక అంశాలను అద్భుతంగా కళ్ళకు కట్టాడు.

జాషువా కవిత్వంలో అత్యున్నత గ్రంథమైన 'గబ్బిలం' తెలుగువారి ఆధునిక మహాకావ్యం. మను చరిత్రలో ప్రవరుడు, వసు చరిత్రలో వసురాజు, విజయ విలాసంలో అర్జునునికంటే కూడా గబ్బిలంలోని నాయకుడు పదహారణాల తెలుగువాడు. అందునా దళితుడు. దక్షిణ భూముల్లో కాపురమున్న 'పరమదరిద్రుడు'. అతని వ్యక్తిత్వం 'చిక్కిన కానుచే తనివి చెందు అమాయకత్వం' ఎల్లకష్టముల్ 'బొక్కుడుబువ్వ'తో మరచిపోవు క్షుధానల దగ్ధమూర్తి - అతడు. నల్దిక్కులు గులుగు లోకమున ధిక్కరియున్న అరుంధతీ సుతుడు' కవి ఇక్కడ దళితుని వ్యక్తిత్వాన్ని చెప్పాడు. కాని రూపురేఖలను వర్ణించలేదు. అతని అమాయకత్వం చెబుతూ 'బొక్కెడు బువ్వ' 'ఒక్కరి' వంటి వెలుగు పదాలతో అతని పేదరికాన్ని అస్పృశ్యతకు గురైన విధానాన్ని ఎత్తిచూపాడు ఈ కావ్యనాయకుని జీవన వర్తన గురించి చెబుతూ

*వాని రెక్కల కష్టంబులేనినాడు*
*సస్యరమ పండి పులకించ సంశయించు*
*వాడు చెమ్మటలోడ్చి ప్రపంచమునకు*
*భోజనము పెట్టువానికి భుక్తిలేదు. (గబ్బిలం)*

ఆటవెలది, తేటగీతుల్లో జీవన చిత్రాలు గీసినవారు వేమన, జాషువా. అతడు పని చేయకపోతే పంటలేదు. ఆ పంటలో అతనికి భాగం లేదు. ఈ రెండు మాటలలో భారతదేశ సామాజిక ఆర్థిక దోపిడీని ఎండగట్టాడు.

అభ్యుదయ కవులుగా పేరుబడ్డ శ్రీశ్రీ, ఆరుద్ర, నారాయణబాబు వంటి వారు కాని అంతకుముందు భావకవితోద్యమానికి ప్రతినిధులైన కృష్ణశాస్త్రి వంటివారు కాని, అస్పృశ్యతకు, పేదరికానికి ఉన్న అవినాభావ సంబంధంతో కవిత్వం చెప్పలేకపోయారు. జాషువ కాలంలో ఒకప్రక్క భావకవిత్వం, మరొకపక్క సంప్రదాయ కవిత్వం, మరోపక్క అభ్యుదయ కవిత్వం - మూడు పాయలుగా నడుస్తుండేవి. సాంప్రదాయ కవిత్వానికి విశ్వనాథ నాయకత్వం వహిస్తే, మిగిలిన శాఖలకు కృష్ణశాస్త్రి, శ్రీశ్రీ నాయకులు. అయితే వీరెవ్వరూ అస్పృశ్యత గురించి ప్రస్తావించకపోవడం ఆశ్చర్యం. సమకాలీన సమాజానికి కవిత్వం అద్దం పట్టాల్సింది. కవి హృదయశైలీ విధానాలను బట్టే వారు నాయకులయ్యారు. వారందరూ బ్రాహ్మణులే కావడం మరింత ఆశ్చర్యం. శూద్రుల్లోకి వచ్చేసరికి తాపీ ధర్మారావు బ్రాహ్మణాధిపత్యం మీద తిరుగుబాటు చేశాడు. శూద్రకవులైన ఏటుకూరి వెంకట నరసయ్య, తుమ్మల సీతారామమూర్తి, కొండవీటి వేంకటకవి, కొత్త సత్యనారాయణ కవులు తమ కులాలను దాటి అస్పృశ్యత మీద రాయలేకపోయారు. జాషువా గబ్బిలం రాయకుండా వుంటే- అస్పృశ్యునిగాథ శక్తివంతంగా, ప్రతిభావంతంగా శిల్పించబడేది కాదు. 'గబ్బిలం' అనే శీర్షిక పెట్టడంలోనే కవి సాహసాన్ని ప్రదర్శించాడు. తెలుగు సాహిత్యం అంతా వర్ణాధిపత్య, కులాధిపత్య ధోరణులలో ఉన్నపుడు గబ్బిలాన్ని వ్రాయడం సాహసకృత్యమే.

*'ఏనాడు మా కావ్య సృష్టికర్తల జిహ్వా*
*విశ్వసత్యము నాలపింప గలదొ...*
*అట్టి శుభవేళకై కొంగుబట్టి నిలిచి*
*నలిగిపోవుచున్నది నా మనస్సు' (గబ్బిలం)*

అని కవి వ్యథ చెందుతాడు. కల్మషపూరితమైన మనస్సులు సంస్కృతం, ఇంగ్లీషు, ఉర్దూనుంచి అనువదించుకోవడంకాక, ఒక కండగల కావ్యం రాసినవాడు తెలుగు నేలలో కరువైనపుడు జాషువా తెలుగువారి గుండె సొదలనుండి 'గబ్బిలం' కావ్యాన్ని బయటకు తీశాడు. ఆనాటినుండి ఈ నాటి తెలుగు వారిని భారతీయులను పట్టిపీడిస్తున్న వర్ణ, కుల, మత దురాచార భావన దుయ్యబట్టడమే గాక దక్షిణ భారతంలోని శిల్ప, కళాఖండాలనన్నీ దృశ్యీకృతం చేసి తెలుగుజాతీయతకు ఎల్లలు చెరిపివేశాడు. జాషువలోని ఈ కథన పద్ధతి తెలుగువారి ఇండ్లలో వున్నదే. మరీ ముఖ్యంగా దళితుల ఇండ్లలో ఇది నిరంతర కథనం. గుడిసెల్లో జీవనం, కుక్కిమంచాలు, మనవళ్ళనేసుకొని తాతయ్యలు, నానమ్మలు పండుకోవడం నిరంతర కథలు. ప్రేమలు, ఆత్మీయతలు, తను తినకుండా మనవడికి తినిపించడం, బెల్లం, గనిసిగడ్డలు, పిట్టు, కుడుతులు ఒకటేమిటి ఉన్నంతలో తెలుగు వంటకాలతో దళితులు తమ వారసుల్ని ప్రేమలో ముంచుతారు. అందుకే దళితుల్లో కవిత్వం పుట్టుకతోనే వస్తుంది. వెన్నెల, చీకటి నక్షత్రాలు, గుడిసెలు, తట్టలు, బుట్టలు, చేలు, బురదమట్టలు, చందరాలు, వాలిగలు, అయ్యా, అమ్మా సంబోధనలు అనంతమైన ప్రేమ సామ్రాజ్యంలో మేమంతా పెరిగాం. ఆప్రేమలు, ఆత్మీయతలు, తెలుగు జీవన విధానాలు అక్షరాల్లోకి తీసుకురావడం చాలాకష్టం. ఆపనిని జాషువ మొదట చేశాడు. ఆ తరువాత పుంఖానుపుంఖాలుగా దళిత కావ్యాలు, నవలలు, నాటికలు, కథలు, గల్పికలు, కవితాఖండికలు, దీర్ఘ కవితలు వస్తున్నాయి. ఈ దళిత కవితాయుగానికి జాషువ ఆధునికకర్త. ఆ చోటు విస్తృతమవుతోంది. మహాకవి జాషువ కోరుకొంది ఒక్కటే-

*భోగులాహారించు భుక్తి కన్నుల జూచి*
*పరమపేదలు దుఃఖపడని చోటు*
*సాంఘికాచార పంచాస్యగర్జనమున*
*బెదరక జ్ఞానంబు పెరుగుచోటు*
*జాతి వైషమ్య రాక్షస పదాహతిజేసి*
*కందకళలు పెంపొందుచోటు*
*పరిపాలక క్రూరతర కరాసికిలొంగిపోక*
*స్వేచ్ఛాలక్ష్మి పొదలుచోటు*
*అనదబిడ్డలు చూడ నెయ్యంపుసుతుల*
*ముద్దులాడని గుణనిధుల్ బుట్టుచోటు*
*చెప్పగదవమ్మ చూచివచ్చితివె నీవు*
*నిశ్చయంబుగ వాసముండెదను నేను*
*(గబ్బిలం)*

ఇంకా తెలుగు నేలలో, అస్పృశ్యతా కల్మషం రూపుమాయలేదు. జాషువా కోరిన 'పేదలు దుఖపడని చోటు', 'జ్ఞానం స్వేచ్ఛగా పెరుగుచోటు', స్వేచ్ఛాపక్షి పొదలుచోటుగా తెలుగు నేల ఆవిర్భవించాలంటే వర్ణ, కుల, మత ఆధిపత్యాలు తొలగిపోవడానికి సాంఘిక సాంస్కృతిక ఉద్యమం నిరంతరం కొనసాగాలి. ఏ కులానికి ఆ కులం కాకుండా, తెలుగువారందరూ తమలోని వైషమ్యాలను తొలగించుకొని ఒకసామాజిక సాంస్కృతిక జాతిగా వెలుగొందడానికి కృషి చేయవలసిన చారిత్రక సందర్భం ఇది. జాషువ పుట్టి 120 ఏండ్లు అవుతున్నా ఆయన కలం పట్టి 100 ఏళ్ళు అవుతున్నా ఆయన చెప్పిన కులరహిత సమాజం ఆవిర్భవించలేదు.

*'కులమతాలు గీచుకొన్న గీతలజొచ్చి*
*పంజరాన కట్టువడనునేను*
*నిఖిలలోకమెట్లు నిర్ణయించిన నాకు*
*తిరుగులేదు, విశ్వనరుడ నేను'*

అన్నాడు జాషువ. ఆయన ప్రతిననుసరించి తెలుగు కవులు, సాంస్కృతిక యోధులు, సామాజిక విప్లవకారులు, తెలుగుజాతిని, సంస్కృతిని చరిత్రను పునరుజ్జీవింపజేసే కృషిలో ముందుకు నడవాలి.

**రచయిత ఫోన్: 9849741695**

మరచిపోతున్నాం...4

- డా॥ ఈమని శివనాగిరెడ్డి
- డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి

## మంగళగిరి సమీపంలోని

# నిడమఱ్ఱు ఒకప్పటి బౌద్ధక్షేత్రమే!

**సీఆర్‌డిఏ పరిధిలోని గ్రామాల చరిత్ర అధ్యయనం చేస్తున్నకొద్దీ కొత్త విషయాలు వెలుగులోకొచ్చి చరిత్ర పరిశోధకులను, పురావస్తు శాస్త్రవేత్తలను ఉక్కిరిబిక్కిరి చేస్తున్నాయి. నిన్న, మొన్నటిదాకా నిద్రిస్తున్న పల్లెపట్టులు, కొత్త రాజధాని పుణ్యమా అని ఉలిక్కిపడిలేచి, తమలోకి తాము చూచుకొంటూ ఘనకీర్తిని సంతరించుకొంటున్నాయి. ప్రతిపల్లె, నాకూ ఒక చరిత్ర ఉంది అని మురిసిపోతూ, పొత్తిళ్లలో దాచుకొన్న శాసనాల్ని, శిల్పాల్ని, ఆలయాల్ని, కైఫీయత్తుల్నీ, చారిత్రక గాథల్నీ ఒక్కొక్కటిగా కుమ్మరిస్తున్నాయి. చరిత్రకారుల మనసుల్ని పులకింపజేస్తున్నాయి. చరిత్రకు సంబంధించి కొత్త విషయాలు వెలుగులోకొచ్చినపుడల్లా గ్రామస్తులుసైతం ముచ్చటపడి, గతకాలపు వైభవ ప్రాభవాలకు చిహ్నామైన శిల్పాలు, శాసనాలు, చారిత్రక స్థలాలు, కట్టడాలను కంటికి రెప్పలా కాపాడుకొంటున్నారు. చుట్టుప్రక్కల గ్రామాల వారితో తమ చరిత్రను గర్వంగా పంచుకొంటున్నారు. అదిగో ఆ కోవకు చెందిన గ్రామమే మంగళగిరి సమీపంలోని నిడమఱ్ఱు. 100 ఏళ్ల తరువాత మళ్లీ 7వ శతాబ్ది శాసనాన్ని, మధ్యయుగాలనాటి బౌద్ధ శిల్పాల గురించి కొందరు పేరుమోసిన చరిత్రకారులు మరచిపోయిన విషయాలను 'మరచిపోతున్నాం' శీర్షికన తెలియజేస్తున్నారు రచయితలు.**
**- ఎడిటర్**

నిడమఱ్ఱు గురించి, 1883లో గార్డన్ మెకంజీ 1915-16 లో హుల్జ్, 1925లో మల్లంపల్లి సోమశేఖర శర్మ, అటు తరువాత 2015లో యార్లగడ్డ బాలగంగాధరరావు పేర్కొన్న చారిత్రక విషయాలు ఆసక్తిని కలిగిస్తున్నాయి. 1883లో గార్డన్‌మెకంజీ 'ఎ మాన్యువల్ ఆఫ్ ది కృష్ణా డిస్ట్రిక్టు ఇన్ ది ప్రెసిడెన్సీ ఆఫ్ మద్రాస్' అనే గ్రంథంలో గుంటూరునుంచి తాడికొండ మీదుగా, కొండపల్లికి, ఉత్తరాది పుణ్యక్షేత్రాలకు వెళ్లేదారికి, కుడివైపుగా నిడమఱ్ఱు గ్రామం ఉందనీ, 1816లో ఈ ప్రాంతాన్ని పరిశీలించిన సర్వేయర్లు, ఆ ఊరి పొలాల్లో ఒక జైన విగ్రహం, రెండు బుద్ధ విగ్రహాలు నిర్లక్ష్యంగా పడి ఉన్నాయని చెప్పారని రాశాడు. ఇది చదివిన తరువాత నిడమఱ్ఱును చూడాలనిపించింది.

ఇంతలో సీఆర్‌డిఏ కమీషనర్ డా॥ నాగులపల్లి శ్రీకాంత్ కోరిక మేరకు ది కల్చరల్ సెంటర్ ఆఫ్ విజయవాడ సిఈవో డా॥ ఈమని శివనాగిరెడ్డి నేతృత్వంలో పురావస్తుశాఖకు చెందిన జోస్ దిలీప్, ఆచార్య నాగార్జున యూనివర్సిటీ పరిశోధక విద్యార్థి మారుతి, సొసైటీ ఫర్ ప్రిజర్వేషన్ ఆఫ్ ఆర్కియోలజికల్ రిమైన్స్ అండ్ కల్చరల్ హెరిటేజ్, వ్యవస్థాపక అధ్యక్షులు కడియాల వెంకటేశ్వరరావుల బృందంగా నిడమఱ్ఱు గ్రామ పరిసరాల్లో విస్తృత పరిశోధనలు జరిపి, ఇంతవరకూ అందుబాటులోకిరాని కొత్త చారిత్రక విషయాలనూ తవ్విన మట్టిలో ఇటుక రాతిముక్కలు, ఎరుపు, ఎరుపు-నలుపు మట్టిపాత్రలు, మట్టి పూసలు బయల్పడి గ్రామచరిత్రను క్రీ.శ.1-2 శతాబ్దాలకు (శాతవాహన కాలానికి) తీసుకెళ్లాయని ఆ బృందం కనుగొంది.

శాతవాహనుల తరువాత గ్రామ చరిత్ర గురించి ఆరా తీయగా, తీయగా ఒక తియ్యని కబురు అందింది. ఇక్ష్వాకు, విష్ణుకుండినుల కాలపు ఆనవాళ్లు చిక్కలేదుగాని, ఆ వూరికి సంబంధించి, తూర్పు (వేంగీ) చాళుక్య రాజ్యస్థాపకుడైన (కుబ్జ) విష్ణువర్ధనుని కొడుకైన మొదటి జయసింహుడు క్రీ.శ. (641-673) విడుదల చేసిన రాగిరేకు శాసన మొకటుందని తెలిసింది. తీగ లాగితే, ఈ శాసనం, కృష్ణా జిల్లా, గుడివాడ తాలూకా, చవుటపల్లి గ్రామానికి చెందిన చింతలపాటి వెంకయ్య శాస్త్రి ఇంట్లో ఉండగా, వేటూరి ప్రభాకరశాస్త్రి ఆ శాసనాన్ని సేకరించి,

**మొదటి జయసింహవల్లభుని నిడమఱ్ఱు శాసనము**
**మొదటిరేకు- రెండవ ప్రక్క**



౧ స్వస్తిశ్రీ మదసనపురవానకాత్ స్వామిమహాసేవపాదానుధ్యాతానాం హారితీ
పుత్రాణాం మానవ్య
౨ సగోత్రాణాం మాతృగణ పరిపాలితానాం అశ్వమేథయాజినాం చలుక్యానాం విశుద్ధవంశోద
3 యగిరిశిఖరోదితక్షితిపత్యహిమదీధితేః సకలజగదాత్తి (ౡ*) హరకర్మౡణః
౪ శ్రీకితి వమ(ౡ*) ౡణః ప్రియవప్తా శశలాఞ్ఛనస్యేవ సకలజగన్ధునో(?) నయ నాన
౫ న్ద(న)కరన్య స్వరూప లావణ్యావర్జిౡత మకరధ్వజన్య మకరధ్వజాపరసామ్నః శ్రీమ ద్రైదంయుగీవ
౬ విష్ణోః విషణు వర్ధౡనమహారాజన్య ప్రియతనయః ప్రవర్ధౡమానోదయప్రతాపోపనతసమ

మానవల్లి రామకృష్ణ కవి ద్వారా, 1915-16లో మద్రాస్‌లోని గవర్నమెంట్ శాసన విభాగానికి చేరినట్లు ఆచూకీ దొరికింది. అప్పటి లిపిలో, సంస్కృత భాషలోనున్న మూడు రేకులుగల ఈ శాసన ముద్రికపై 'శ్రీ సర్వసిద్ధి' (మొదటి జయసింహుని బిరుదు), చంద్రవంక, కింద పద్యమూ చెక్కి ఉన్నాయి.

శాసన ప్రదాత అయిన జయసింహుడు బాదామీ చాళుక్య రాజైన కీర్తివర్మ కొడుకు, నయనానందకరుడు, మన్మథుని మించిన రూపలావణ్యంతో మకరధ్వజుడనే మరో పేరుగల (కుబ్జ) విష్ణువర్ధన మహారాజు ప్రియ పుత్రుడు, పరమ బ్రాహ్మణ్యుడైన శ్రీ జయసింహ వల్లభ మహారాజు, ఈ శాసనాన్ని అసనపురంలో విడిది చేసినపుడు

౧౩ స్య సపదక్రమానుక్రమాధీతవేదద్వయస్యసకల్పోపనిష త్పురాణేతిహాసానేక ధర్మశాస్త్ర

౧౪ విదః మణ్డశర్మణః పౌత్రాయ స్వపితురధికగుణసంపద్గణా ర్జితనిర్మలయశోవిశే

౧౫ షేణ ఆత్మనోప్యయ మలమలంకరిష్ణోః అగ్నిష్టోమయాజినః శివరుద్రశర్మణః

౧౬ పుత్రాయ ద్వివేదాధ్యాయినే యజ్ఞాగమోపనిషన్మన్త్రార్థేతిహాసపురాణధర్మణః

౧౭ శాస్త్రవిమలీకృతవితతమతయేహారీతసగోత్రాయ తైత్తిరీయస బ్రహ్మచారణే కాటిశర్మణే

iib.



విదుదల చేశాడు. దాన గ్రహీత కాటిశర్మ (తెలుగుపేరు), రెండు వేదాలు చదివి (ద్వివేదుల అని ఇపుడంటున్నారు!), ఉపనిషత్తులు, పురాణాలు, ఇతిహాసాలు, అనేక ధర్మశాస్త్రాలు తెలిసిన మణ్డశర్మ (ఇదీ తెలుగు పేరే) మనుమడు, అగ్నిష్టోమయాజి శివరుద్రశర్మ కొడుకు, రెండు వేదాలు చదివి, యజ్ఞ, ఆగమ, ఉపనిషత్తులు మంత్రార్థాలు, ఇతిహాసాలు, పురాణాలు, ధర్మశాస్త్రాలు తెలిసిన, తైత్తిరీయ బ్రహ్మచారి అయిన కోటిశర్మ గణ్డేఋవాటి విషయంలోని వ్యాఘ్రునదికి ఉత్తరాన, పన్నేఋనదికి ఒడ్డునగల గణ్డేఋ (గుంటూరు జిల్లా కంతేరు) రాజధానికి తూర్పుగా, రెండు గవ్యూతుల (4 కోసుల) దూరంలోగల నిదుబఋ (నిడుపఋ) గ్రామాన్ని సర్వబాధాపరిహారంగా దానం చేసినట్లు నిడుమఋ్ఱ గ్రామస్తుల (కుదుంబినులు)ను సమావేశపరచి ఆజ్ఞాపించాడు. కార్తీకపౌర్ణమి రోజున దానం చేసినట్లు మాత్రమే ఉంది తప్ప, ఏ సంవత్సరమో లేకపోవటం వల్ల జయసింహుడు పాలించిన క్రీ.శ.631-673 సం॥ల మధ్య కాలంలో ఎప్పుడో ఈ శాసనాన్ని ఇచ్చాడని తప్ప ఏమీ తెలియటంలేదని 1925, మేనెల, భారతిమాసపత్రికలో మొదటి జయసింహ వల్లభుని నిడమఋ్ఱ శాసనం అనే వ్యాసంలో మల్లంపల్లి సోమశేఖరశర్మ తెలిపిన సంగతిని ఈ సందర్భంగా గుర్తు చేసుకోవాలి.

1929, జూలైలో జరిగిన ఆంధ్రా హిస్టారికల్ సొసైటీవారి మూణ్ణెల్ల సమావేశంలో రాళ్లబండి సుబ్బారావు, తూర్పు చాళుక్యరాజు మొదటి జయసింహుని పులింబూరు శాసనంపై చేసిన ప్రసంగంలో, జయసింహుడు విడుదల చేసిన కొంబఱ్రు, మోపఱ్రు, నిడపఋ్ఱ శాసనాలతోపాటు నిడమఋ్ఱ రాగిరేకు శాసనాన్ని గురించి కూడా ప్రస్తావించారు. నిడమఋ్ఱ శాసనాన్ని 'నిడుపఋ గ్రాంట్ ఆఫ్ జయసింహ-1' అన్న పేరుతో 'ఎపి గ్రాఫియా ఇండికా' (వాల్యూం XVIIII పేజీలు 55-58)లో ఇ. హుల్ట్జ్ ప్రచురించిన విషయాన్ని గుర్తు చేసుకోవాలి. నిడమఋ్ఱ శాసన పాఠంలో గ్రామాన్ని ఒకసారి నిడపఋ' అనీ, మరోసారి 'నిడబఋ్ఱ' అని ప్రస్తావించటం గమనించాల్సిన విషయం.

గ్రామంలో ఇతర శాసనాలు ఏమీ లేనప్పటికీ, క్రీ.శ. 1558నాటి

౭ న్త సామన్తమకుటతటఘటిత మణిమయూఖమఞ్జరీపుంజపింజరిత చరణారవిన్దయుగలః నిజ

౮ గుణదీధితికలాపకలియుగధ్వాన్తనిరాకరిష్ణుః అఖణ్డల ఇవాఖణ్డిత పౌరుషః ప

౯ రమబ్రహ్మణ్యో మాతాపితృపాతానుధ్యాతః శ్రీజయసింహవల్లభ మహారాజః గణ్డే

౧౦ ఋవాట్యాం వ్యాఘ్రునద్యా శ్చోత్తరతః పన్నే ఋనద్యాశ్చ తీరే గణ్డేఋరాజ ధాన్యాః

౧౧ పూర్వదిగ్విభాగే గవ్యూతద్వయే నిదుబఋనామగ్రామ మధివసతః కుదుంబినః సమవేతా

౧౨ నాజ్ఞాపయతి విదితమస్తు వో యథాసనపురస్థావనివాసెనో ఘటికాసామాన్య

iia.



ఒక శాసనంలో, విజయనగరంలో శ్రీ వీరప్రతాప సదాశివ మహారాయలు రాజ్యం చేస్తుండగా, కొండవీటిని పాలిస్తున్న సిద్ధిరాజు ఔబిళరాజు కొడుకు, తిమ్మరాజయ్య దేవ మహారాజులు, మంగళగిరిలోని లక్ష్మీ నరసింహస్వామికి నిడమఋ్ఱ గ్రామంలో కొంత భూమిని దానం చేసినట్లుందని ఆచార్య యార్లగడ్డ బాలగంగాధరరావు 2015లో వ్రాసిన 'నవ్యాంధ్ర రాజధాని గ్రామాల చరిత్ర' (పుట 43-44)లో పేర్కొన్నారు. అందుకు ఆయన దక్షిణ భారత శాసన సంపుటి-4లో శాసనసంఖ్య

౧౮ ఋనామగ్రామః (*) నాన్యబాధాకరణీయా (*) ఆజ్ఞప్తిరత్రార్య్యమనోభిరామః శ్రీచీయామా(ర్యస్సు?*)

౨౦ నావయోయం (*) భూపేన్ద్రనీతిప్రవిభాగదక్ష(వేదాజ్ఞవి)త్సర్వకలాన్తరజ్ఞః (*) ఆత్రవ్యాసగీతాః (*) స్వదత్తాం ప

౨౧ రదత్తాంవా యత్నాద్రక్ష యుధిష్ఠిర (*) (మహీం మ) హీమతాంశ్రేష్ఠ దానా చ్ఛ్రే యోనుపాలన(మ్॥ బహు*)

౨౨ బిర్వ్వసుధాదత్తా బహుభిశ్చానుపాలితా (*) యస్యయస్యయథా బూమి (స్తస్యతస్య*)

౨౩ తదాఫలః (*) షష్టిం వష సహస్రాణి స్వర్గ మోదతి భూమిదః (*) ఆక్షేప్తా చాను (మన్తాచ*)

౨౪ తాన్యేవ నరకే వ నేత్ (*).

iii.





శిల్పాలను పరిశీలిస్తున్న డాక్టర్ ఈమని శివనాగిరెడ్డి

789ని ఆధారంగా చూపించారు. అయితే ఈ శాసనం శాలివాహన శకం 1440 అంటే క్రీ.శ. 1518వ సం॥ నాటి శ్రీ కృష్ణదేవరాయలు పాలనా కాలానికి సంబంధించినదని తేలింది. అంతేకాక ఈ శాసనంలో ఎక్కడా నిడమఱ్ఱు గ్రామ ప్రస్తావనే లేదు. బహుశ రచయిత పేర్కొన్న శాసనసంఖ్య పొరపాటు కావచ్చు. గ్రామంలో విస్తృతంగా పర్యటించిన శివనాగిరెడ్డి బృందం ఊళ్లోని రెండో వాటర్‌ప్లాంట్ దగ్గర రోడ్డు ప్రక్కనే నిలబెట్టిన ఒక బుద్ధుని విగ్రహం, ఒక వైకుంఠ నారాయణుని విగ్రహాలను పరిశీలించింది. పద్మాసనంలో ధ్యాన ముద్రలో కూర్చొని ఉన్న బుద్ధ విగ్రహం నల్ల శాసనపురాతిలో మలచబడి నగిషీగా తీర్చిదిద్దబడింది. 4'-0 అడుగుల ఎత్తు 3-0 అడుగుల వెడల్పు ఉన్న ఈ బుద్ధుని విగ్రహం పై చీవరాలు (పారేసిన గుడ్డ పీలికలతో కుట్టుకొని ధరించిన వస్త్రాలు), పద్మాసనంలో ముడచుకొన్న రెండు కాళ్లపై ధ్యాన నిమగ్నతను సూచిస్తున్న రెండు చేతులు, ముఖంలో ప్రశాంతతతో కూడుకొన్న దుఃఖ విముక్తానందాన్ని చూడవచ్చు. పీఠంపైన చెక్కిన పద్మదళాలు, బుద్ధుని ప్రతిమా లక్షణం చూపరులను ఇట్టే ఆకట్టుకొంటాయి. సంయక్సంభోధిని సూచించే అగ్నికీలను బుద్ధుని తలపై చెక్కడం ఈ విగ్రహ ప్రత్యేకత. అమరావతి పరిసరాల్లో ఇలా తలపై అగ్నికీల ఉన్న బుద్ధుని బొమ్మ ఇంతవరకూ వెలుగులోకి రాలేదు. నెల్లూరుజిల్లా కుంతూరు, దామరవాయి గ్రామాల్లో దొరికిన బుద్ధ ప్రతిమలకు (ప్రస్తుతం ఇవి నెల్లూరు మ్యూజియంలో ప్రదర్శనలో ఉన్నాయి) తలపై అగ్నికీల ఉంది. నిడమఱ్ఱు బుద్ధ విగ్రహం శైలిని బట్టి అది చాళుక్య-చోళుల కాలానికి అంటే క్రీ.శ.11-12 శతాబ్దాలకు చెందినదని చెప్పొచ్చు. అమరావతిలోని అమరేశ్వరాలయంలో కోటకేతరాజు-II శాసనంలో బుద్ధదేవునికి ఇచ్చిన దాన వివరాలు ఉండటాన 11-12 శతాబ్దాల్లో ఈ ప్రాంతంలో బౌద్ధం ఆదరించబడినట్లు చెప్పుకోవచ్చు. ఈ కాలంలో నిడమఱ్ఱు ఒక బౌద్ధ కేంద్రంగా విలసిల్లి ఉంటుంది.

ఇదే విగ్రహం పక్కన సుఖాసనంలో కూర్చొని, అభయ, వరద ముద్రలతోనూ, శంఖు చక్రాలను ధరించిన కాకతీయుల కాలంనాటి (క్రీ.శ.13వ శతాబ్దం) వైకుంఠ నారాయణ విగ్రహంకూడా ఉంది. పద్మపీఠం, ప్రభామండలం, అంగసౌష్టవం కాకతీయ శిల్ప శైలికి అద్దం పడుతున్నాయి. పరిశీలించి చూడగా, గ్రామంలో దాదాపు 100-150 సం॥ల నాటి హనుమాన్ దేవాలయం (ఇటీవల మండపం కొత్త హంగుల్ని సంతరించుకొంది), స్వయం భూ మల్లేశ్వరాలయం (ఆధునీకరించబడింది) ఉన్నా, అక్కడ ఎలాంటి చారిత్రక శిల్పాలుగానీ, శాసనాలుగానీ లేవు.

నిడమఱ్ఱు గ్రామంలో శాతవాహన కాలపు ఆనవాళ్లు చాళుక్య-చోళుల కాలంనాటి బుద్ధుని విగ్రహం, కాకతీయుల కాలంనాటి వైకుంఠ నారాయణుని విగ్రహాల గురించి, ఈ వ్యాసం ద్వారానే తొలిసారిగా పాఠకుల దృష్టికి తీసుకురావటానికి ప్రోత్సహించిన 'అమ్మనుడి' పత్రిక సంపాదకులు డాక్టర్ సామల రమేష్‌బాబు గారికీ, నిడమఱ్ఱు శాసన పాఠాన్ని పంపించిన డా. కొండా శ్రీనివాసులుకు ధన్యవాదాలు.

ఆంధ్రదేశ చరిత్ర - సంస్కృతిపై వెలువడిన కొన్ని పుస్తకాలను తిరగేస్తే వేంగీ చాళుక్యులు లేక జయసింహుని గురించి రాసినపుడు నిడమఱ్ఱు శాసన ప్రస్తావనే లేదు. పి. శ్రీరామశర్మ 'ఆంధ్రదేశ చరిత్ర-సంస్కృతి' క్రీ.శ.1336 వరకు హైదరాబాదు, 1991, తెలుగు అకాడెమీ ప్రచురణలోని 'ఒకటో జయసింహుని' పై రాసిన భాగం (పుట 107-108)లోనూ, ఎం. సోమశేఖరరావు 'గుంటూరు జిల్లా సమగ్ర చరిత్ర-సంస్కృతి' ప్రథమ సంపుటం, గుంటూరు - 2004, పుట.160) లో జయసింహునిపై రాసిన భాగంలోనూ, ఏ.వీ. కోటిరెడ్డి 'ఆంధ్రదేశ చరిత్ర-సంస్కృతి హైదరాబాదు-2005?, కృష్ణా రెడ్డి పబ్లికేషన్స్)లో వేంగీ చాళుక్యులు' అనే అధ్యాయంలో కుబ్జ విష్ణువర్ధనుని తరువాతభాగం (పుట 37-38)లోనూ, ప్రొ. వకుళాభరణం రామకృష్ణ, ప్రధాన సంపాదకులుగా, ప్రొ. బి. రాజేంద్ర ప్రసాద్, సంపాదకులుగా వెలువడిన 'ఆంధ్రప్రదేశ్ సమగ్ర చరిత్ర-సంస్కృతి-III; తొలిమధ్యయుగ ఆంధ్రప్రదేశ్ క్రీ.శ. 624నుంచి 1000 వరకూ'లో, జె. దుర్గాప్రసాద్ వ్రాసిన వేంగీచాళుక్యులు' అనే మూడో అధ్యాయం (పుట 29-30)లోనూ, బి.యస్.ఎల్. హనుమంతరావు 'ఆంధ్రుల చరిత్ర', (10వ ముద్రణ, విశాలాంధ్ర ప్రచురణ, హైదరాబాదు, 2009) లో జయసింహ వల్లభుని ప్రస్తావన (పుట 147-148)లోనూ, ప్రొ. ఎల్లూరి శివారెడ్డి ప్రధాన సంపాదకత్వంలో వెలువడిన 'తెలుగువాణి: నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభల ప్రత్యేక సంచిక-2012, (హైదరాబాదు, 2012) లో డా. పి. అరుణ రాసిన బాదామీ చాళుక్యులు-వేంగీ చాళుక్యులు' అన్న అధ్యాయంలోనూ (33 ఏళ్లు పాలించిన జయసింహుని పేరే లేదు, అతని శాసనాల ఊసే లేదు) నిడమఱ్ఱు (నిడపఱు, నిడుబఱు) శాసనం గురించిన ప్రస్తావన లేనందువల్ల ఈ శాసనం గురించి ఈ తరం చరిత్ర అధ్యాపకులు, పరిశోధక విద్యార్థులకు ఉపయోగంగా ఉంటుందని మరచిపోయిన ఈ శాసనం గురించి మళ్లీ ఇపుడు రాయడం జరిగింది.

**డా॥ ఈమని శివనాగిరెడ్డి**, ఫోను: 9848598446
**డా॥ మొవ్వా శ్రీనివాసరెడ్డి**, ఫోను: 9490333488

తెలుగమ్మ ఒడిలో
బౌద్ధం - 7

- శ్రీ బొర్రా గోవర్ధన్

# కోస్తాతీరం రేవులు-బౌద్ధ ధమ్మ రాదారులు

**ప్రజల** జీవితంలో, జీవనంలో కలసిపోయిన ఏ ధర్మమైనా రెండు పనులు చేస్తుంది. ఒకటి: వారి సాంస్కృతిక వికాసానికి తోడుగా ఉంటుంది. వారి సంస్కృతిలో భాగమవుతుంది. రెండు: వారి జీవనాన్ని నూతన దారుల్లో నడిపిస్తుంది. వారి నాగరకతలో భాగస్వామి అవుతుంది.

ఇలా, ఈ రెండు పనులూ చేయగలిగిన ధర్మమే ఎన్ని ఒడిదుడుకుల్నైనా ఎదుర్కొని ఎంత కాలమైనా నిలబడుతుంది. ఆటుపోట్లకు తట్టుకొని అన్ని కాలాల్లో అజరామరంగా మనగలుగుతుంది. అమరమౌతుంది.

బౌద్ధం ఈ రెండు పనులూ చేసింది.

ఈ పనులకి అఖండ భారతంలో మన తెలుగునేల అగ్రగామిగా నిలచింది. అందుకే...తెలుగు జాతి చరిత్రను బౌద్ధం పునీతం చేసింది.

గతంలో మనం వ్యవసాయాభివృద్ధికి బౌద్ధం ఎలా తోడ్పడిందో రైతులకు ఎలా చేయూతనిచ్చిందో,వారి చేతిలో 'మేడి'గా మారి ఎలా తెలుగు నేలను సస్యశ్యామలంగా మార్చిందో కొద్దిగా చూశాం.

ఇక, ఇప్పుడు.... వ్యాపారాభివృద్ధికీ, దేశీయ, విదేశీయ వ్యాపార సంబంధాలకు, ఆర్థిక వృద్ధికి బౌద్ధం ఏం చేసిందో చూద్దాం.

**పల్లెలు-పట్టణాలు:** పల్లెలు, పట్టణాలు అనేవి రెండు రకాల జీవన వికాసాల్ని తెలిపే జన నివాసాలు. నదులు, సరస్సులు, సకాల వర్షాలు-ఇవ్వన్నీ సమృద్ధిగా ఉండే భూభాగాల్లో పల్లెలు పరిఢ విల్లుతాయి. స్థిర జీవనం, వ్యవసాయం, నింపాదిగా బ్రతకడం, పెద్దగా మార్పు కోరుకోని ఆలోచనలు పల్లె జీవనంలో ప్రధాల భాగాలు. భారతదేశ పల్లెలకి వీటన్నింటితోపాటు మరో లక్షణం కూడా ఉంది. అది, ప్రతి పల్లె 'స్వయం సంవృద్ధి కలిగిన' ఆర్థిక కేంద్రాలుగా ఉండడం.

పల్లె జీవనానికి అసరమైన సరుకుల ఉత్పత్తి అంతా పల్లెల్లోనే జరుగుతుంది. కుండల తయారీ, బట్టల నేత, చెక్క పనిముట్లు,లోహ సామాగ్రి, తోలు ఉత్పత్తులు, బుట్టలు అల్లడం, బట్టలు ఉతకడం, క్షురకర్మ, వ్యవసా పనిముట్ల తయారీ - ఇలా అన్ని రకాల ఉత్పత్తులకీ, పనులకీ సంబంధించిన పనివారు ప్రతి పల్లెలో ఉంటారు. అంటే.. ప్రతి పల్లె తనకు తానుగా మరో ప్రాంతంమీద ఆధారపడకుండా స్వయంసంవృద్ధి, స్వయం సంపద కల్గిన కేంద్రం అన్నమాట. ప్రపంచంలో ఇలాంటి పల్లె జీవనం చాలా దేశాల్లో ఉంది. తూర్పు ఆసియా, మధ్య ఆసియా, ఐరోపా దేశాల్లో కూడా ఇలాంటి పల్లెలు ఉన్నాయి. అక్కడా ఈ ఉత్పత్తులన్నీ చేసే వృత్తులవారూ ఉన్నారు. కానీ... దౌర్భాగ్యం ఏమంటే... మనదేశంలో ఈ వృత్తులవారు 'కులాలుగా' స్థిరీకరించబడ్డారు. ఇంకా అతి నీచ దౌర్భాగ్యం ఏమంటే... ఉత్పత్తి మూల కారకులైన వీరందరూ 'నీచ కులాలుగానే' ఎంచబడ్డారు.

ఇక్కడ జీవన వృత్తులు... నైపుణ్యం మీద కాక, వంశపారంపర్య హక్కులుగా మారాయి. కుల చట్రాన్ని దాటి పోలేక పోయాయి.

అంటే... భారతదేశంలో కులవ్యవస్థను బ్రతికించే కేంద్రాలుగా గ్రామాలు మారాయి అన్నమాట.

ఇక్కడ... గ్రామం బ్రతికిందంటే.. 'కులం' బ్రతికినట్టే.....

**బౌద్ధం - ఎదురీత :** అందుకే... వ్యవసాయాభివృద్ధికి ఎంతో విశాల ప్రాతిపదికను ఏర్పాటు చేసిన బౌద్ధం, భారతీయ గ్రామాల్లో 'నిరంతర పోరు' చేయాల్సి వచ్చింది. ఎందుకంటే.. 'కులవ్యవస్థను' బౌద్ధం అంగీకరించలేదు, వృత్తుల్ని 'కుల చట్రం' నుండి వేరు చేసింది కాబట్టే.

అప్పటివరకూ సమాజంలో 'గురువు' స్థానంలో ఉన్న బ్రాహ్మణుల స్థానంలో, బ్రాహ్మణేతరుల్ని నిలబెట్టింది. దిగువ కులాలవారికి విద్యావకాశాలు కల్పించింది. అంతే కాదు, ఈ పని ఈ కులం వారే చేయాలి అనే విధానాన్ని రూపుమాపింది. బౌద్ధ సంఘంలోఉన్నవారు ఎవరి బట్టలు వారు ఉతుక్కోవాలి. తలలు గొరగడంలో ఒకరికొకరు సహాయం చేసుకోవాలి. బ్రాహ్మణుడైనా, ఎవరైనా సరే... బౌద్ధ సంఘంలో భిక్షువుగా చేరితే అతను మరొక భిక్షువుకి తల వెంట్రుకలు గొరగాల్సిందే.

ఇలా... కుల నిర్మూలనా బీజాలు బౌద్ధం తొలిగా నాటింది.

గ్రామీణ మనస్తత్వంలో ఇది చాలా విద్రోహమైన పనే. - అందుకే... గ్రామీణ ప్రధాన జీవనాధారమైన వ్యవసాయానికి వెన్నుదన్నుగా నిలిచినప్పటికీ బౌద్ధం ఈ 'కులం' విషయంలో గట్టిగానే ఎదురీదింది.

ఐతే, ఎంత గట్టిగా ఎదురీదినప్పటికీ.. మన తెలుగు నేలమీద కులవృత్తుల వారు బౌద్ధాన్ని అంత గట్టిగానే ఆదరించారు. ఆ విషయాల్ని మనం గతంలోనే చర్చించుకున్నాం.

**కొత్త నాగరకత:** ఇక, పట్టణాలు చూద్దాం. పట్టణాల్లో ఉండే వృత్తులు వేరు. అక్కడి నాగరకత క్రొత్త క్రొత్త వృత్తుల్ని సృష్టిస్తుంది. కానీ ఆ కొత్త పనులు చేయడానికి 'కొత్త కులాలు' పుట్టవు. ఉన్న కులాలవారే ఆ పనులు చేయాలి. ఇలా కొత్త నాగరకత కుల పునాదుల్ని కొద్దిగా కుదిపింది.

నగర నిర్మాణాలకి, పట్టణాల అభివృద్ధికి ప్రధాన కారణం వ్యాపారం. కాబట్టి నగర సంస్కృతిలో వ్యాపారులదే కీలకపాత్ర. వ్యాపార జీవనం, వ్యాపార సంస్కృతి 'కులాన్ని' పట్టుకుని, చూరుకు కట్టిన ఉట్టిలాగానో, తలకిందులుగా వేలాడే గబ్బిలం లాగానో వ్రేలాడదు. అలా వ్రేలాడితే అది బ్రతకదు. 'కులచట్రం' దాని వ్యాప్తికి ప్రతి బంధకం అవుతుంది. కాబట్టి ఆ చట్రాన్ని అంటిపెట్టుకుని, దాన్ని పెంచి పోషించి అది జీవించలేదు.

కాబట్టి, 'కులచట్రాన్ని ఛేధించడానికి' నడుంకట్టిన బౌద్ధాన్ని పట్టణ, నగరాల్లోని వ్యాపారవర్గం పెద్దఎత్తున భుజానికెత్తుకుంది.

ఈ విధంగా బౌద్ధం నూతన ఉత్పత్తులకు మార్గం చూపింది. ఇబ్బడి ముబ్బడిగా పెరిగిన ఈ ఉత్పత్తుల్ని అమ్మడం కోసం దేశ, విదేశాలకు వ్యాపారుల్ని పంపడంలో బౌద్ధ భావజాలం చూపిన చొరవ అంతా ఇంతా కాదు.

ఐతే మనం ఇక్కడ మరో విషయాన్ని కూడా గుర్తించు కోవాలి. కాలక్రమంలో కొన్ని గ్రామాలు పట్టణాలుగా మారాయి. ఇలా మారిన పట్టణాల్లో కుల వృత్తులు అంత తేలిగ్గాపోవు. కులం బలహీనపడదు. దీనికి మంచి ఉదాహరణ నేటి నవ్యాంధ్ర రాజధానిలో భాగమైన మంగళగిరి. అక్కడున్న చేనేత కార్మికులు ఇంకా తమ కుల వృత్తిలోనే జీవనం సాగిస్తున్నారు. జీవిత అవసరాలు పెరిగి ,జీవన అవకాశాలు తగ్గి , నూతన వృత్తుల్ని అందుకోలేక

సతమత మవుతున్నారు. ఇక్కడ పట్టణ వ్యవస్థకి, గ్రామీణ కుల వ్యవస్థ గుదిబండగా మారింది. ఇలాంటి పట్టణాలు మన దేశంలోనే ఉంటాయి.

**వైదికం–ఛాందసం:** వైదిక వ్యవస్థ అంటేనే కులవ్యవస్థ. మనుషుల్ని విభజించడం, ఉన్నతులుగా కొందర్ని, నీచులుగా కొందర్ని, అంటరాని వారిగా ఇంకొందర్ని చూడ్డం, వారిని ఎప్పుడూ అలాగే ఉంచడం దాని సహజ ప్రవృత్తి. మాయలపకీరు ప్రాణం చెట్టు తొర్రలోని చిలుక బొందిలో ఉందో లేదోగానీ, వైదిక భావజాల ప్రాణం మాత్రం 'కులం' బొందిలోనే దాగుంది.

'కులం' కూలితే.... వైదికం కూలిపోతుంది..... అంతే....!

వైదిక సంస్కృతి నగర సంస్కృతికి వ్యతిరేకం. దీనికి మూలం ఆర్యుల జీవన విధానంలోనే ఉంది. వారు ప్రధానంగా పశుపాలకులు.

ఋగ్వేదం(4–6–13)లో ఇంద్రుణ్ణి, శంబరుని నూరు పట్టణాల్ని ధ్వంసం చేసిన పురంధరునిగా కీర్తించారు. ఆర్యుల రాకతో సింధు నగర నాగరకత సర్వనాశనం అయిన విషయం కూడా ఒక చారిత్రక సత్యమే!

'కులం' పునాదులు బలంగా ఉండని నగర నాగరకతను వైదిక సంప్రదాయం సహించలేదు. అందుకే... దేశవిదేశాలు తిరిగే వారి మీద శిక్షలు విధించింది.

**సముద్రయానం తగదు:** బుద్ధునికి 'కాస్త ముందరిది' అని చెప్పుకొనే బోధాయనుని ధర్మసూత్రాల్లో మొదటిగా 'విదేశీయాన' నిషేధాన్ని , ముఖ్యంగా సముద్రయాన నిషేధాన్ని చూస్తాం.. ఇలా నిషేధించడం అంటే.. భారతదేశాన్ని ఇతర ప్రపంచంతో కలవకుండా చేయడమే. 'మడి' కట్టుకుని కూర్చోబెట్టడమే! మనకు మనం దడి కట్టుకోవడమే!

భౌగోళికంగా భారతదేశానికి మూడు దిక్కులా సముద్రం ఉంది. నేల భాగం ఉన్న ఆ ఒక ప్రక్క కూడా పెట్టని గోడలా హిమాలయాలు ఉన్నాయి. ఇక ఉన్న ఒకే ఒక్క 'సందు దారి' హిందూకుష్ పర్వతాల్లోని కైబర్, బోలాన్ కనుమలే–

నిజానికి ఆధునిక కాలంలో బ్రిటన్ దేశాన్ని సర్వశక్తివంతంగా, పెద్ద వ్యాపార సామ్రాజ్యంగా మార్చింది సముద్రమార్గమే. ఇజ్రాయిల్, గ్రీకు లాంటి దేశాల్ని శక్తివంతంగా మార్చిందీ సముద్రమే.

దురదృష్టం ఏమంటే... సముద్రయానంలో అగ్రగామిగా నిలవాల్సిన మన దేశాన్ని తన చాదస్తంతో నిర్వీర్యం చేసింది వైదికం. సముద్రయానం మీద అది విధించిన నిషేధమే ఇందుకు కారణం.

క్రీ.శ. 7–8 శతాబ్దాలకి చెందిన బోధాయనుడు చెప్పిన కృష్ణ యజుర్వేదంలోని తైత్తిరీయంలోని ధర్మసూత్రాల్లో ఇలా ఉంది:

"ఎవరైతే సముద్రయానం చేస్తారో... వారికి మ్లేచ్ఛ సంపర్కం కలిగి కుల హీనులవుతారు. పునర్జన్మను కోల్పోతారు. సంచిత పుణ్యాన్ని పోగొట్టుకుంటారు. సముద్రంమీది దుష్ట ఆత్మల వల్ల ప్రాణాల్లే కోల్పోతారు."– అని,

అలాగే... మనుధర్మ శాస్త్రంలో 3వ అధ్యాయం 158వ శ్లోకంలో కూడా ఇలా ఉంది:

'సముద్రయానంవల్ల కులాన్ని కోల్పోతారు' అని.

ఈ వైదిక నిబంధనలు భారతీయ నాగరకత వికాసానికి పెద్ద ప్రతి బంధకాలయ్యాయి. మన విద్య, వైజ్ఞానిక, ఆర్థిక పునాదుల్ని ఆదిలోనే విధ్వంసం చేశాయి.

ఈ విధ్వంస ప్రభావం భారతదేశంలో అన్ని ప్రాంతాలకంటే ఎక్కువగా మన తెలుగు నేలమీదనే పడింది. కారణం... మనకు ఉన్నంత సముద్ర తీరం మరే ప్రాంతానికీ లేదు. మనకున్నన్ని ఓడరేవులు మరే చోటా లేవు.

ఐతే...ఈ వైదిక భావజాల ఛిందస బంధనాలనుండి, నాగరక విధ్వంసం నుండి మనల్ని బైటపడేసింది బౌద్ధమే!

**వ్యాపారాభివృద్ధికి బౌద్ధం:** పట్టణ నాగరకతా వికాసానికి మూల స్తంభాలైన వ్యాపారవర్గాలవారు తమకు తాత్త్విక వెన్నుదన్నుగా నిలిచిన బౌద్ధంపట్ల విశేషంగా ఆకర్షించబడ్డారు. ఎందుకంటే బౌద్ధం సముద్రయానాన్ని ప్రోత్సహించింది. విదేశీ వ్యాపారాభివృద్ధికి తోడ్పడింది. దీనివల్ల ఆనాటి పాలకవర్గాల కంటే వ్యాపారులు ఎందరో గొప్ప గొప్ప ధనవంతులయ్యారు.

వారిలో బౌద్ధాన్ని పోషించిన శ్రావస్తికి చెందిన సుదత్తుడు (అనాథపిండకుడు), మిగార మాత విశాఖ, మన తెలుగు నేలమీద 'బోధిసిరి' అగ్రగణ్యులు.

**బోధిసిరి–బౌద్ధసేవ:** బోధిసిరి బౌద్ధాభిమాని. ఈమె ఒక పెద్ద వ్యాపారి భార్య. వీరి నివాసం ఈనాటి నాగార్జునసాగర్. శ్రీపర్వత ప్రాంతంలో ఎన్నో ఆరామాలు కట్టించింది. విదేశీయులకోసం కూడా ఆరామాలు నిర్మించింది. శ్రీలంక బౌద్ధ భిక్షువుల కోసం గొప్ప ఆరామాన్ని ప్రత్యేకంగా నిర్మించి ఇచ్చింది. శ్రీపర్వతం మీద గొప్ప చైత్యాన్ని నిర్మించింది. కుసీనర, గాంధార, యవన (గ్రీకు), తామ్రపర్ణి, థాయిలాండ్ దేశాల భిక్షువుల కోసం ఎన్నెన్నో ఆరామాలు నిర్మించింది. (ఈమె పేరుతో ఈనాడు నాగార్జునసాగర్‌లో విహారయాత్రచేసే స్టీమర్‌కు 'బోధిసిరి' పేరు పెట్టారు).

ఇక్కడేకాదు, తెలుగు నేలమీద మనకు తెలిసిన స్థూప నిర్మాణాలన్నింటిలో వ్యాపారులపాత్ర ఎనలేనిది.

అందుకే... సముద్ర తీరంలోని రేవుపట్టణాలన్నీ బౌద్ధ కేంద్రాలుగా విరాజిల్లాయి. కృష్ణా, గోదావరీ నదీ తీరాలన్నీ బౌద్ధ ప్రబోధాలతో మారుమ్రోగాయి.

గొప్ప వ్యాపార కేంద్రాలుగా విరాజిల్లిన ప్రాంతాలు కొన్ని చూద్దాం.

**ఘంటసాల:** ఘంటసాల, ఆనాడు గొప్ప విదేశీ వ్యాపార కేంద్రం. ఇది కృష్ణానదీ ముఖద్వారంలోని గొప్ప నౌకాకేంద్రం కూడా. ఆనాటి నావికుల్లో అగ్రగణ్యుడైన ఒక మహానావికుని భార్య, ఘంటసాలలో ఉన్న బౌద్ధస్థూపానికి పెద్ద ఎత్తున ఆర్థిక సహాయం చేసింది. స్థూప నిర్మాణానికి కారకురాలయ్యింది. ఆనాటి గ్రీకు పరిశోధకుడు, పర్యాటకుడు టాలమీ ఘంటసాలను 'పెద్దరేవు పట్టణంగా తన రచనల్లో చెప్పాడు. దీనికి సమీపంలో ఉన్న ఉప్పుటేరును (రేపల్లె–పులిగడ్డ మధ్యనున్న కృష్ణానది పాయ) గొప్ప నౌకాశ్రయంగా అభివర్ణించాడు. అంతేకాదు, ఘంటసాలకు సమీపంలోని మైసోలియా (మచిలీపట్నం) పెద్ద వాణిజ్యకేంద్రమని, అది కూడా ఒక పెద్దరేవు పట్టణమని తన రచనల్లో పొందుపరిచాడు.

దీనికి ఋజువుగా ఓడ బొమ్మతో ఉన్న శాతవాహనుల కాలంనాటి నాణేలు, రోమన్ల బంగారు నాణేలు ఘంటసాలలో దొరికాయి. వీటిని బట్టి ఇది గొప్ప విదేశీ వ్యాపార కేంద్రమని తెలుస్తోంది. అంతేకాదు.. ఉత్తరాంధ్ర చివరనున్న కోటిలింగాల నుండి ఘంటసాలకు పెద్ద వాణిజ్యమార్గం ఉండేది. అంటే ఆ దారి పొడవునా ఎన్నో వ్యాపార పట్టణాలుండేవి.

**కళింగపట్టణం:** ఇది అశోకుని కాలం నుండి గొప్ప విదేశీ వ్యాపారకేంద్రంగా మారింది. గొప్ప నౌకాశ్రయంగా అభివృద్ధి చెందింది. శ్రీకాకుళానికి 12 మైళ్ళదూరంలో వంశధార నది మీద, కళింగ పట్టణానికి దగ్గరలో నిర్మించిన గొప్ప చైత్యం శాలిహుండం. శాలిహుండం అంటే 'ధాన్యాగారం' 'ధాన్యపు గాదె' అని అర్థం. ఇక్కడి నుండి కళింగపట్టణం రేవు మీదుగా విదేశాలకు ధాన్యం ఎగుమతి జరిగేది. ఆనాడు కళింగ పట్టణం దేశ విదేశ బౌద్ధులకు పెద్ద కూడలి.

**ఆదుర్రు :** ఆదుర్రు గోదావరి పాయల్లో ఒకటైన వైనతేయ నది ముఖ ద్వారం దగ్గర ఉంది. ఇక్కడ గొప్ప బౌద్ధ స్థూపం ఉంది. ఆదుర్రు బౌద్ధక్షేత్రాన్ని దిబ్బక్షేత్రం (దివ్యక్షేత్రం) అంటారు. ఉత్తరాదిన ఉన్న సారనాథ్ స్థూపంకూడా దివ్యక్షేత్రమే. అశోకుని కుమార్తె సంఘమిత్ర ఈ తీరం నుండే శ్రీలంకకు వెళ్ళిందని అంటారు. ఆదుర్రు ఆనాటి సుప్రసిద్ధ విదేశీ వ్యాపార కేంద్రాల్లో ఒకటి. రేవు పట్టణాల్లో మేటి.

**కుమ్మరిలోవ:** తూర్పుగోదావరి జిల్లాలో 'తుని' దగ్గరలో ఉంది కుమ్మరిలోవ. ఆచార్య నాగార్జునుని శిష్యుడైన ఆర్యదేవుడు ఇక్కడ బౌద్ధ ఆరామాన్ని నిర్మింపజేశాడు. ఆర్యదేవుణ్ణి 'కొమరికుడు' అంటారు. అందుకే ఆయన పేరుమీదగా ఇది 'కుమార ఆరామం' అయ్యింది.

ఈ ఊరు ఈనాటికీ 'కుండల' పరిశ్రమలకు అగ్రగామే.ఆనాడే ఇది ఎన్నోరకాల కుండలు, మట్టిపాత్రలు, జాడీలు, బానలు, ధాన్యపు జాడీల ఉత్పత్తి కేంద్రం. దీని సమీపంలోని తాండవ నది ముఖద్వారం ఆనాడు అతి పెద్ద విదేశీ వ్యాపార కేంద్రం. రోమన్, శ్రీలంక, ఇండోనేషియా, చైనా, భూటాన్, బర్మా, థాయిలండ్ దేశాల నాణేలెన్నో ఇక్కడ దొరికాయి. అంటే... అన్ని దేశాల వారు ఇక్కడికి వచ్చి వ్యాపారం సాగించేవారన్నమాట.

**భట్టిప్రోలు:** ఇది గుంటూరు జిల్లా, రేపల్లెకు సమీపాన ఉంది. కృష్ణా నదికి తూర్పున ఘంటసాల ఉంటే... పశ్చిమాన భట్టిప్రోలు ఉంటుంది. ఘంటసాల నుండి ఉప్పుటేరుకు ఎంత దూరమో, భట్టిప్రోలు నుండి ఉప్పుటేరుకు అంతే దూరం. పైగా ఉప్పుటేరు పాయ, రేపల్లె ప్రక్కగా వెల్లటూరు మీదుగా, పోతవరం లంక (పోతవరం అంటే పెద్ద నౌక అని) దాకా ఉంది. ఈ రేవు గుండా నౌకా వ్యాపారం జరిగేది. ఉప్పుటేరుకు పడమర అంచున ఉన్న రేపల్లె (రేవు పల్లె) ఆనాటి గొప్ప నౌకా వ్యాపార కేంద్రం.

ఆనాడు భట్టిప్రోలును 'ప్రతీపాల పురం' లేదా 'ప్రితుండ నగరం' అని పిలిచేవారు. ఈ ప్రాంతం కృష్ణా పశ్చిమ డెల్టాలో ఉంది. ఈ డెల్టా ఈనాటికీ భారతదేశంలో అత్యధికంగా వరి పండించే అగ్రగామి ప్రాంతమే! పైగా, భట్టిప్రోలు గొప్ప వస్త్ర వ్యాపార కేంద్రం కూడా. దీని పరిసర ప్రాంతాలైన కనగాల, ఐలవరం, రాజోలు ఈనాటికీ చేనేత పరిశ్రమలకు పెట్టింది పేరు. భట్టిప్రోలుకు సమీపంలోని రేవు ప్రాంతంలో (రేపల్లె సమీపంలో) 'పిట్టుండ' అనే పెద్ద వస్త్ర పరిశ్రమలకు కేంద్రం ఉందని టాలెమీ రాశాడు. ఆ పిట్టుండే ఈనాటి పేటేరు. ఈనాటికీ పేటేరు చేనేత వస్త్రాలకు మంచి గిరాకీ ఉంది. పేటేరు అంచు చీరలు, పేటేరు అంచు పంచెలు ఎంతో పేరు పొందాయి.

ఇటు ధాన్యం, అటు వస్త్ర పరిశ్రమలతోపాటు అపరాల సాగుకూడా ఈ ప్రాంతంలో ఉంది. ఆవనూనె, ఆముదం నూనెలకూ ఎంతోకాలంగా పేరుపొందిన 'అద్దేపల్లి' ఈనాటి భట్టిప్రోలులో ఒక భాగమే. అంటే, భట్టిప్రోలు కేంద్రంగా వరి, అపరాల, నూనెల, వస్త్రాల విదేశీ వ్యాపారం ముమ్మరంగా సాగేదన్న మాట.

**అమరావతి:** ఇక, కృష్ణానది మీద బెజవాడ మీదుగా అమరావతి వరకూ నౌకా వ్యాపారం సాగేది. ముఖ్యంగా అమరావతి ప్రాంతంలోని నల్లరేగడి నేలలు ప్రత్తి, మిరపలాంటి వ్యాపారపంటలకు అనుకూలమైనవి కావడం వల్ల – ఇక్కడి నుండి వ్యాపారపంటల విదేశీ వాణిజ్యం జోరుగా జరిగేది.

**మోటుపల్లి:** ఇది ప్రకాశం జిల్లాలో చిన గంజా దగ్గర ఉంది. ఇది శాతవాహనుల కాలం నాటి సుప్రసిద్ధ రేవు పట్టణం. బౌద్ధ స్తూపానికి చెందిన అవశేషాలు కొన్ని దొరికాయి. ఇక్కడ రోమన్ నాణేలతో పాటు, ఒకవైపున ఒడ బొమ్మ, మరోవైపున యజ్ఞశ్రీశాతకర్ణి బొమ్మలున్న నాణేలు దొరికాయి. దక్షిణ తెలుగు ప్రాంతంలో బౌద్ధులకాలం నాటి గొప్ప విదేశీ వ్యాపార కేంద్రం.

మనం ఇప్పటిదాకా చెప్పుకున్న వ్యాపార, నౌకా కేంద్రాలన్నీ బౌద్ధ కేంద్రాలే!

**సార్థవాహులు:** సార్థవాహులు అంటే... భూమార్గంద్వారా ఒకచోటునుండి మరోచోటుకి వ్యాపారం చేసేవారు అని. వీరు ఒకేసారి 500 లేదా వెయ్యి బండ్లమీద సరుకులెత్తుకుని అడవులు, ఎడారులు, పర్వత కనుమలు దాటుకుంటూ విదేశాలకు పోయి వ్యాపారం సాగించేవారు.

విశేషం ఏమిటంటే.. ప్రతి సార్థవాహుడూ కొందరు బౌద్ధభిక్షువుల్ని తమవెంట తీసుకొని పోతూ ఉండేవాడు.బౌద్ధ సాహిత్యంలో, ముఖ్యంగా బౌద్ధ జాతక కథల్లో సార్థవాహులను గురించిన కథలు కోకొల్లలు.

ఈ విధంగా ఇటు సార్థవాహులవల్ల , అటు సముద్ర వ్యాపారులవల్లా – బౌద్ధ భిక్షువులు విదేశాలకు పోయి, అక్కడ బుద్ధుని బోధనల విత్తనాల్ని చల్లారు.

బౌద్ధం వల్ల విదేశాలకు వ్యాపారం విస్తరిస్తే..

విదేశీ వ్యాపారం వల్ల బౌద్ధ ధర్మం ఆయా దేశాల్లో వ్యాపించింది.

**నదులు-రహదారులు:** వ్యవసాయ నాగరకతకు నదులు, కాలువలు అవసరం. వారి రవాణా వ్యవస్థ కూడా నదులూ, కాలువలే.

అలాగే... వ్యాపార సరుకుల రవాణాకు కాలువలు,నదులే సరిపోవు. రహదారులు కావాలి. అంటే రహదారి వ్యవస్థ అభివృద్ధి చెందాలి. మన దేశంలో ఈ పనికూడా బౌద్ధమే చేసింది. వ్యాపారాభివృద్ధి జరగడంతో... రహదారులు కూడా అభివృద్ధి చెందాయి.

అందుకే... అశోకుడు వ్యవసాయ నాగరకతకు అవసరమైన కాల్వలు, చెరువులు తవ్వించాడు. అలాగే... వ్యాపారాభివృద్ధికి అవసరమైన రోడ్లు కూడా వేయించాడు. వాటికి ఇరువైపులా చెట్లు నాటించాడు. బావులు తవ్వించాడు. సత్రాలు కట్టించాడు.

నిజం చెప్పాలంటే.. అశోకుడు చేసిన ఈ రెండు పనులూ బుద్ధుని బోధన నుండి గ్రహించినవే. దీర్ఘనికాయం లోని కూటదంత సుత్తంలో 'మహావిజితు'ని కథలో రాజు చేయాల్సిన పనుల్ని బుద్ధుడు వివరిస్తాడు. ఆ పనులే అశోకుడు చేశాడు.

అంటే... బౌద్ధం అటు వ్యవసాయ నాగరకతను (గ్రామ జీవనాన్ని) ఇటు వ్యాపార నాగరకతను (నగరజీవనాన్ని) రెండింటినీ ప్రోత్సహించింది. భారత దేశానికి కావలసిన అసలైన ఆర్థిక విధానాన్ని చూపించింది. అందుకే నోబెల్ బహుమతి గ్రహీత, ప్రపంచ మేటి ఆర్థిక వేత్త అమర్త్యసేన్ " బుద్ధుడే నాకు ఆదర్శం. బుద్ధుణ్ణి మించిన గొప్ప వ్యక్తి ఈ ప్రపంచంలో మరొకరు లేరు" అన్నారు.

బౌద్ధం చూపిన ఈ ప్రోత్సాహంవల్లే ఆనాటి కాలంలో మన తెలుగు నేల మీద ఎన్నో వ్యాపార కేంద్రాలతోపాటు, పలు విద్యాకేంద్రాలు కూడా వెలిశాయి. దేశ, విదేశ విద్యార్థులకు విజ్ఞాన కేంద్రంగా వెలుగొందాయి. మన తెలుగు నేలపై విజ్ఞాన దివిటీలు వెలిగించాయి.

అందుకే... మన కోస్తాతీరం రేవులు బౌద్ధ ధర్మ రాదారులు అనడంలో అతిశయోక్తి లేదు. అవాస్తవం ఎంతమాత్రం కాదు.

**రచయిత ఫోను : 9390600157**

# తెనుగు లెంక సూక్తులు-2



తెనుగు లెంక 'అభినవ తిక్కన'
తుమ్మల సీతారామమూర్తి.

**'బాస** చెడెనేని కవితా
వాసన చెడు; నాత్మధర్మవత్సలత సెడున్
వేసము చెడు; రోసము చెడు
మీసము చెడు; నెట్టినెట్టి మెరుగైన జెడున్.'

**భాష** వలననే ఆ భాష మాట్లాడే జాతికి గుర్తింపు వస్తుంది. భాష వలన గుర్తింపు పొందిన జాతికి కొన్ని ప్రత్యేకతలు కొన్ని విశిష్టతలు గుర్తింపుతెస్తాయి. ఆ ప్రత్యేకత, ఆ విశిష్టత కనిపిస్తే వెంటనే ఆ జాతి స్ఫురణకు వస్తుంది. ఉదాహరణకు తెలుగునే తీసుకుందాం. తెలుగు వలన తెలుగుజాతి గుర్తింపు పొందింది. తెలుగువారికి ప్రత్యేకమైన నుడికారం ఉంది. స్వతంత్రమైన జాతీయాలున్నాయి. ఘనమైన చరిత్ర ఉంది. విశిష్టమైన జీవన విధానం ఉంది. కట్టులో, బొట్టులో, ఠీవిలో– ఠీవిలో– ప్రతిదాంట్లో తెలుగుజాతికి తమదైన ఒక 'ఇది' ఉంది. ఒక పండిత మిత్రుడు చెప్పినట్లు ఆవకాయ నుంచి అష్టావధానందాకా అరవై అంశాల్లో తెలుగువారి ప్రత్యేకతగా గోచరిస్తుంది. వీనిలో ఏ అంశాన్ని, ఏ దేశంలో తిలకించినా వెంటనే తెలుగువాడు గుర్తుకొస్తాడు.

తెలుగుకవిత్వం అంటే తిక్కన గుర్తుకు వస్తాడు. తెలుగురాజు అంటే కృష్ణదేవరాయలు గుర్తుకువస్తాడు. తెలుగు ధర్మం అంటే విజయవాటికను పాలించిన మాధవవర్మ గుర్తుకు వస్తాడు. తెలుగు పౌరుషం అంటే బాలచంద్రుడుగుర్తుకు వస్తాడు. తెలుగు అంటే ఒంగోలు గిత్తలు, కూచిపూడి నాట్యం, పలనాటి కోళ్ళు, తిరుపతివెంకన్న – నెల్లూరు నెరజాణలు, శ్రీశైలం మల్లన్న, పొందూరు ఖద్దరు, సింహాచలం అప్పన్న, ధర్మవరం చీరలు – ఇలా ఎన్నో, ఎన్నెన్నో గుర్తుకు వస్తాయి. తెలుగువారి ప్రత్యేకాన్ని ప్రపంచానికి చాటి చెబుతాయి.

భాష చెడిపోతే జాతికి చెందిన కవిత్వం చెడిపోతుంది. ఆజాతి తన ధర్మాన్ని మరచిపోతుంది. వేషం, రోషం, మీసంతోఓపాటు ప్రత్యేకతలన్నీ కనుమరుగవుతాయి. క్రమక్రమంగా–అంటారుతుమ్మల. అందుకే ముందుగా భాష చెడకుండా చూసుకోవాలంటారు.

తెలుగుజాతి విషయంలోఓ జరిగిందిదే. ముందుకు భాషను ఆంగ్లానికి తాకట్టుపెట్టాం. దానితో జాతి యావత్తూ ఆంగ్లానికి దాస్యమయింది. తత్ఫలితంగా తెలుగు కవిత్వంలో తెలుగు నుడికారాలకు బదులు ఆంగ్లపదాలు యధేచ్ఛగా వాడుతున్నారు. పంచెకట్టునుమరచిపోయాం. చీరకట్టును మరచిపోయాం– తెలుగు వాతావరణానికి పనికారిన కోట్లు, సూట్లు, జీన్ మొదలైన పలువిధాల పాశ్చాత్య వస్త్రధారణా విశేషాలను అనుకరిస్తున్నాం. భాష నశిస్తుందని ఐక్యరాజ్యసమితి వినిపిస్తున్నా, చెవుల్లో దూర్చుకునే తీరికలేదు– భాషను కాపాడుకోవాలనే కోరికలేదు. తెలుగు బడులు మూసివేసి ప్రభుత్వమే ఆంగ్ల మాధ్యమంలో బడులు తెరవడానికి తెరను లేపుతున్నది.

తెలుగు నాయకుల్లో భాషపట్ల చిత్తశుద్ధి లేదు. తెలుగుదేశంలోని అధికారుల్లో భాషను కాపాడుకోవాలనే తపనలేదు. తెలుగు ప్రజల్లో తనను, తన విశిష్టతను కాపాడుకోవాలనే ఇంగితజ్ఞానం లేదు. తెలుగు భాషకు బోధనలో సముచిత స్థానాన్ని ఇవ్వాలి. నాయకులు ఉత్తర్వులు ఇచ్చి ఊరుకోక అమలు జరిగేటట్లు చూడాలి. అధికారులు తెలుగుపట్ల అలసత్వం విడిచిపెట్టాలి. తెలుగుజాతి 'పట్టనితనం' ప్రదర్శించకుండా భాషను కాపాడుకోడానికి ప్రయత్నించాలి.

అప్పుడే తెలుగువాడి 'వాడి' ప్రపంచం గుర్తుంచుకొంటుంది. తెనుగులెంక తుమ్మల ఆత్మశాంతిస్తుంది.

**– డాక్టర్ నాగభైరవ ఆదినారాయణ,** ఫోన్ : 9849799711

---

**కవిత**

# అంతర్నేత్రులు

**న**యనాలు లేని నరులకు
వాయులీన కదలికలే కనుపాపలు

**స**న్నగాకంపించే శబ్దతరంగాలే
వెల్లని కిరణ కాంతి రహదారులు

**సు**నాయసంగానే, అతి సుళువుగానే
వాల్లపనిలో వాల్లు నిమగ్నమవుతారు
లోలోపల ఎంత కన్నీరు కారుస్తుంటారో
వాల్లకే తెలియదు
ఇతరులకెట్లా అర్థమవుతుంది

**లో**కాన్ని చూడలేని ఆకళ్ళకు
కనురెప్పల సెన్సార్లు
చేయలేని పని అంటూ
ఆ మనసుల్లో ఏదీ ఉండది
వాల్ల వేళ్ళ కొసలే చూపులు

**ఒ**క్క అంకె. ఒక్క అక్షరం ఒక మాట
ఏవీ పొల్లుపోవు

**వె**లిసిన మనుషులందరినీ
శబ్దాలంకారాలతోనే గుర్తించే గ్రాహకం
నడకనడకలోనూ నడతను వడపోస్తారు

**జి**గిబిగి రహదారుల పైనైనా
పల్లెటూల్లా పిల్లబాటల నుంచైనా
టక టక దర్శన కట్టెలతోనే
ఎరుకపట్టి ఆత్మీయంగా కదులువారు

**లో**లోపలి స్పృహతోనే అన్నిటినీ వీక్షించి
ఆచి తూచి అడుగులేస్తారు

**కం**డ్లులెవ్వని చింతనేగానీ
కల్లాకపటం తెలవని కరుణ రూపం

**చూ**సీ చూడనట్టుగ నటించే
అంజాన్ అసలే కన్పించది
కండ్లు నెత్తికెక్కుతూ ఉండది
కండ్ల కానకపోవుడూ ఉండది
వాల్లది
కాంతివంతమైన జీవితం
వారిలోకం ఆత్మావలోకనం

**– అన్నవరం దేవేందర్**
ఫోను: 9440763473

కొంగునాడు కత

# ఉడుకు నీళు

తెల్లారతానే తొమ్మిదిగంటలు. నా తమ్ముడు 'అరి' వచ్చి నన్ను లేపినాండు. నేను అయినా తొమ్మిది గంటలకు తీసుకొంటి. అయితే నా చెల్లెలు 'అచ్చు' మట్టుకు ఇంకా లేవలేదు. అరి ఎట్టెట్టనో లేపి చూసినాండు, ఓటీ పనికి రాలా. కడసీలా ఒక తొక్కు తొక్కినాండు. అమ్మాంట లేసి కూసునింది అచ్చు.

"ఏరా, నువ్వు వేళకే లేసుకొనేవు. మమ్మల్ని కూడా నిదరపోకుండా లేపేసేవు ఏలరా" అంటా అరిని తిట్టితి.

"గంట తొమ్మిది అయింది, ఇంకా నిదరపోయేరా, సరి బిన్నా పల్లు తోముకొని రండ. మీరు వస్తేనే అమ్మ నాకు బూస్టు పోసిచ్చు" అనేసి పోడిసినాండు వాండు.

నేను లేసి ఇవతలకు వస్తే ఇల్లంతా ఒగే సద్దుగా ఉండె. 'ఈ టీని తాగేనుడవ ఉత్త నీళను కాంచి తాగుకోవచ్చు' అంటా మా అబ్బ, అమ్మను తిట్టుకొని ఉండాడు. నేను దానినంతా కండుకోకుండా అమ్మ దగ్గరికి పోయి బూస్టును అడిగితి. మా అమ్మ, మా అబ్బ కూడా జగడం వేసిన కోపంలా "అడగలేదంటే నే పోసియ్యనా' అంటా తిట్టేసింది నన్ను. నేను ఓటీ మాటాడకుండా పోయి కూసుండితి. కొద్ది వేళ తాలి అమ్మ బూస్టు పోసుకొని వచ్చి ఇచ్చె. నేను తాగేసి బయిటికి పోయి పత్రికన్ను చదవతా కూసుంటి. నాండు పగలంతా అట్టనే నడిసింది.

ఆ రాతిరి ఊవా (మా అమ్మమ్మ) పక్కన పండుకొని ఊవాను అడిగితి. "ఏమి ఊవా, తెల్లారతానే అమ్మానూ అబ్బానూ ఏంటికి జగడాలు వేసికొని ఉండిరి" అంటా.

"అవ్వ, మీ అమ్మ పెట్టే టీ నోట్లో పెట్టే మారినా ఉండాయి? దానికే మీ అబ్బ తిట్టుకోని ఉండె. నేనంతా టీ పెట్టితే ఎట్లుండు తెలుసునా, అట్నే బాగ గట్టిగ ఉండు" అనింది ఊవా.

"దాన్ని నువ్వు చెప్పుకోకూడదు ఊవా, తాగినాండ్లు చెప్పాల" అనింది అచ్చు.

"ఏయ్, నే చెప్పేది కాదు, ఎందురు చెప్పుండారో తెలుసునా' అనింది ఊవా.

"దాన్ని మేమెట్ట నమ్మేది" అన్నాండు అరి.

"సరి, చెప్పేను వినండ. ఇప్పుడంతా మీరు ఎన్ని గంటల వరకూ నిదరపోయేరు, తొమ్మిది అయినానూ లేసేలే. అయితే అప్పుడు మేము అందురునూ, గువ్వలు కాకులు కూసేనికి ముందరోటనే లేసుకొంటుము. అందురూ అయిదు గంటలకు ముందరోటనే లేసి వాకిలి సల్లేనికి ఆరంబిచ్చుతురు. అన్ని ఇల్లుల ముందరోటనించి సల్‌సల్లనే సద్దులు వచ్చి, నిదరపోయికొని ఉండే వాళ్లను కూడా లేపుడుసు. దీన్ని మీరి ఓరన్నా నిదరపొయికొనే ఉంటే 'గుద్దకు ఎండ వచ్చేముడి ఏమి నిదర' అంటా పెద్దవాళ్లు తిట్టుతురు. నేను అప్పుడంతా వేళకే లేసుకొంటు'

"ఊవా ఇప్పుడునూ నువ్వు వేళకే కాదు లేసుకొంటువు" అంటా అడిగింది నదువులా దూరి అచ్చు.

"ఇప్పుడు ఏ వేళకు లేసేను, ఆరు గంటలకు ముందరోట లేసేలేదు. అప్పుడు అయిదు గంటలకు ముందరోటనే లేసేస్తు" అనింది ఊవా.

"నదురాతిరిలా లేసి ఏమి చేస్తురు" అంటా అడిగింది సోంబేరి అచ్చు.

'అప్పుడా తాయే, వాళ్ల ఉడుకునీళు పోసే కత ఊరుకంతా తెలుసునే, మీకు తెలవదా.
తెల్లవారే ఉడుకునీళు పెట్టి వాళ్లు అందురూ తాగేస్తురు.
ఆ వంచిన టీ ఆకును ఎత్తి ఎండబెట్టి పెట్టేస్తురు.
నా బోంటిది పోతే తాయీ, ఆ ఆకునే యేసి మళ్లా చేసేది.
దాన్లా ఒగ సొట్టు పాయినా ఉండేలేదు, ఉత్తనీళుదా, మీరయితే గట్టింగా పెట్టిపోసేరు.
మీ చేతులా ఒగ నోరు ఉడుకునీళు తాగచ్చుని వచ్చేది తాయీ' అనింది దుక్కి".



మార్టూరి సంజనా పద్మం

"లేసి వాకిలి సల్లి, ముగ్గు వేసేసి, వండే పనిని ఆరంబిచ్చుతును. కొద్దిగా వెలుతురు అయినాక పొయి తడకును తెరుస్తును. అప్పుడంతా తడుకును మూసిపెట్టే ఉందుతుము..."

"ఇప్పుడునూ గేటును మూసే పెట్టుందుతురు కాదు" అంటా అడిగితి.

"అవ్వ, ఇప్పుడు మూసేదొచ్చి కాసులు దొంగతనం పోకుండా ఉండేదానికి, అప్పుడుదానికి కాదు. అప్పుడంతా తడుకును తీసుంటే సాలు, వాకిలి సల్లేవాళ్లు లోగా దూరి పేండను ఎత్తుకొని పోదుస్తురు. దాన్నించి అందురూ ఒగ కుట్టి తడుకును అయినా గేటుగా పెట్టి కట్టేస్తురు. అయితే నే మట్టుకు ఎత్తుకొని పోనీలే అనేసి తెల్లారతానే తడుకును తెరిసి పెట్టేస్తును..."

"పేండను దొంగిలించుకొని పోతురా" అరుదుపడి అడిగినాండు అరి.

"ఆ కాలానంతా అట్టదా" అనేసి ఊవా మళ్లా కతను ఆరంబిచ్చె.

"సరింగా అదే వేళకు పనిచేసే మాదిగాండ్లు వచ్చేస్తురు. అప్పుడు మన ఇంటి మాదిగాపె పేరు సక్కర. ఆపె వచ్చి బాబాయిల పేండను ఎత్తేది, బయిటంతా ఊడిసేది, ఇది మాదిర పనులంతా చేసును. పని అంతా ముగించినాక ఆపెకు నేను టీ పోసిస్తును. ఆ వేళకు సరింగ టీ వాసన పట్టుకొని, మన ఇంటికి తూరుపు తట్టు ఇంట్లా పనిచేసే దుక్కి అనే మాదిగాపె వచ్చేసును. వచ్చి, మన సక్కరకూడా మాటాడుకొని ఉండేమాదిర ఉండి 'నాకొగ కోర ఉడుకునీళు పోయండ తాయి' అంటా నన్ను అడుగు. దుక్కి దానికే వచ్చుండేది అని నాకు తెలుసునే..."

"ఏమి ఊవా, ఉడుకునీళు అంటే ఏమి?" అంటా అడిగినాండు అరి.

"టీరా, టీనే వాళ్లు అట్ట అనేది" చెప్పింది ఊవా.

'అది సరి ఊవా. దుక్కినూ నీతో తెలుంగులోనే మాటాడుకునా' అడిగింది అచ్చు.

"అవ్వ, అనిక మాదిగాండ్లు ఏమి మాట్లాడుతురు. ఏడ ఉంటేనూ మాదిగాండ్లు మాటాడేది తెలుంగు దా, సరి నడువు నడువులా దూరకుండా చెప్పేది వినండ" అంటా కతను ఆరంబిచ్చింది ఊవా.

"అప్పుడు మీ అమ్మలేసి ఇవతలకి వచ్చి, తిన్నపైన కూసుండి టీ తాగుకొనే, సక్కరనూ దుక్కినూ మాట్లాడుకొనేది. వినుకొని ఉండు. నేను టీ గొనిపోయి వాళ్లకు ఇచ్చేసి వాళ్ల మాటల్ని వినుకొని ఆడనే నిలుసుంటును. వాళ్లు ఊరునాయం ఉలగనాయం అన్నిట్నీ మాటాడుకొని ఉంటురు. దుక్కి ఉండుకొని, 'ఆడ, మద్దిన్నోరు ఇంట్లా-తెలుసుకాదు, నేను పని చేసే ఇల్లు-దినమ్మూ జగడాలే. పండగకు గాజులు వేసుకొనేక్కి నేను కాసులు అడిగితే, ఇయ్య నొప్పననేసిరి' అనింది. 'ఆ మద్దిన్నోరు ఇంటిగాళ్లు అట్టదా ఓటీ ఇయ్యరు' అనింది సక్కర.

ఇట్ట మాటాడుకొనే టీని తాగేసి, 'నే వచ్చేను తాయే' అనేసి పోవు దుక్కి. తడుకు దగ్గిరికి పోడిసి మళ్లా తిరిగి వచ్చు. 'ఏ సక్కరా, మా ఇంటివారకు వస్తివంటే ఇంటికి రా, ఒగ గుమ్మిడికాయి చిక్కుండాది, పంగు యేసుకోవచ్చు అంటా కూసుండు. మళ్లా వాళ్లు మాటాడే దానికి ఆరంబిచ్చుతురు.

'ఏయ్ దుక్కి మద్దిన్నోరు ఇంట్లా పనిచేసేవు, అయితే ఉడుకునీళుమటుకు ఈడకు వచ్చి తాగేవు' అంటా అడిగితి ఒకనాండు.

'అవుండా తాయే, వాళ్లు ఉడుకునీళు పోసే కత ఊరుకంతా తెలుసునే, మీకు తెలవదా. తెల్లవారే ఉడుకునీళు పెట్టి వాళ్లు అందురూ తాగేస్తురు. ఆ వంచిన టీ ఆకును ఎత్తి ఎండబెట్టి పెట్టేస్తురు. నా బోంటిది పోతే తాయీ, ఆ ఆకునే యేసి మళ్లా చేసేది. దాన్లా ఒగ సొట్టు పాలునూ ఉండేలేదు, ఉత్తనీళుదా, మీరయితే గట్టింగా పెట్టిపోసేరు. మీ చేతులా ఒగ ఉడుకునీళు నోరు తాగచ్చని వచ్చేది తాయీ' అనింది దుక్కి".

కతకు నడువులా దూరి "ఏమి ఊవా, ఈ పెరిమకు టీ పెట్టి పోస్తివా" అంటి నేను.

"ఏమి పెరిమకు, అప్పుడంతా అట్టనే. మన తోంటలా పనిచేసే వాళ్లంతా నా చేతులా ఒక కోర టీ తీసి తాగేసే పనికి పోతురు. ఆ దుక్కి ఏ పలుకునీ ఒక పారిలా విడవదు. తడుకు దాంక పోవు, తిరిగి వచ్చి సక్కరకూడా మాటాడు. ఇట్టనే ఒగ పదిపారి చేసు.

నాండు నేను కొట్టాములోగా పని చేసుకొని ఉండితి. దుక్కి మళ్లా వచ్చి తాయీ తాయంటా పిలిసింది. 'ఏల దుక్కి' అంటా బయటికి వస్తి.

'తాయే, మీరు ఉడుకునీళు పెట్టేసి, ఆ వంచిన ఆకును ఏమి చేస్తురు తాయీ' అంటా అడిగింది. నేను ఏలంటా అడిగితి.

'ఆ ఆకునుగాన మద్దిన్నోరి ఇంటి తట్టుకువిసిరేరు. విసరద్దండ తాయే' అనేసి పోడిసె దుక్కి" అంటా కతను నిలిపింది ఊవా.

రచయిత్రి ఫోను: 04252-227001

| | |
|---|---|
| **ఓటి :** ఒక్కటీ (ఏమీలేదు, ఏదీలేదు అనే దగ్గరంతా ఓటీ లేదు అంటారు.) | |
| **కడసీ :** చివర | **బిన్నా :** త్వరగా |
| **వుడవ :** కంటే 'తాగేనుడవ' అంటే 'తాగేకంటే' అని.) | |
| **కందుకొను :** పట్టించుకొను | **వచ్చేముడి :** వచ్చేవరకు |
| **అరుదు :** ఆశ్చర్యం | **బాబాయిలు:** పశువులు (చిన్నపిల్లల మాట) |
| **కోర :** గ్లాసు | **పంగు :** భాగం |
| **సొట్టు :** చుక్క / బొట్టు | **పెరిమ :** గొప్ప |
| **కొట్టాము :** వంటిల్లు. | |

జనవాణి

# బుద్ధుని బోధనలు - ప్రాసంగికత

'శ్రీ వుప్పల నరసింహంగారి లఘు వ్యాసం చదివితే 'ఇది మనస్ఫూర్తిగానే వ్రాశారా! - లేక ఒక చర్చ ప్రారంభిస్తే స్పందన ఎట్లా ఉంటుందో చూద్దాం అని వ్రాశారా' - అనిపించింది. ఎందుకొరకైతేనేమి, మంచి విషయంమీద మంచి చర్చ మంచిదేగదా! అనిపించింది. నేడు బౌద్ధానికి ప్రాసంగికత లేదు' అన్న మొదటి వాక్యం చాలు చర్చకు.

'నేడు బౌద్ధానికి ప్రాసంగికత లేదు' అన్న మొదట వాక్యం చాలు చర్చకు మతం పేరుతో హింస, చమురు వంటి సహజ వనరులకోసం హింస. ప్రపంచ ఆధిపత్యం కోసం హింస, వనరుల దుర్వినియోగంలో ప్రకృతిపై హింస. ఇట్లా సహస్రముఖాలుగా హింస ఇబ్బడి ముబ్బడిగా పెరుగుతున్న కాలంలో కరుణను, మైత్రిని అహింసను బోధించే బౌద్ధంకన్నా ప్రాసంగికత మరి దేనికుంటుంది.

శాస్త్ర ప్రాతిపదికమీద హేతుబద్ధంగా - ఆలోచించే ఆధునిక యుగానికి - అదే ప్రాతిపదికమీద వ్యక్తి గౌరవం ఇస్తూ హేతుబుద్ధిని ధర్మంవైపుకు త్రిప్పగల సిద్ధాంతం మరేమున్నది? ఇది చాలదా నేటి ప్రాసంగికతకు?

పరిమిత జనసమూహానికి చెందిన భాషల అస్థిత్వ పోరాటానికి ప్రాసంగికతను అంగీకరిస్తున్నపుడు మానవ సంక్షేమానికి మారణ సంక్షోభం కలిగించే ఉగ్రవాదం ఉద్విగ్నమయిన ఈ సమయంలో బౌద్ధానికి సందర్భశుద్ధి ఇపుడు కాకపోతే మరెప్పుడు? బహుశ బుద్ధుని సమ'కాలం'కన్న ఇప్పుడే బౌద్ధానికి సందర్భోచితి ఎక్కువ. బౌద్ధానికి వ్యక్తనిష్ఠమయిన ప్రాసంగికత ఎంత ఉందో అంతర్దేశీయ ప్రాసంగికత అంతకుమించి శతాధికంగా ఉంది.

ఇంద్రియనిగ్రహం - అరిషడ్వర్గ విజయం- నిర్యాణం (ముక్తి) వీటి పరిపూర్ణ సంసిద్ధి మీరన్నట్లు కోటికి ఒక్కరికే కావచ్చుగాక, రెండడుగులు ముందుకు నడచినా- పురోగమనమే గదా! మనం చేసే ప్రతి తప్పును మన అంతరం ఏకాంతంలో ప్రశ్నించే దశకు మనలో నైతిక చేతన మేలుకుంటే అది కొంతమేలే కదా! అది మతాలు, ధర్మబోధకులు చేసిన కృషి ఫలితమే.

ముక్తి అంటే దుఃఖం నుండి విముక్తి అన్నది ప్రధానమయిన అర్థం. పారలౌకికాన్ని అంగీకరించకపోయినా దుఃఖవిముక్తి లౌకికానికి గూడా అవసరమే. లోకసుఖాలు దుఃఖానికి క్షణిక ఉపశమనాలు మాత్రమేనని విజ్ఞులకు తెలియవచ్చుగాక - వస్తు వినియోగ వ్యామోహం ఉన్న లోకానికి ఆ వాస్తవాన్ని మళ్లీ మళ్లీ చెప్పవలసిన ఈ సందర్భంలో బౌద్ధంకాక మరెవరు ఈ బాధ్యత నెరవేర్చాలి?

బుద్ధుడు భౌతికవాది అన్నారు వుప్పలవారు. అతను నిరీశ్వరవాది. అనాత్మవాది. క్షణికవాది. కార్యకారణవాది. కాని భౌతికవాదికాదు. అతను మానవ నిర్మాణ మూలకాలుగా చెప్పిన పంచస్కంధాలలో రూపస్కంధం ఒక్కటే భౌతికం - పదార్థమే పరమసత్యమనలేదు. పండితులు ఇంకా అధికంగా వివరిస్తే పాఠకులకు ప్రయోజనకరంగా ఉంటుంది.

బుద్ధుడు చెప్పినవి స్వాంతనవాక్యాలు మాత్రమేనని అన్నారు. స్వాంతనవాక్యాలు తత్కాలంలో ఎంతో ఉపశాంతినిస్తాయి. బుద్ధుని వాక్యాలు అట్లాకాదు. అవి ఆచరణీయాలు. శ్రవణం వల్ల కాక ఆచరిస్తే మాత్రమే దుఖ నివారకాలు.

అమరావతి సంగతి వచ్చింది గనుక రెండు మాటలు చెప్పాలి. అమరావతి మ్యూజియంలో శిల్పఫలకంలో శిల్పించిన బుద్ధుని పాదముద్రలు సాముద్రిక చిహ్నాలు మాత్రమే. అవి బుద్ధుని బోధలు కావు-జీవిత ఘట్టము కాదు. వెయ్యి సంవత్సరాల తర్వాత భక్తితో చేసిన శిల్పకల్పన.

అదే మ్యూజియంలో మరో ఫలకంమీద వేరొక దృశ్యం ఉంది. శుద్ధోదన మహారాజు మనుమడయిన రాహులుని తోడ్తెచ్చి నగరి బయట విడిది చేసి ఉన్న తండ్రిని చూపించబోతే అక్కడ బుద్ధుని భౌతికరూపం బదులు 'ధర్మకాయం' ఉన్నట్లు చిత్రించాడు అమరావతి మహాశిల్పి. అది చూస్తే శ్రీ వుప్పలవారి కండ్లు చెమర్చి ఉండాలి! కనుక-అన్నింటిని ఖండనలకు పూనుకుంటే ముండనలకు పూనుకొనే సిద్ధాంతాల ధర్మాలే ఉండవు-ధార్మిక అరాచకం తప్ప.

మరొక అంశం 2006లో కాలచక్ర దీక్షలకోసం జంతుబలులు జరగలేదు. వేలాది భిక్షువులు మాంసాహారం తినలేదు. భిక్షువులు కాని సాంసారిక (ఉపాసక) బౌద్ధులు మాత్రం తిన్నారు. అది నిజమే. బలులు తంత్ర దీక్షా కలాపంలో భాగంకాదు- భిక్షువుల ఆహారమూ కాదు- ఇది అమరావతిలో గమనించాను.

మరొక రహస్యం చెపుతాను. ఒకసారి శ్రీలంకనుండి రెండు బస్సులనిండా బౌద్ధ యాత్రికులు వచ్చారు. అందులో భిక్షువుల సంఖ్య చాలా తక్కువ. ఎక్కువమంది ఉపాసక (సంసారిక) బౌద్ధులే. వారికి భోజనాల ఏర్పాట్లు చూడమని ఒక మిత్రుడు కోరేదు. శాకాహారం ఆర్డరిచ్చాను హోటలులో. వారు వచ్చాక మాంసాహారం లేని భోజనానికి నిస్పృహపడ్డారు. అంటే శిక్షణ దీక్షలో ఉన్నవారే శాకాహారులు తక్కినవారు అందరిలాగానే.

**- వావిలాల సుబ్బారావు**, 9866402973

# మతం, ధర్మం: మీమాంస

బౌద్ధంకాని, హైందవంగాని, జైనంగాని ప్రతి మానవుడు పాప కర్మలను త్యజించి, సొంత లాభం కొంత మానుకొని తన శ్రేయస్సుతోపాటు సమాజంయొక్క శ్రేయస్సుని ప్రకృతికి రక్షణయని బోధిస్తాయి. హైందవధర్మం దేవుడు ఒక్కడేనని చెబుతుంది. ప్రతి మానవుడు తనకు అర్థమైన రీతిలో ఇష్టమైన పేరుతో, రూపంలో పూజించుకోమంటుంది. తమ ధర్మ బాహ్యలములయిన వారిని ద్వేషించదు. తమ మతాన్ని మార్చుకోమని చెప్పదు. మత మార్పిడి ప్రయత్నాలు అశాంతికి, అభద్రతను, ద్వేషాన్ని పెంచుతాయి.

హైందవధర్మం ఎవరినీ పాపులుగా పుట్టాడని అనదు. ప్రతి ఒక్కరు దైవాంశ సంభూతులేనని బోధిస్తునంది. ఎవరినీ ద్వేషించవద్దు అంటుంది. శ్రద్ధతో, నిష్టతో ఎవరు ఏ రీతిలో పూజించినా, విశ్వసించినా భగవంతుడు అట్టి భక్తులను సత్ప్రవర్తనులుగా ఉండడానికి దీవిస్తారు. మతాలు, మానవుల సృష్టి. ధర్మం, దైవత్వము కాల ప్రవాహంలో ధర్మగ్లాని జరుగుతూ వుండే, తిరిగి ధర్మాన్ని స్థాపించడానికి సత్పురుషుల రూపంలో భగవంతుడు అవతరిస్తాడు. వివిధ దేశాలలో, వివిధ కాలాలలో, వివిధ ప్రమాణంలో ధర్మగ్లాని జరుగుతోంది. సంస్కర్తలు ఉద్భవించి, ధర్మ పునరుద్దీకరణకు ప్రయత్నిస్తాడు. మతాలకు, ధర్మానికి, మూఢత్వానికి, వివేకానికి ఎంత తేడా వుందో, అంతే తేడా.

**- త్రిపురనేని హనుమాన్ చౌదరి,**

9849067359

# తప్పిపోతున్న అక్షరాలు!

ఏబది రెండక్షరాల వర్ణ మాల
వినసొంపైన శబ్దాల స్వర మాల
కంటికింపైన రూపాల దృశ్య మాల
తెలుగు జాతికి అమ్మనుడి అక్షర మాల
ఏ ఇద్దరు తమిళులు లేదా ఏ ఇద్దరు గుజరాతీలు లేదా ఏ ఇతర భాషల

# అస్సాంలోని తెలుగువారి తనివి తీరేదెన్నడు?

**నేను** ఇటీవల సి.సి.ఆర్.టి. శిక్షణ నిమిత్తం ఈశాన్య రాష్ట్రాలలో ఒకటైన అస్సాం రాజధాని గౌహతి వెళ్ళాను. సుమారు 25 ఏళ్ళ క్రిందట కూడా ఒకసారి నా స్నేహితుడు మచ్చ జనార్ధనరావు కోరిక మేరకు దులియాజాన్ వెళ్ళి అక్కడ నుండి మా ప్రాంతీయులు (శ్రీకాకుళం జిల్లా, పలాస, వజ్రపుకొత్తూరు మండలాలనుండి వలస వచ్చిన ఉద్దానం ప్రాంత కార్మికులు) నివసిస్తున్న తీన్‌సుకియా, మారగిరేటా, శివసాగర్, డిబ్రూగర్, దిన్‌పూర్ వెళ్ళి తెలుగువారిని కలిసాను. అస్సాంలోని తెలుగువారు నివసిస్తున్న ప్రాంతాలను పర్యటించడం ఇది రెండవసారి.

ఈశాన్య రాష్ట్రాలైన అస్సాం, మేఘాలయ, నాగాలాండ్‌వంటి రాష్ట్రాలకు ఆంధ్రప్రదేశ్‌నుండి ముఖ్యంగా ఉత్తరాంధ్ర జిల్లాలైన శ్రీకాకుళం, విజయనగరం, విశాఖపట్నంనుండి స్వాతంత్ర్యానికి పూర్వమే వలసలు ప్రారంభమయ్యాయి.

పుట్టిన గ్రామాలలో ఉపాధిలేక అస్సాంలోని ఆయిల్ ఇండియా కంపెనీలో, కర్రమిల్లులు (ప్లైఉడ్ ఫ్యాక్టరీ)లలో, హోటల్స్‌లో పనిచేసేందుకు, మున్సిపాల్టీలలో పారిశుద్ధ్య కార్మికులుగా పనిచేయడానికి వలసపోయారు.

శ్రీకాకుళం జిల్లానుండి అగ్నికుల క్షత్రియ (వల్లి), యాదవ, వాడబలిజకులాలవారు ఎంతోమంది అస్సాం ఆయిల్ ఇండియా కంపెనీలో కార్మికులుగా చేరగా మిగతావారంతా కర్రమిల్లుల్లో (సామిల్) కార్మికులుగా చేరారు. విశాఖపట్నం జిల్లానుండి దళిత కులాలవారు గౌహతి మున్సిపల్ కార్పొరేషన్‌లో పారిశుద్ధ్య కార్మికులుగా చేరారు. కొద్దిమంది రైల్వేలో చిన్నపాటి ఉద్యోగాలు చేస్తున్నారు. వీరిలో చాలామంది కుటుంబాలతో అస్సాంలోని పై ప్రాంతాలలో నివసిస్తుండగా మరి కొంతమంది స్వగ్రామాలలో కుటుంబాలను ఉంచి అప్పుడప్పుడు వచ్చి వెళ్తుంటారు.

1990 దశకం వరకు వీరు తమ అమ్మనుడి తెలుగు పట్ల నెనరుతో స్వరాష్ట్రంలో నేర్చుకున్న తెలుగును అక్కడి తెలుగు ప్రజలకు నేర్పారు. ముఖ్యంగా టెలిఫోన్ సదుపాయాలు లేని ఆ రోజులలో స్వగ్రామాలలో నివసిస్తున్న తమ కుటుంబాలకు ఉత్తరాలు రాసుకోవటం, వచ్చిన ఉత్తరం చదువుకోవడానికి కావలసినంత తెలుగును ఇక్కడి తెలుగు ప్రజలకు నేర్పారు.

తరువాత బి. తమ్మయ్య, నౌవడ, సత్యనారాయణవంటి వారి కృషివలన అస్సాం తెలుగు సంఘం ఏర్పాటు అయింది. అస్సాంలో దిబ్రూగర్, తీన్‌సుకియా వంటి ప్రాంతాలలో వీరి కృషి ఫలితంగా 1 నుండి 10వ తరగతి వరకు తెలుగు మాధ్యమంలో బోధించడానికి సుమారు 10 పాఠశాలలు ఏర్పాటు అయ్యాయి. 2004 వరకు ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వమే అక్కడి పాఠశాలలకు పుస్తకాలను సరఫరా చేసేది. తరువాతకాలం నుండి తెలుగు పాఠ్యపుస్తకాల సరఫరా నిలిచిపోయింది. తెలుగు సంఘాలవారు ఎన్నిసార్లు విజ్ఞప్తిచేసినా, పత్రికలలో వార్తలు ప్రచురించినా తెలుగు రాష్ట్రం పలక లేదు.

అలాగే ఉద్యోగరీత్యా జోర్హాట్‌లో గత 30 ఏళ్ళుగా నివాసం ఉంటున్న బుద్ధిరాజు రమణశ్రీ లాంటివారు అస్సామీ భాష నేర్చుకొని అస్సామీ–తెలుగు సంస్కృతి సంప్రదాయాలపై పుస్తకాలను వ్రాసి తెలుగులోకి అనువాదం చేసారు. ఇది సంతోషించదగ్గ విషయం.

మాతృభూమికి దూరంగా ఉంటూ అస్సాం రాష్ట్రంలో తెలుగుభాషకోసం తపిస్తున్న తెలుగువారి తనివి తీర్చడం తెలుగు రాష్ట్రాల, తెలుగు భాషాభిమానుల కనీస కర్తవ్యం. తెలుగు పాఠశాలల పునరుద్ధరణకు, తెలుగుభాష వ్యాప్తికోసం తెలుగు పీఠాలను ఏర్పాటు చేయడం ప్రభుత్వ అకాడమీల బాధ్యత.

**బద్రి కూర్మారావు**, 9704798643

వారైనా కలిసినప్పుడు, వారి వారి మాతృ భాషలో హాయిగా, ఆనందంగా మాట్లాడుకోవడం చూస్తుంటాం. సరిగా గమనించండి, వారు వారి మాతృ భాషలోకి వెళ్ళిన తరువాత ఆంగ్ల పదాలు అతి తక్కువగా దొర్లుతాయి, అది కూడా వారి భాషలో ఆ పదాలకు తేలికైన పదాలు లేని వాటికే.

కానీ, ఏ ఇద్దరు తెలుగువారు కలిసినా, అదే పరిస్థితి ఉందా? ఉంటుందా? నమ్మకంగా చెప్పలేం. లెక్కలేనన్ని ఆంగ్ల పదాలు మన మాతృ భాషను దురాక్రమణ చేశాయి, చేస్తున్నాయి. అఖండ భారత దేశాన్ని ఇక్కడి వారి మధ్య ఉన్న అనైక్యత ఆసరాగానే అనేక జాతులు, విదేశీయులు – వందల సంవత్సరాలు పరిపాలించాయి. ఆ అవకాశం మనమే, మన అనైక్యతే కల్పించింది. మన భాషలో పరాయి పదాలు తిష్ట వేయడానికి కూడా మనమే కారణం కాదా? 'అమ్మ,నాన్న' అంటే నచ్చలేము, 'మమ్మీ,డాడీ' అంటే ఆనందం. తెలుగుపత్రిక లేదా పుస్తకం చదివితే చిన్నతనమా? ఆంగ్లపత్రిక లేదా పుస్తకం అయితే గొప్పా?

పాతుకుపోయిన పరాయివాళ్ళను పారద్రోలి స్వాతంత్ర్యాన్ని సంపాదించుకున్న మనము, తల్లి లాంటి తెలుగు భాషను నిలుపుకోలేమా? దీనికోసం జరుగుతున్న ప్రయత్నాలను తెలుసుకొని, ప్రత్యక్షంగా పాలుపంచుకోలేకపోయినా, మన ఇంట్లో మనం –మన వాడుక భాషలో, వ్యావహారికంలో, తెలుగుదనాన్ని నింపుదాం. నేటి బాలలే రేపటి పౌరులు. వారే వారి సాంస్కృతిక, సామాజిక వారసత్వాన్ని నిలుపుకొనవలసినవారు. వారి చేత మన తల్లి భాషను మాట్లాడిద్దాం.

'నాకు పని ఉంది' అనటం లేదు, ఏ పిల్లల్ని చూసినా, 'నాకు వర్క్ ఉంది' అంటున్నారు. 'సరే, ఉంటాను' లేదా 'వస్తాను' అని అనటం లేదు, వయసుతో సంబంధం లేకుండా ఎదుటివారెవరైనా, 'ఓకే, బై' అంటున్నారు. అక్షరమాలలోని కొన్ని అక్షరాలు రాతలోనూ, పలుకులోనూ లేకుండా పోతున్నాయి. 'వెళ్లాలి అనటానికి 'వెల్లాలి' అని అంటున్నారు. "కళ్లు" ని కూడా "కల్లు" గా పలుకుతుంటే –మనకు కళ్లలో నీళ్లు తిరుగుతాయి!

**– కె. యస్. వెంకటేశ్వర రావు**, తెనాలి

## 'తెలుగమ్మ ఒడిలో బౌద్ధం' గురించి......

'అమ్మనుడి'లో ధారావాహికగా వస్తున్న 'తెలుగమ్మ ఒడిలో బౌద్ధం' చాలా బాగుంది. వైదిక, బౌద్ధ భావజాలాల తేడాల్ని వివరించిన తీరు, బౌద్ధం తెలుగు వారి జీవితాల్ని ఎంతగా ప్రభావితం చేసిందో విడమరచి చెప్పిన తీరు చాలా ఆకట్టుకుంది. ఈనాడు అందరికీ బౌద్ధం, అది పంచిన మానవీయత ఎంతో అవసరం.

**–రోశయ్య, మధిర.**

అమ్మనుడిలో వరుసగా 'తెలుగమ్మ ఒడిలో బౌద్ధం' అనే వ్యాసాలు చూస్తున్నాను. బౌద్ధం గురించి, బౌద్ధ ధర్మం గురించి, బౌద్ధం మన తెలుగువారిమీద వేసిన ప్రభావాన్ని గురించి గోవర్ధన్‌గారు వివరణాత్మకంగా వివరిస్తున్నారు. **–కట్టమంచి బాలకృష్ణా రెడ్డి, చిత్తూరు**

# పలుకుతీరులో... కొన్ని తీరాలు

(ఆగస్టు సంచికలో 'నాయకులారా, మీ భాషను మార్చుకోండి', పై స్పందన)

**'యొక్క** పదం తెలుగు భాషకు బొక్కలు పొడుస్తుంది'– నార్ల 'అండ్ కొచ్చినబెండే' మరియు పదవాడకం'– బూదరాజు.

యొక్క పదం రాజకీయ నాయకుల్లోనే కాకుండా, విద్యావంతుల మాటల్లోనూ, జాగర్తగా పరిశీలిస్తే, కొందరిలో వూతపదంగా మరికొందరిలో అలవాటుగానూ ఇది విన్పిస్తుంది. టీ.వీ. మీడియాల్లో ఐతే సరేసరి, అలవోగ్గా దొర్లి మనలను ఆటపట్టిస్తూనే వుంటుంది.

1. 'నేను నాయొక్క పెన్నుతో నాయొక్క పుస్తకంలో రాస్తాను'
2. 'నాయొక్క సినిమాస్క్రిప్ట్ ఆయొక్క మనిషి తీశాడు'
3. 'నాయొక్క వుపన్యాసాన్ని మీరు విన్నారా?'

ఇలా మాట్లాడేవాళ్లు 'యొక్క' పదం భాషకే కాక వాళ్ళ వాక్ధోరణికి కూడా బొక్కలు పొడుస్తుందని వూహించరు.

చీరాల కాలేజీలో మాకు తెలుగు బోధించిన కీ.శే. బూదరాజు రాధాకృష్ణ 'అండ్ కొచ్చిన బెండే' ఈ మరియు అంటూ కొన్ని వుదాహరణలిచ్చారు.

'సీతా రామా అండ్ లక్ష్మణ వెంట్ టు ది ఫారెస్ట్ అనే ఇంగ్లీషు వాక్యాన్ని 'సీతారాములూ మరియు లక్ష్మణుడు అడవికి వెళ్లారు' అని కొందరు వ్రాస్తారు తెలుగులో. ఇచట 'అండ్ కొచ్చిన బెండే' అని నవ్వించేవారు. అలాగే నేనూ మా అమ్మా, నాన్నా వచ్చామనేదానికి 'నేనూ, మా అమ్మ మరియు మా నాన్నా వచ్చామంటారా ఎవరైనా? అని ప్రశ్నించి అలా కొందరంటారనీ, వ్రాస్తారనీ చెప్పేవారు.

ఉదా:– 1. ఇచ్చట పాలు, పెరుగు మరియు వెన్న లభించును.

2. ఇచట అన్ని రకాల ఫ్యాన్సీ వస్తువులు మరియు గిఫ్ట్ ఐటమ్స్ దొరుకును.

ఈ ప్రకటనల్లో మరియు లేకున్నా అర్థం వస్తుంది – ఎందుకు వ్రాస్తారు మరి! అనేవారు.

ఇక 'బడు' అనే పదం సంస్కృత, ఇంగ్లీషు భాషా దాస్యం నుంచి జారిపడే బండరాయి అనేవారు.

1. ఈ విషయం నేను చెప్పలేదు అనటానికి నాచేత చెప్పబడలేదని అంటారనీ
2. ఇక మీ ఆర్జీలు తీసుకొనమ అనేదానికి – ఇక మీ ఆర్జీలు తీసుకొనబడవు అని వ్రాస్తారని చెప్పేవారు.

ఇవి చిన్న చిన్న పొరపాట్లే, తొందరపాట్లే గాని జాగర్త తీసుకోకుంటే ఇవే చొరబాట్లుగా, అలవాట్లుగా మారతాయనేవారు, హెచ్చరించేవారు.

ఎప్పుడైతే శిశు తరగతుల నుంచి ఇంగ్లీషు మీడియం మొదలైందో ఈ జాడ్యం ముదిరం దనుకుంటాను.

**వెలుగు వెంకట సుబ్బారావు, చీరాల**




కవిత

# కరుడు కట్టిన ప్రకృతి

విశృంఖలత్వం
కన్నబిడ్డలను
హత్య చేయిస్తోంది

ఉన్మాదం మనిషితనానికి
ఉరివేస్తోంది

రాక్షసత్వం
మనసును చంపేస్తోంది

మసకబారిన బంధాలు
కూడబలుక్కున్నట్లుగా
కనిపించని కుట్రలమధ్య
నుజ్జయిపోతున్నాయి

అడ్డదిడ్డమైన అలవాట్లు
స్పృహలేని- జీవితాలనిస్తుంటే!
స్వేచ్ఛ సహజీవనాలపేర
అమ్మలు-నాన్నలు
రణక్షేత్రాలుగా మారి
కడుపున పుట్టినవారిని
కట్టుకున్నవారిని
కన్నవాళ్ళను కూడా
కాల రాచేస్తున్నారు!..

విషసంస్కృతిలో
భగ్నప్రేమికుల్లా...
మర్రి ఊడలకు
స్వప్నాలను వేలాడదీస్తున్నారు
నిమిత్త మాత్రులమేనంటూ...
ప్రబోధాలు వల్లేవేస్తున్నారు.

కాలంతోపాటు
విలువలు మారిపోయాయా!
మారణహోమమే
మనిషిగా మారిపోయిందా?
ప్రకృతే కరుడుకట్టిందా?

**– బండారు విజయ**
ఫోన్: 8801910908

గల్పిక

# పుష్కర తానాలు

- శ్రీ గంగుల బాబు

**మూడు** రోజుల సంది గుబులైతాందే' అంటే
ఎంద్కుట? అనె మా యాడది
రోజు అద్దమ రేతిరి జామున
ఎవ్వల్లో పిలిసినట్లుని పిస్తది
తలుపు దీసి తలవాకిట్లకి బోత
ఎదురుంగ, బాగసియ్య, వట్టి, బలిసిన, దున్ననెక్కి
కిరీటం బెట్కని, గదనొకసేత
పగ్గం మరొకసేత వట్కని
ఉరుముత నాయేపే సూత్తాంటె
అమ్మో యమినోడనిఉలిక్కివడ్త
మేల్కస్తది. ఇంకనిద్దన వట్టది
రోజిదేవరస అంటె.
అవునయ్యా! పానమంటె, తట్టెడా బుట్టెడా
ఎన్నడు బుస్సుమంటదో దెల్వది.
ఆ యమినోనిసేత వడకుంట
ఉండేటంద్కె, గద మన
వూరు వూరు పుస్కరాల, కురుకు తాన్టు
మనవూల్ల మనమే మిగిలినం
నువ్వేమో ఎడ్డిమంటె తెడ్డి మనేటోని వాయె
దూరమా గోదారి వక్కపొంటెనె, గద
పొయ్యొదమయ్యా అంటే వినవు అనె
పుస్కర తానమాడినోల్లను సూత్తె
యమినోనికి భయమా అంటి.
తెల్వకంటున్నవా, తెల్పే, ఎకసక్కెమాడతాండవా, దెల్వది
మూన్నెల్ల ముందునుంచి
రాజకీయ నాయకులు జెప్తలేరా?
దినం దినం పత్తిరికల్ల కమ్మలు, కమ్మలు
రాస్తాంటె జూస్తలేవా?
టి.వి.లల్ల ఇర్వయి నాల్గంటలు, ఒర్లతాంటె, వింటలేవా
పుస్కర తానాలు జెయ్యన్టి
గటేడు తరాలు, గిటేడు తరాలు తరిస్తరని.
గా, సెప్పెటోల్లేమన్న సిన్నా, సితకోల్లా
నీలెక్క తెల్విలేనోల్లా
శాత్తరాలు, పురాండాలు సదివినోల్లు
తెల్లబట్టలోల్లు నల్లబట్టలోల్లు
పసుబ్బట్టలోల్లు పచ్చబట్టలోల్లు
ఎఱ్ఱ బట్టలోల్లు - కావిరంగు బట్టలోల్లు
బోడి గుండోల్లు గడ్డాల్వెంచినోల్లు
తల జెడల్గట్టినోల్లు, ఒక్కల్లేంది
సన్నాసులంతా సెప్తాన్టు తానాలు జెయ్యన్టి
పున్నెలోకాలకు బోన్టి. లేకుంటే పాపాన బోతరని.
సరే! నీకు నమ్మకమున్నా లేకున్నా
పదిమంది నడిసే బాటల నడవద్దా
మనం జనంల బతుకుతున్నమా
అడవిల బతుకుతున్నమా
యమినోడు గనవడ్తాండే, అని నీవేసెప్తివి.
అది గూడ, ఓ ఎచ్చుంకనే, నయ్యా
పోదామయ్యా తానాలకు అనె
తరిజూసి, ఉండేల్దెబ్బ, గొట్టుడులో
మా యాడదాని తర్వాతనే, మరెవల్లయినా
సరే అని బల్లెల్లినం
బద్దరజలంనుండి రాజమందిరి దన్క
జనసందరమే జొరబడ సందులేదు
పాపికొండ, లీకడున్న, కట్కూరనె, సిన్నవూల్ల,
జనం తక్వ గుండె, ఆ రేవుల దిగినం
మున్గె ముందు ఇద్దరం కొంగుల్గట్టి మున్గలంట అన్నది
ఎంద్కుట అంటి
మల్ల అచ్చె జన్మల గూడ గిట్టనే వుంటమట అనె.
గదేందే! గోదాట్ల తానమాడితె
సొరగలోకం బోతగద గక్కడికి నీవెట్లొస్తవు.
మొలోల్లే, గాని ఆడోల్లక్కడి, కచ్చిన
దాకలాల్లేవు, మరి. అయినా
గదేం దట్టంటవు గక్కడ నీవొక్కనివే ఎట్టుంటవు అనె
ఒక్కనెందుకుంటనె ఇందరన్న నుట్టు
తైతక్కలాడే, టోల్లల్ల, నాసోబతికి
ఎవ్వల్లు రారంటావా? అంటి
నీముకానికదొక్కటే తక్వ.
నీ దరిద్దరపు బుద్ధి బయటవెట్టినవు
గిక్కడగాదులె అంతాయింటాను
సిగ్గవోతది. ఇంటికి బాసెప్తనీ పని అంది
అరె! నోరు జార్తినే అని, నాలగ్గర్పుకకుని సోయి దెచ్చని,
ఎహె! తియ్! పరాసికానికన్న, గని, నిజమనుకున్నవా
వాల్లంతా బూవి బుట్టినప్పుడు బుట్టిన ముసలవ్వలు
వాయి వరసల్లేని వంకర ముండలు, వాల్లెవరికి గావాలె.
నడువ్ జలుబు జేస్తదని బయ బయంగనే
దానొంకజూస్తి. నవ్వును పెదిమల, మద్దెన బిగబడ్తాంది.
అమ్మయ్య గండం గడిసిందని, వూపిరి బీల్చుకున్న
బయటి కచ్చినం
దారి మద్దెలడిగితి, ఏయే ఎమినోడు రాడంటవా అని
రాడుగాక రాడు, అచ్చిన నీకేం బయ్యం
పుస్కర తానమాడ్తినని , యాది జెయ్యి, సక్కవోతడనె.
అది జెప్పినట్టె, వారంరోజులదన్క
కంటినిండ - కమ్మగ నిద్దరవోతి
నిన్నట్రాత్తిరి, అలికిడయితే, బయటికి బొయ్ని
ఎవ్వల్లు గనవడలె.
గుదిగొయ్యలు దీసి, బజాట్ల కెల్లిన
అదే యమినోఓడు దున్ననెక్కి, గన్వడ్డడు.
ఇంతకు ముందు వాన్ని జూత్తెనే

మిగతా 47వ పేజీలో...

స్మృతి మంజూష-3

# తెన్నేటి సూరి

- డా॥ సోమసుందర్ ఆవంత్స



**నూత్న** దేశపు ఆనందంలో పాలుపంచుకోగల అదృష్టానికి నోచుకోకుండానే, నా ప్రియమిత్రుడు ప్రఖ్యాత రచయిత తెన్నేటి సూరి కన్నుమూశాడు. క్రూరమైన ఇనుపగొలుసులతో తన మనసు బంధితమైనది. ఆ గొలుసులు తెగి తనకి ఒక శుభోదయం కలగాలని అతని మనసు ఉవ్విళ్ళూరింది. ఈ ప్రజానీకాల మూగవేదనను స్వాతంత్ర్యదినం అనే రచనలో వర్ణించాడు. బానిస చీకటి మూకలకు స్వతంత్ర భావోదయం కాబోతుంది. చిరకాల వాంఛలుగా తేలిన స్వప్నరాశినుంచి నవసస్యం మోసులు వారుతుంది. ప్రాణధళాలన్నింటినీ తృణప్రాయంగా త్యాగం చేసిన వీరుల సదాశయ విస్ఫూర్తి సఫల కామనల ప్రదర్శిస్తుంది. సామ్రాజ్యవాదపు చారలపులి జెండా తలవంచి మెల్లగా జారుకుంటుంది. త్రివర్ణ పతాక గగన వీధులందు విజయగర్వంతో ఎగసి పడుతోంది. స్వతంత్ర రథసారథుల ముఖాలపై నవోత్తేజ రేఖలు పులకిస్తున్నాయి.

కాని, ఈ దిక్కుమాలిన కరగోడల కవతల ప్రజలంతా సముత్సాహ వాహినులై పొంగులు వారుతుంటే, ఇక్కడ మాత్రం ఈ మహారాజులకు స్వాతంత్ర్యం ఇనుమడిస్తుంది. సోదర ప్రజానీకం బంధాలు బిగిసిపోతున్నాయి. బానిసత్వం సర్వత్రా పటాపంచలు అయిపోతుంది. అనేభయంతో అమాయక ప్రజానీకం అశ్రులు చాచుతుంది. అది తెలంగాణా హృదయ వేదన. కవి అందరి వేదనలను అక్షరబద్ధం చేసిన విషాదగాథ...'

పోరాటం ద్విగుణీకృతోత్సాహంతో ముందంజ వేస్తూనే ఉంది. అమర వీరుల సంఖ్య రోజురోజుకూ పెరుగుతూనే ఉంది. ప్రళయకాలం విరుచుకుపడుతోంది. ప్రజా జీవనం స్తంభించింది. జయం, దిగ్విజయం అనే జనకంఠం దిక్కులను పిక్కటిల్ల చేస్తుంది. పిరికి చీకట్లు పారిపోతున్నాయి. వీరభానుడు గగన వీధులనుండి దిగి నేలపై నడయాడుచున్నాడు. దున్నే అతి పేదలకు భూమి లభించింది. గుండెలను అరకలుగా పూన్చి బడుగునేల దున్నుతున్నాడు. జమిందారీ దుష్టపరిపాలన కళ్ళు మిటకరిస్తుంది. పల్లెలు పట్నాలు ఒక్కటై పోతున్నాయి. ప్రాణాలు బలిస్తే తప్ప, బ్రతకడం సాధ్యంకాదన్న సత్యం ఆబాలగోపాలానికి అవగతం అయిపోయింది. భవిష్యత్తు సుందర వాస్తవమై భాసించడానికి పిల్లలకోసం తండ్రులు బ్రతుకులొడ్డుతున్నారు. అందరికీ జీవించే హక్కులు సమకూరుస్తున్నారు. బ్రతుకులకు పట్టిన చెదలు దులుపుతున్నారు. ప్రజానీకం నడుమ కృతకంగా నిలచిన ఇనుపగోడలు కూలుతున్నాయి. ముసలి పీనుగ పచ్చని బ్రతుకుని కాపలా కాయటమా అని తిరస్కరిస్తుంది. ప్రజ అంతటా అగ్నిరథం దోపిడిని తొలగించే రక్తాగ్ని రథం తుపాకీగుండ్లని, పూలగుత్తులుగా స్వీకరిస్తుంది. ప్రతి నరుడి గుండెల్లోనూ ఒక చైతన్య స్రవంతి ఉరకలు పెడుతుంది. కర్తవ్య పాలన సహజ కృత్యమై సాగుతున్న అమరవీరులకు కవి హృదయం తలవంచి జోహారులు అర్పిస్తుంది.

శ్రీ తెన్నేటిసూరి 'అరుణరేఖలు' గేయసంపుటికి పూర్వరంగంలో ఎన్ని పద్యకవితలు రచించాడో తెలియదు. తెన్నేటిసూరి గొప్ప నవలలు రాయడమే కాక, అభ్యుదయవాదిగా కథలెన్నో రచించాడు. అవన్నీ అభ్యుదయలోనూ, ఇతర పత్రికల్లోనూ అచ్చయ్యాయి. 'కుయ్యమంతే ఏమిటి, యచ్చి', అనే కథ మన కులవ్యవస్థ మీద రాసిన పెద్దకథ. అలాగే రజాకార్లు ఒక అన్ననీ ఒక చెల్లెలినీ బలవంతంగా తీసుకొచ్చి గదిలో పెట్టి ఇద్దరికీ కళ్ళకు గంతలు కట్టి మగాడిచేత ఆమెని బలవంతం చేయిస్తారు. అది చాలా హృదయ విదారక కథ. తెన్నేటిసూరి ఆకస్మికంగా అనారోగ్య కారణంగా చనిపోయి, తెలుగు సాహిత్యానికెంతో లోటు కలిగించాడు. కథ, నవల, రచనలలో గొప్ప సిద్ధహస్తుడు.

రచయిత ఫోను : 93478 48905

---

*47వ పేజి తరువాయి...*

ఒల్లొనికి, పంచె దడిసెడిది.
గిప్పుడు గదేంలేదు. సిరెత్తి, గయ్యిమన్న
ఏందిది. పదేను రోజుల, సంది జూస్తాండ
నాఎంట బడి, సతాయిస్తాండవు.
నీకెరికె లేదా? నేగోదాట్ల పుస్కరతానమాడిన
గోసిల పాపాలన్ని గోదాట్ల గోట్కపోయె
గింకేం మిగిలిందని అచ్చినవు అంట రుసరుసలాడిన.

అరెవయ్ ఇందన్న, గీ పుస్కర, తానాల
గుట్టు, బాపనోల్లకే, దెల్సెడిది
వాల్లె తాన మాడెటోల్లు
ఇప్పుడిది రట్టయి అందరికి, దెలిసె.

ఇటు పాపాలు జేత్తను-అటు తానాలు జేస్తాన్టు.
నరకంల, నాదుకనం, మూతవడ్డది.
బెమ్మయ్య నాతానకు రమ్మని తాకీదు బంపిండు.
ఏంబని పాటలేని, సోట, గూకుండ, వెద్దడంట.
గిప్పటి దన్క దిర్గిన బూములాయె.
సివరిసారిజూసి వోదమనచ్చిన
నీకోసం రాలె. అని దిగాలువడి బల్కె.
మంచిగైంది నీలాంటి పాపపొని పీడ, ఇర్గడైంది.
అధికారమున్నదని, అంకారంల, గన్నుమిన్నుగానవైతివి.
నీపాపాలు రాయనికి, నీ సిత్తరగుపుతుడే, సిగ్గువడ్డడు.
గిప్పుడుజూడు నీ బదుకు బజార్ల వడే
పుస్కర తానాలు, నీబట్టలూడదీసి
నిన్ను బజార్ల నిలవెట్టె
గింత సోయి, లేనోన్వి, దేవుడెట్టయితివి.
ఇగనన్న, ఇవరం, దెచ్చుకని, బతుకు
అని తిడుతుండగనే
నా భుజం మీద ఒక్కటినూకి
ఏందయ్యా! అర్ధరాతిరి మద్దెల దర్వని
ఏంటా ఎర్రి గలవరింతలు, అని లేపె.
కల్లు నుల్ముకుంట, ఇది కలనానె, అని
తెల్లముకం వెట్టిన. ఏమయితేనేం
పుస్కర తానమా? మజాకానా?

ఫోను: 9391685686

# మరపురాని 'లవణం'

**సు**ప్రసిద్ధ నాస్తికోద్యమనేత, **నడుస్తున్న చరిత్ర / అమ్మనుడి** పత్రికకు అత్యంత ఆత్మీయుడు, తెలుగు భాషోద్యమకారులకు సన్నిహితుడు శ్రీ లవణం ఆగస్టు 14న తనువు చాలించారు. 'లవణం' అనే పేరు కలవారు బహుశా ప్రపంచంలో ఆయన ఒక్కరే. 1930లో 'ఉప్పు సత్యాగ్రహం' ఉద్యమ రోజుల్లో పుట్టినందున తండ్రి 'గోరా' ఆయనకు 'లవణం' అని పేరు పెట్టారు.

'గోరా' (గోపరాజు రామచంద్రరావు) నాస్తికోద్యమ నిర్మాతల్లో ప్రముఖుడు. ఆయన భార్య సరస్వతి, వారి కుమారులు, కుమార్తెలు అంతా ఆయన అడుగుజాడల్లో నడిచినవారే. 'నాస్తికకేంద్రం' పేర విజయవాడ బెంజిసర్కిల్ దగ్గర వుండే పెద్ద ప్రాంగణం వారి కార్యకలాపాలకు కేంద్రం. తండ్రితోపాటు చిన్నతనంనుండే ఉద్యమంలో పెరిగిన 'లవణం' జాతీయ, అంతర్జాతీయ స్థాయిలో మేధావుల, సామాజిక కార్యకర్తల మన్నన పొందారు. మహాకవి జాషువ కుమార్తె హేమలతను పెళ్లాడారు. ఇద్దరూ కలిసి జీవితమంతా నాస్తికోద్యమం, గాంధేయ మానవతావాదం, సామాజిక సంస్కరణోద్యమాలు ఊపిరిగా బతికారు. ఆయన చదువుకున్నది కేవలం ఆరో తరగతి. అక్కడినుండి చదువుకు స్వస్తి పలికిన 12 ఏళ్ళ లవణం తన తండ్రి గోరాతో కలిసి భారత స్వాతంత్ర్య పోరాటంలోనూ, నాస్తికోద్యమంలోనూ అంకితమైపోయారు. అందువల్ల మహాత్మాగాంధీ, వినోబాభావే, మార్టిన్ లూథర్‌కింగ్ జూనియర్, జార్జి విల్లబి, పాల్ కర్ట్జ్ (అమెరికా), హెర్మన్ బోండి (బ్రిటన్), లివింగ్ ఫ్రాగెల్ (నార్వే) లకు సన్నిహితంగా పనిచేశారు. లోతుగా తరచిచూస్తే ఒక గొప్ప మానవుడు ఆయనలో మనకు కనిపిస్తాడు. విద్యాలయాలలో చదువుకోకుండా సొంతగా విజ్ఞానాన్ని పెంచుకొని ఇంగ్లీషు, హిందీ, తెలుగు భాషలలో అనర్గళంగా ప్రసంగించగల వక్తగా, రచయితగా, అనువాదకుడుగా ఎదిగారు. తన ఉద్యమంలో భాగంగా ఎందరో వ్యక్తుల, సన్నిహితుల ఆహ్వానం మేరకు ప్రపంచమంతా పర్యటించి ప్రసంగాలు చేశారు.

ఉతికిన తెల్లని పైజమా, తెల్లని చొక్కా – వాటికి ఇస్త్రీ మడతలుండవు. నిండైన విగ్రహం. మనిషెంత తెలుపో ఆయన మనసు అంత స్వచ్ఛం. తోటి మనిషిని ప్రేమించడమే తప్ప ద్వేషించడం ఎరుగని సాత్వికుడు. ఎదుటివ్యక్తి వ్యతిరేకంగా మాట్లాడినా సంయమనంతో చిరునవ్వుతో మాట్లాడగల సౌమ్యుడు. ఆపదలోఉండి శరణుజొచ్చిన నిర్భాగ్యులను ఆదరించి ఆదుకోవడంలోనూ ఆయన శైలి ప్రత్యేకం. జీవన సహచరి హేమలతతో కలిసి జోగినులను సంస్కరించి వారిని గౌరవప్రదమైన జీవితంలోకి తీసుకురావడంలో ఆయన కృషి సాటిలేనిది. 'సంస్కార్' అనే సంస్థను స్థాపించి ఆదిలాబాద్ జిల్లా వర్నిలో జోగినుల చదువు, మనుగడలకై వారు పాటుపడ్డారు. గుంటూరు జిల్లా 'స్టువర్టుపురం'లో దొంగతనాలకు మారుపేరుగా ముద్రపడ్డ ఎందరినో సంస్కరించి వారికి పునరావాసం ఏర్పాటు చేసి వారి అభ్యుదయంకోసం నిరంతరం కృషి చేసిన ఘనత ఆ దంపతులదే. 1977 దివిసీమ ఉప్పెన సందర్భంలో ఆయన చేసిన సేవ చాలా గొప్పది.

హేమలతగారు కవి కుమార్తె మాత్రమే గాదు. స్వయంగా కవయిత్రి, రచయిత్రి కూడా. లవణంగారు పుట్టింది ఒక విద్యాధిక్యత కలిగిన బ్రాహ్మణ కుటుంబంలో. హేమలతగారు పుట్టింది దళిత దంపతులకు. ఇద్దరి తండ్రులూ సమాజంలో మార్పుకోసం కులరహిత సమాజ నిర్మాణంకోసం కృషిచేసినవారే. లవణం–హేమలతలకు సంతానం లేదు. దాన్ని వారు ఒక అనుకూలాంశంగా మలచుకున్నారు. ఇక స్వార్థానికై పనిచేసుకోవలసిన అవసరం వారికి లేకుండాపోయింది. ఆయన జీవితమంతా సమాజంతోనే. ఆయన రచించిన వ్యాసాలు, చేసిన ఉపన్యాసాలు ఎన్నో – లెక్కకు అందవు. పాల్గొన్న సాంఘిక సంస్కరణ, సేవా కార్యక్రమాల సంఖ్య ఎంతో తెలియదు. ఆయన గొప్ప సంభాషణాచతురుడు. ఎదుటివారిని తన సంభాషణలతో, ఉపన్యాసాలతో ఆకట్టుకోగల శక్తి ఆయన సొంతం.

'తెలుగు భాషోద్యమ సమాఖ్య' ఆధ్వర్యంలో జరిగిన అనేక కార్యక్రమాల్లో ఆయన పాల్గొన్నారు. 'తెలుగువాణి' ట్రస్టు – తమిళనాడులో అసంఖ్యాకంగా ఉన్న తెలుగువారికి తెలుగు అక్షరాలు నేర్పించడంకోసం చేపట్టిన కార్యక్రమంలో లవణం, హేమలత దంపతులు పాల్గొంటారు. నక్సలిజంలో ఉన్న వారిని ప్రజాస్వామ్య స్రవంతిలోకి తీసుకురావడంకోసం, వారిపట్ల ప్రభుత్వానికి ఉన్న వ్యతిరేక ధోరణిని తగ్గించడంకోసం ఆయన కొంత కృషి చేశారు. సమస్యలను వ్యతిరేకదృష్టితో కాకుండా సానుకూలంగా అర్థంచేసుకొని మానవీయంగా పరిష్కరించాలనే తపన ఆయనది. దీనికి ఆయన నమ్మిన



## 'మానవుడు'

అతడు<br>
దేవుళ్ళను ప్రశ్నించిన మానవుడు<br>
మూఢ నమ్మకాలను<br>
ఎదిరించిన హేతువాది<br>
జోగినీ విముక్తి పోరాటంలో<br>
అతడొక సైన్యం!<br>
అతడు అచ్చంగా మానవుడు...<br>
నాస్తిక సంచారి<br>
అతడు లవణం. అంటే... 'ఉప్పు'.<br>
కాదు... మానవాళికి కనువిప్పు...!

– **బోస్కు సత్య**, 9701594727



సమాజసేవకులు
లవణం, హేమలత దంపతులు




రత్న వివాహం : సర్వోదయ నాయకులు సిద్దరాజ్ దడ్డా, డా. సుశీలా నయ్యర్, వధూవరులతో లవణం,

గాంధేయ మానవతావాదమే కారణం. వినోబాభావే ఉపన్యాసాలను అనువదించిన అనుభవం, కొన్నాళ్ళు గాంధీగారి ఆశ్రమంలో సేవచేయడం కూడా ఆయనకు కలిసి వచ్చాయి. అందువల్లే బాబ్రీ మసీదు విధ్వంసం తరువాత జరిగిన అల్లర్లను నిరసించడంలో ఎంత తీవ్రంగా స్పందించారో ఆ తరువాత రామజన్మభూమి సమస్య పరిష్కారానికి సంప్రదింపుల మార్గంలో కూడా కొంత కృషి చేయగలిగారు. విశ్వహిందూపరిషత్ కార్యక్రమాలతో ఆయన పూర్తిగా విభేదించే వ్యక్తే అయినా, ప్రవీణ్ తొగాడియాతోపాటు కొందరు నాయకులతోనూ, అటు ముస్లిం నాయకులతోనూ చర్చలు జరిపి ఒక సర్వసమ్మతమైన అంగీకారాన్ని వారిద్దరి మధ్యా తేవాలని ప్రయత్నించారు. ఇది బహుశా ఆయనతో కలిసి నాస్తిక ఉద్యమంలో వున్న కొందరు సహచరులకు రుచించని సంగతి. ఆయన ఒక పాత్రికేయుడుగా, రచయితగా కూడా ఎంతో కృషి చేశారు. దిన, మాస, వార పత్రికలలో తరచుగా వ్యాసాలు వ్రాసేవారు. **'నడుస్తున్న చరిత్ర'**లో చాలాకాలం 'నవనిర్మాణం' అనే శీర్షికను నిర్వహించారు.

తనవద్ద ఎంతో ఆత్మీయతతో సేవాభావంతో పనిచేసిన 'రత్న' అనే అమ్మాయిని కుటుంబసభ్యుల వ్యతిరేకతను కూడా లెక్కచేయకుండా తన ఆత్మీయ పుత్రికగా ప్రకటించి స్వీడన్ దేశానికి చెందిన పెర్తి హోలోపైనన్ అనే పాత్రికేయునికి ఇచ్చి 2000 సం. డిసెంబరు 26న వార్ధాలోని గాంధీ ఆశ్రమంలో డా॥ సుశీలా నయ్యర్ ఆధ్వర్యంలో వివాహం జరిపించారు. తర్వాత వారికి పుట్టిన పాపకు 'సమైక్య' అని ఆయనే పేరుపెట్టారు. కొద్ది నెలల క్రిందట ఆ కుటుంబం విజయవాడ వచ్చి ఆయనను కలిసినప్పుడు మనుమరాలితో ఉన్న ఆయన ఫోటోను, వ్యాసాన్ని 'జూలై 2015 **అమ్మనుడి**'లో ప్రచురించాము. లవణంగారు వ్రాసిన చివరి వ్యాసం అదే అనుకుంటాను. జీవితం చివరివరకూ తను నమ్మిన మార్గాన్ని విడువకుండా ఎవరిపైనా వ్యతిరేకతను పెంచుకోకుండా ఆదర్శంగా జీవితాన్ని గడిపిన ఒక నాస్తిక ఋషి – లవణం. 15 ఏళ్ళుగా ఆయనతో నాకున్న సన్నిహితత్వం, ఆత్మీయ అవగాహన, ఎంతో నేర్చుకోవడానికి దోహదపడింది. ఎన్నో జ్ఞాపకాలను మిగిల్చింది.. ఆయన 86వ ఏట మరణించారు. సమకాలీన తెలుగు చరిత్రలో లవణంగారికి కొన్ని పుటలు కేటాయించ కుండా ఆ రచన పూర్తికాదు.




**లవణం గారికి నివాళులర్పిస్తున్న 'అమ్మనుడి' సంపాదకుడు సామల రమేష్‌బాబు, ప్రచురణకర్త సామల లక్ష్మణబాబు, తెలుగు భాషోద్యమ సమాఖ్య కోశాధికారి వెన్నిసెట్టి సింగారావు, లవణం గారి బావగారు హరి సుబ్రహ్మణ్యం (వెనుక వున్నవారు)**
(లవణంగారి ఆయన కోరిక ప్రకారం 'స్వేచ్ఛాగోరా ఐ బ్యాంక్'కు తక్కిన శరీరాన్ని కృష్ణాజిల్లా పెదఅవుటపల్లిలోని పిన్నమనేని సిద్ధార్థ మెడికల్ కాలేజీకి ఇచ్చేశారు.)

తెలుగునాట నాస్తికోద్యమ నిర్మాణంలో విజయవాడ లోని నాస్తిక కేంద్రం ఖ్యాతిగాంచింది. దానికి సరస్వతి గోరా, వారి కుమార్తెలు, కుమారులు, తక్కిన కుటుంబ సభ్యులు అందరూ కృషిచేశారు. దాని చరిత్రలో గోరా మరణంతో ఒక అధ్యాయం ముగిసిపోగా లవణం కనుమరుగుతో మరో అధ్యాయం పూర్తయింది. లవణం మరణం తెలుగు సమాజ పునర్నిర్మాణ కృషిలో ఒక లోటుగానే ఉంటుంది. తెలుగు సమాజం లవణం లాంటివారిని ఇంకా తయారుచేసుకోవలసి ఉంది. ముందు తరాల వారికి ఆయన ఒక ఆదర్శంగా మిగిలిపోతారు.

**– సామల రమేష్‌బాబు**

మనసులో మాట

-శ్రీ వావిలాల సుబ్బారావు

# అమరావతి...అమరావతి...అమరావతి!

'అమరావతి' పేరు అవసరాన్ని మించి వినబడుతున్నట్లుంది. అమరావతిని ఆత్మీయ గ్రామంగా చూసుకొనే నాకు సంతోషంగానే ఉంది. అమరావతి అభివృద్ధి వడ్డనలు అసలు అమరావతికి కాదు. అవి ఎప్పుడో నిదానంగా రాబోయే కాలంలో. (సింగపూర్, ఇస్తాంబుల్, చైనా, జపాన్- అంతర్జాతీయ అమరావతికి - శాతవాహన, బౌద్ధ - అమరారామ) అమరావతికి తబ్బిబ్బులేకుండా - కొత్త, రాజధాని అమరావతి అని, అమరావతి క్షేత్రం- అని రెండు విశేషణాలు చెరివొకదానికి తగిలించటం మంచిది. లేకుంటే అక్కడ 'అపురూప శిల్పాలు' కనిపించవు. ఇక్కడ అంతర్జాతీయతా కనిపించదు.

చారిత్రక అమరావతిని హృదయ్-పథకం క్రింద వారసత్వ నగరంగా గుర్తించింది కేంద్ర ప్రభుత్వం. కనుక వారసత్వ శోభలు పాత అమరావతిని అంతర్జాతీయ శోభలు కొత్త అమరావతిని అలంకరిస్తాయేమో! - ఏమయినా అమరావతి నామ సౌందర్యం, ఖ్యాతి నిలిచి వెలగాల్సిందే.

అమరావతి అంతర్జాతీయ సౌకర్యాలతో సర్వదేశ ఆకర్షణీయంగా ఉండటం ఎవరికయినా సంతోషమే గాని సింగపూర్‌కి- అమరావతికి స్వరూప భేదం ఉండాలిగదా! భవనాల ఆకృతులు, నగరాలంకరణలు మన వారసత్వాన్ని జ్ఞాపకం చేయబోతున్నాయా! పెట్టె పేర్చి నట్లుండే భవనాల మూస ఇక్కడగూడ ప్రత్యక్షమవుతుందా! మన శిల్ప రచన, వాస్తు నిర్మాణం, భారతీయతను ఆంధ్రత్వాన్ని గుర్తుకు తేవాలిగదా! జర్మనీ, యూరప్ అనగానే గోథిక్ శైలి - చైనా, జపాన్‌లు అనగానే పైకి వంగిన అంచుల మూలల ఇంటి కప్పులు, ఇస్లామిక్ దేశాలు అనగానే మీనార్లు, డోములు... ఇట్లా జ్ఞాపకం వస్తాయి గదా! అంధ్ర దేశం అనగానే ఏ రూప నిర్మాణాలు జ్ఞాపకం రావాలి? అమరావతి నిర్మాణానికి సింగపూరు ఇంజినీర్లు ఎంత కసరత్తు చేస్తున్నారో నిర్మాణాల రూప సౌందర్యానికోసం నిర్మాణ శిల్పులు అంత కసరత్తు చేయవద్దా! వరంగల్లు నిర్మించ తలపెట్టిన కళాభవన రూపశైలిని గట్టిగా విమర్శిస్తూ, ప్రసిద్ధ చిత్రకారుడు 'మోహన్'గారు చక్కని పెద్ద వ్యాసం వ్రాశారు. కనుక మనంగూడ మన కళావేత్తల సలహాలను సింగపూర్ ఇంజనీర్లకు జోడించాలి. మనవాళ్లు ఎప్పుడూ ఆడని గోల్ఫ్ కోర్టుకు ముందుగానే కేటాయింపులు జరిగాయి. క్రికెట్ ప్రేక్షకులకు విసుగు కలుగుతున్నదని రకరకాల మార్గాలు వెతుకుతున్న క్రికెట్ క్రీడకు అంతర్జాతీయ స్టేడియం ముందు పంక్తిలో కూర్చున్నది. మరి స్థానిక క్రీడా వినోదాల మాట ఏమయినట్లు?

స్థానిక విశిష్టతలను నిర్ధరించటంలో, వాటి రూపు రేఖలను స్థిరపరచటంలో పాలకులు శ్రద్ధ వహిస్తున్నారన్న మంచి మాట గూడ చెవిన పడితే తెలుగు సంస్కృతికి కొంత ఊరట. అమరావతి అన్నది ఒక అందమయిన పేరు మాత్రమే కాదు. అందమయిన సంస్కృతీ సమన్వయం గూడ అందులో దాగి ఉన్నది. ఆంధ్రదేశం లోని విశిష్ట కళలకు ఒక విశ్వవిద్యాలయాన్ని ప్రత్యేకించవద్దా! అది శిల్పాలు వెలసిన చోటనే ఉండటం ఎంత సార్థకంగా ఉంటుంది!! అంతర్జాతీయ నగరం అంటే సౌకర్యాలు, నిర్మాణాలు మాత్రం కాదు. అక్కడ ఉండే పౌరులకు కూడా ఆ స్థాయి ప్రవర్తనలో శిక్షణ అవసరం. శుభ్రత-పౌరమర్యాద-సహృదయ వర్తన-దేశ, భాష సంస్కృతులపై క్రియాశీలమయిన గౌరవం- పాఠశాలల్లో విద్యార్థులకు నేర్పటం ఒక కార్యక్రమంగా ప్రారంభం కావాలి. నూతన సభ్యతను పనిగట్టుకు నేర్పాలి. అందుకు ప్రత్యేక శిక్షణా ప్రణాళికను విద్యాలయాలలో ప్రవేశపెట్టాలి.

తనకు తాను గౌరవించుకోలేనివాడు ఎదుటివాణ్ణి గౌరవించలేదు. మనకు పరదేశ వేషభాషలంటే వ్యామోహమన్నది తెలిసిందే. చైనా, జపాన్ వాళ్ళు వచ్చి ఇక్కడ మకాంవేసి మనల్ని అభివృద్ధి చేయబోతున్నారని - అందుకు ఇపుడే వాళ్లభాషలు- ఆహారపు అలవాట్లు నేర్చుకోవాలన్న ఉబలాటం- కోర్సులు ప్రారంభించాలన్న కుతూహలం కనిపిస్తున్నాయి. వారికోసం దుబాసీలకు శిక్షణ అవసరమే. ముందు నీ భాష సంగతేమిటి? వాళ్ల భాష వాళ్ళకు - మనకు మాత్రం ఇంగ్లీషా! అది ఉభయులకు వారధి. (చైనా దేశపు ఎర్ర చందనం దొంగ ఉదంతం జ్ఞాపకం చేసుకోవాలి). ఆ దేశపు సరుకులు ఆ దేశం భాషల పేర్లలో లిపిలో దిగుమతి అవుతున్నాయి. మరి మన రేపటి ఉత్పత్తులో! ఆంగ్లం అంతర్జాతీయమేగాని 'దేశీయంగా నేనున్నా'నన్న ధీమా కోల్పోగూడదు. ఏ దేశమూ తన సాంస్కృతిక వ్యక్తిత్వాన్ని కోల్పోవటం లేదు.

మనం గూడ ఆంధ్ర గౌరవాన్ని, సంస్కృతీ విశిష్టతను నిలుపుకోకపోతే, రోజుకొక వేషం వేసి నాలుగు రాళ్లు సంపాదించుకొనే వీధి భాగవతుల స్థాయికి దేశమంతా దిగజారిపోతుంది. ఆ దుర్గతి రాకుండా పాలకులు జాగ్రత్త వహించి దేశాన్ని నడిపించాలి. ప్రభుత్వమే వ్యామోహాల బారినపడితే అవి అంటువ్యాధులై ప్రజలకు సంక్రమిస్తాయి. ఎందుకింత మథన పడుతున్నానంటే- రాబోయే కొద్ది సంవత్సరాలలో నూతన సంస్కృతులు- ధన ప్రాబల్యం-సామాన్యులపై నిర్లక్ష్యం- ఉన్నత లక్ష్యాల నిరాదరణ పెరగబోతున్న జాడలు స్పష్టంగా కనిపిస్తున్నాయి. వాటి చీకటి నీడలు మా తరాన్ని వెంటాడుతున్నాయి - కనుక ఈ భయం.

అయితే ఏం చేయాలి అన్న ప్రశ్న నాకే కలిగింది. ఉన్నత బోధనలో మాధ్యమాలు ఎట్లా ఉన్నా- తెలుగుభాషలో సామర్థ్యం. విద్యార్థులకు పెంచాలి. మనం పరదేశాలు వెళ్లినపుడు వారి మర్యాదలు తెలుసుకొని వెళ్లినట్లు- విదేశీయులకు మన మర్యాదలు తెలియచెప్పాలి. మన పట్టణాలు విదేశీయులకు మన అతిథి సత్కారాలలో దేశీయతను పరిచయం చేయాలి. వారికి వినోద కాలక్షేపాలు అందించేటపుడు స్వదేశీయ వినోద కళారూపాలను, రుచిపాకాలను ప్రవేశపెట్టాలి. మనం నేర్చుకొనవలసినవి వారివద్ద ఉన్నట్లే మనం నేర్పదగినవి గూడ మన వద్ద వున్న సంగతిని మనమే గుర్తుంచుకోవాలి. వాటికి మరికొంత చిత్రిక పట్టి నచ్చే రీతిలో కొత్త వారికి పరిచయం చేయాలి. కట్టు, బొట్టు, ఆహారపు అలవాట్లు, పలకరింపు రీతులు అభినందనల తీరు, ఆతిథ్య లక్షణం. పవిత్ర స్థలాలలో పాటించే మర్యాదలు -ముగ్గులుపెట్టడం - ఇంటి గడపల పసుపు కుంకుమలు, గృహాలంకరణ రీతులు, గ్రామీణ పండుగలు వీటన్నింటిలో ఆంధ్రలక్షణం స్పష్టంగా ప్రత్యేకంగా కనిపిస్తుంది. ఇవన్నీ పర్యాటకుల ద్వారా ప్రపంచ సంస్కృతిలా గుర్తింపును పొందాలి. ఈ సాంస్కృతిక ఆదానప్రదానాలకు గూడ అమరావతి ఆంధ్రుల రాజధాని కావాలి.

కొత్త అమరావతిలో ఒదిగిపోతున్న పాత గ్రామాలకు అవే పేర్లు ఉంచాలి. రాచబాటలకు-కూడళ్లకు మన చరిత్ర స్ఫురించేపేర్లు పెట్టాలి. రాజధాని అంతా ఒకసారి చుట్టి వస్తే మన చరిత్ర - సంస్కృతి దిగ్మాత్రంగానయినా తెలియాలి.

నిజాయితీగా, నిదానంగా మనల్ని మనం సంస్కరించుకోవటం మన సభ్యత ప్రపంచ సభ్యతలో మెప్పు పొందే స్థానం ఆక్రమించటం మన ఉత్తమలక్ష్యం. ఆర్థిక ఎదుగుదలకై పడే పోటీకన్నా ఇది అప్రధానమయినదేమీకాదు.

**రచయిత ఫోను: 9866402973**

Owned, printed & published by Samala Lakshmana Babu (9440448244) and printed at Sri Mahalakshmi Offset Printers, 16-7-20, Veera Raghavulu Street, Sharabu Bazaar, Tenali, Guntur Dist. and published from 8-386, Jivaka Bhawan, Angalakuduru Post, Tenali Mandal, Guntur Dist. - 522211. Editor: Dr. SAMALA RAMESH BABU (9848016136)
RNI-APTEL/2015/62362

## తెలుగు భాషోద్యమ సమాఖ్య

# ఆంధ్రప్రదేశ్‌లో తెలుగుభాష రక్షణ, అభివృద్ధి : మహాసభ-సదస్సు

## 28-8-2015న గుంటూరులో ఆమోదించిన తీర్మానాలు

1. తెలుగు భాషోద్యమకారులు ఎంతో పోరాటం చేసి జి.ఒ.నెం: 909/31-12-2013 ద్వారా సాధించుకొన్న తెలుగుభాషామంత్రిత్వశాఖ నిర్వహణకు ఒక భాషావిధానాన్ని, కార్యాచరణ ప్రణాళికను ప్రకటించాలని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఇందుకోసం కొద్దిమంది భాషావేత్తలు, ఉపాధ్యాయులు భాషోద్యమ ప్రతినిధులతో – నిర్ణీత సమయానికి సిఫారసులు ఇచ్చేవిధంగా – ఒక నిపుణుల సంఘాన్ని వెంటనే నియమించాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

2. భాష, సాహిత్యం, సంస్కృతి – ఇవన్నీ పరస్పరాశ్రితాలైనప్పటికీ తెలుగు భాష రక్షణ, అభివృద్ధికి సంబంధించిన అంశాలు, సమస్యలు, కర్తవ్యాలు ప్రత్యేకమైనవైనందున – బడ్జెట్టులో భాషకు ప్రత్యేక కేటాయింపు ఉండాలని, మొత్తంగా సాంస్కృతికశాఖ కేటాయింపులలో దీనిని కలిపివేయరాదని ఈ మహాసభ ఆంధ్రప్రదేశ్ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

3. తెలుగు భాషాసాంస్కృతిక మంత్రిత్వశాఖ క్రింద తెలుగు భాష అభివృద్ధి ప్రాధికారమండలి (తెలుగు లాంగ్వేజ్ డెవలప్‌మెంట్ అథారిటీ)ని భాషావేత్తలు, తెలుగు భాషోద్యమకారులు, ఉపాధ్యాయులు, రచయితలతో కూడిన నిపుణులతో ఏర్పాటు చేయాలని, తెలుగు భాషాభివృద్ధికి సంబంధించిన అన్ని విషయాలపై ఈ సంస్థ నిర్ణయాలే సాధికారికంగా ఉండాలని ప్రభుత్వాన్ని కోరుతూ ఈ సదస్సు తీర్మానిస్తున్నది.

4. ప్రాథమిక విద్యాభ్యాసం మాతృభాషలోనే ఉండాలని ప్రపంచమంతా నిపుణులు అంగీకరించిన సూత్రాన్ని తల్లక్రిందులు చేసే చర్యల్ని ఈ మహాసభ ఖండిస్తున్నది. 1నుండి 5వ తరగతి వరకు మాతృభాషలోనే విద్యాభ్యాసాన్ని తప్పనిసరి చెయ్యాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఆరోతరగతినుండి బోధనా మాధ్యమాన్ని ఎన్నుకొనే స్వేచ్ఛను విద్యార్థికి ఇచ్చినా, రాష్ట్ర అధికారభాష అయిన తెలుగును రెండవ సబ్జెక్టుగా తప్పనిసరి చెయ్యాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

5. 1 నుండి 10వ తరగతి వరకు ప్రభుత్వ, ప్రయివేటు పాఠశాలలన్నిటిలో తెలుగు మాధ్యమంగా లేని సందర్భాల్లో రెండవభాషగా తెలుగును తప్పనిసరి చేస్తూ 2003లో ఇచ్చిన జి.ఒ.నెం.86ను ఎటువంటి మినహాయింపులు లేకుండా అమలు జరపాలని, దానికి కొనసాగింపుగా 11వ తరగతి నుండి డిగ్రీ, పి.జి.లలో కూడా ఇదే సూత్రాన్ని తప్పనిసరి చేసేందుకు ఉత్తర్వులను ఇవ్వాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

6. విద్యావ్యవస్థను పూర్తిగా ఆంగ్ల మాధ్యమంలోకి మార్చేయాలనే ఆలోచనలను విరమించుకోవాలని, ఇప్పుడు తెలుగు మాధ్యమంలో నడుస్తున్న పాఠశాల, కళాశాల స్థాయిలలోని తరగతులను కొనసాగించాలని, వాటిని ప్రోత్సహించాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది. ఎట్టి పరిస్థితుల్లోను వాటిని మూసివేయరాదని హెచ్చరిస్తున్నది.

7. ప్రభుత్వంలోని అన్ని విభాగాలు, సంస్థలు, ప్రభుత్వ-ప్రయివేట్ భాగస్వామ్య సంస్థలు, ప్రభుత్వ సహాయంతో నడిచే సంస్థలు-వీటిలోని ఉద్యోగాలకు తెలుగు చదివి వుండడంతోపాటు తెలుగులో ప్రత్యేక అర్హతనిచ్చే పరీక్షలో ఉత్తీర్ణులు కావడాన్ని తప్పనిసరి చెయ్యాలని, ఈ రకమైన అర్హతలు లేనివారికి పై ఉద్యోగాలను నిషేధించాలని ఈ మహాసభ ప్రభుత్వాన్ని కోరుతున్నది.

8. ప్రభుత్వంలోని అన్ని స్థాయిలలోను పూర్తిగా తెలుగులో పరిపాలన జరగాలని, చట్టాల రూపకల్పన నుండి అట్టడుగు పాలనాస్థాయివరకు తెలుగును తప్పనిసరి చెయ్యాలని, ముఖ్యమంత్రి, భాషా సాంస్కృతిక శాఖ మంత్రి ఇందుకు ప్రత్యేకంగా బాధ్యత వహించాలని ఈ ప్రభుత్వాన్ని కోరుతున్నాం. పాలనాభాషగా తెలుగు అమలు గురించి ఇప్పటివరకు ఉన్న చట్టాలను, ప్రభుత్వ ఉత్తర్వులను పూర్తిగా అమలు చెయ్యాలని ప్రభుత్వాన్ని ఈ మహాసభ కోరుతున్నది.

9. ఉమ్మడి రాష్ట్రంలోని తెలుగు విశ్వవిద్యాలయం, తెలుగు అకాడమీ, ప్రాచ్య లిఖిత భాండారం వంటి సంస్థలను ఉమ్మడి సంస్థలుగానే కొనసాగించాలని, ఇందుకు తగు విధి విధానాలను రూపొందించాలని, రెండు రాష్ట్రాల గౌరవనీయ ముఖ్యమంత్రులు ఇందుకు చొరవచూపి తెలుగుజాతి జనులందరి అభినందనలను పొందాలని ఉభయులకు ఈ మహాసభ విజ్ఞప్తి చేస్తున్నది. అనివార్యంగా అటువంటి సంస్థలను విడివిడిగా ఏర్పాటు చేసుకోదలచుకొంటే, పరస్పర సహకారంతో సమన్వయంతో పంచుకోవాలే తప్ప అల్లరిపాలై తెలుగు ప్రజలకు అపకీర్తిని తేవద్దని రెండు రాష్ట్రాల నేతలకు విజ్ఞప్తి చేస్తున్నది.

